## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100061564

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals
Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

హిందూ మత గ్రంథమాల ప్రథమ కుసుమము

ధర్మోద్ధారక, ఉపన్యాస చక్రవర్తి

బ్రహ్మశ్రీ ప్రభాకర ఉమామహేశ్వర పండితులవారి

ఉపన్యాససారము

# గృహారాజ్యము

కొండా శంకరయ్యగారి ప్రింటింగ్ ముద్రాక్షరశాల,

సికిందరాబాద్.



వెల అణా

# గృహరాజ్యము.

శ్రీకరంబై యమృత మయమైయొప్పు కాలతత్వమున జగత్కల్యాణ మభిలషించు మానవులే ధన్యులు. వారిలో రెండుతరగతులు గలవు. వారిరువురు కలసినంగాని జగత్కల్యాణ మొదవదు. ఆ కలియుటకు తోడుగ జీవయాత్రా విధాన మతిపవిత్రమై యొప్పారినప్పుడే శాంతి చేకూరును.

ఏ యే పురుషులే యే స్త్రీల పాణిగ్రహణ మొనర్ప వలెనో ఎచ్చోట వసింపవగునో ఎటుల వర్తింప యోగ్యమో మున్నగు విషయములు గ్రహించినగాని పై విధానము తేట పడదు.

అందుకే వేదశాస్త్రపురాణములు బయలువెడలెను. మానవు లాచరింపదగిన ధర్మములను విధించునవి వేదములు. వాని నెటుల నాచరింపవలెనో బోధించునవి శాస్త్రములు. ఆచరించినవారలకు గల్గిన ఫలముల వివరించునవి పురాణములు.

యుక్తియుక్తములై ప్రకృతి సిద్ధములై యొప్పు నా వేదధర్మముల ననుష్ఠించు మానవులే పూజ్యులు.

I దేహరాజ్యమున వ్యక్తిగతములగు సుఖము లనుభవించుటకును,

II దేశరాజ్యమున సాంఘిక శ్రేయ మలవడుటకును,

III దేవరాజ్యమున నాత్మానంద మతిశయించుటకును, వేదధర్మములే సాధనములు.

కొత్తగ మానవత్వమును పొందినవారుతప్ప తదితరులెవ్వరును వానిని పరిత్యజింపజాలరు. కారణమేమన నవి యీశ్వరప్రేరితములు. జగద్గురుండగు పరమేశ్వరు డొక్కడైనను అయా దేశతత్త్వము లనుసరించి

వేదమును హిందువులకు, బైబిలును క్రైస్తవులకు, ఖురాను ముసల్మానులకు—ప్రసాదించెను. వారివారి వేదములు వారల నుద్ధరించుననుట వాస్తవము.

కావున హిందువులమైన మనము వేదధర్మముల ననుష్ఠించుట శుభప్రదము. దేహరాజ్యము—దేశరాజ్యము—దేవరాజ్యము అను నీ మూటిని సర్వతోముఖముగ నడిపించుటలో వేదమొక్కటే శక్తిసామర్థ్యముల గల్గియున్నది. దేహరాజ్యమునకే గృహరాజ్యమని పేరు. దానిని చక్కగ నడిపించినయెడల దేశరాజ్యము కరతలామలకమగును. అంత మోక్షసామ్రాజ్య మతిశయించును.

చదువరులారా!

గృహరాజ్యమన నేమి? అందలి సిద్ధాన్తము లెవ్వి? వాని నాచరించు టెట్లు? ఆమార్గముల నెవరు బోధింతురు? అని మీ హృదయములు పరితపించుట లేదా?

అట్టి సమయమున "ఆర్య" లొక్కరే శరణ్యులు. ఆర్యులన నెవరు?

"ఆరాత్ యాంతీతి ఆర్యాః."

దూరముగ పోవువారని యర్థము. ఇష్టార్థసిద్ధికై ఎంత దూరమైనను పోయి సాధించువారే ఆర్యులని భావము.

ప్రపంచమునగల జాతులన్నిటిలో వీరే అగ్రగణ్యులు. ఎవ్వారు సర్వవిజ్ఞానసంపన్నులై ఖండఖండాంతరవాసులకు విజ్ఞానభిక్ష నొసంగిరో—ఎవ్వారు—లోకమంతయు నేక ఛత్రాధిపత్యము వహించి ధర్మరాజ్యమొనర్చిరో—ఎవ్వారు విషయాభిలాషనువర్జించి పారమార్థిక సాధకులగుచుండిరో— ఎవ్వారు—జగత్కల్యాణమునకై భావిభావుక మార్గముల ప్రదర్శించుచుండిరో—ఎవ్వారు జూపిన నుత్తమ స్నిగ్ధమార్గంబులే—మోక్షసామ్రాజ్య సాధనంబులై విలసిల్లుచున్నవో— ఎవ్వారి యాదేశములు సప్తద్వీపముల ప్రతిధ్వనించుచున్నవో ప్రశ్న పరంపరా ప్రవాహమున మునుగుచు తేలుచు దిక్కుగానక త్రొక్కులాట పడుచుండువారల నుద్ధరింప నెవ్వారు సమర్థులో—వారే ఆర్యులు.

అనార్యుడు:—

ఆర్యమహాశయా !

గృహారాజ్యమన నేమి ?

ఆర్యుడు:—

స్త్రీపురుషు లిద్దఱుకలిసి యెచ్చట వసింతురో అది గృహమనబడును. అందు వారి జీవయాత్రావిధాన మతివేగముగ నడచుచుండును. గృహప్రవేశ సమయమున వారిరువురే యున్నను కాలక్రమముగ సంతానము గల్గి దినదినాభివృద్ధి గాంచుచుందురు. ఇట్లు జనసంఖ్య మించినకొలది పరిపాలనావశ్యకత వృద్ధియగుచుండును. దేశపరిపాలనమువలె నీ

గృహపరిపాలనము సైతము ప్రజారక్షణార్థమేర్పడెను. కావు నసే ఇయ్యది గృహరాజ్యమనబడుచున్నది.

అనార్యుఁడు:-

గృహరాజ్యమందలి ముఖ్య సిద్ధాంతములెవ్వి?

ఆర్యుడు:-

అవి యెన్నియోకలవు. అన్నిటిలో సత్సంతానమును గనుటయే ముఖ్యసిద్ధాన్తము. ఇయ్యది కొలికిపూస. ఆస్తికులై ధార్మికులై ఆరోగ్యవంతులై దీర్ఘాయుష్మంతులై యొప్పు సంతానమునకే సత్సంతానమని పేరు.

అనార్యుఁడు:-

ధర్మబుద్ధిగల బిడ్డలను గనుటకై వర్తింపవలసిన కార్య క్రమమెట్లుండును?

ఆర్యుఁడు:-

స్త్రీ పురుషులు కలసిననేగాని బిడ్డలు కలుగ నేరరు. ఎవ్వియైన రెండువస్తువులు కలసినపుడు మూడవ పదార్థ మేర్పడుచున్నది. మూడవవస్తువుయొక్క గుణము దానిని పుట్టించిన రెండు పదార్థములయొక్క స్వభావమును బట్టి పరిణామించుచుండును. ఇది సుప్రసిద్ధమగు లోకానుభవ మని యెఱుంగుము.

(1) వస్తుపారిశుద్ధ్యత

I సున్నము, పసుపు కల్పినపుడు పారాణమను నొక యెఱ్ఱని పదార్థము పుట్టుచున్నది.

అది పసుపుసున్నములయొక్క శుద్ధతత్వముల ననుస రించి తీక్ష్ణముగ దగద్ధగాయమానమై మెరయుచుండును.

పసుపుసున్నములలో పరిశుద్ధత లేనియెడల పారాణము సైతము బాగుగ ప్రకాశింపజాలదు.

మఱియొక దృష్టాన్తము వినుము.

II విత్తనములను భూమితో కల్పినపుడు వృక్షములు పుట్టుచుండును. బాగుగ ఫలించి జీవనాధారమై యుండవలెనని తలంచినయెడల మంచి విత్తనములు సేకరించుటకు రైతులు యత్నించుచుందురు. భూమి సైతము సారవంతముగ నున్నదో లేదో పరిశీలింతురు. మఱియు ఏ ఋతువునందు ఆ రెంటిని కలుపవలెనో ఆ కాలమునుగూడ గమనించుచుందురు. అటుగాక భూమి విత్తనము ఇవి యెంతమంచివిగనైనను ఒక కార్తెలో వేయదగిన విత్తనములు ఇంకొక కార్తె (కాలము)లో వేసినయెడల పంటలు సరిగా పండవని యెల్లరెఱింగియేయున్నారు.

(2) వస్తుసంగ్రహణకాలము

III చక్కని యౌషధముల సిద్ధపరచు వైద్యులు పరిశుద్ధ పదార్థముల (ఓషధుల) సంపాదించుచుందురు. అంతట దృప్తి జెందరు. ఓషధుల తెచ్చునపుడుగూడ సరియైన కాలమగునా కాదాయని చూచుచుందురు.

(3) పదార్థపరిమితి

ఇంతియేకాదు, ఏపదార్థమెంతకలుపవలయునో ఆ పరిమితినిగూడ గమనించుచుందురు. ఏ వైద్యుడైనను పై విషయములలో శ్రద్ధవహింపక మందుల జేయుచుండెనేని అవి రోగముల పోగొట్టజాలవు. మీదుమిక్కిలి క్రొత్తరోగములను

గూడ పుట్టించును. ఒకప్పుడు చంపినను చంపగలవు. కావు ననే వైద్యులు కడు జాగరూకతతో మెలంగుచుందురు.

లోకానుభవమును గమనింపగా సృష్టిరహస్యము లిట్లున్నవి. ముఖ్యములగు మూడు విషయములు సృష్టికి ప్రధానసాధనములని దెలియుచున్నవి.

1 వస్తుపారిశుద్ధ్యత.

2 వస్తుసంగ్రహణకాలము.

3 పదార్థపరిమితి.

ఇవి మరువతగినవికావు. ఒకవేళ మఱచి యొక వస్తువును సృష్టించితిమేని అది జగత్కల్యాణమునకు భంగకర మగును.

మిత్రమా! ఇందలి యథార్థ మింకెన్నియో దృష్టాంతములచే ధ్రువపఱచుకొనుము. అట్లు జేయకుంటివేని సంశయము లెన్నటికినిఁదీరవు.

(1) జడపదార్థములైన పసుపుసున్నములు కలుపుటకును,

(2) అచేతనమైన భూమితో చేతనములగు విత్తనముల చేర్చుటకును,

(3) చేతనములైన ఓషధుల రెంటిని కలుపుటకును వివేకులెల్లరు పై నియమముల ననుసరింతురు.

సామాన్యముగ జడపదార్థముల విషయమే యిట్లుండ జీవులలో నుత్తమోత్తములగు మానవుల సృష్టించుట కెట్టి నియమములు గావలెనో యోచింపుము.

మానవజాతిని సృష్టించుటలో పై నియమము లెంత మాత్రము లోపింపరాదని బుద్ధిమంతు లంగీకరింపక తప్పదు. ఆ నియమముల బాటించుచు సంతానమును బడయుటయే గృహారాజ్యమందలి సత్ప్రవర్తనమని యెఱుంగుము.

అనార్యుడు:-

జాతిని పుట్టించుటలో ఎక్కువ శ్రద్ధ వహింపవలెనని తెల్పియుంటిరి. అది నిజమేయగును. ఒకపుడు పొరపడి అటుల బుట్టింపనియెడల పిమ్మట వారల నుద్ధరించుటకు సాధనము లేకుండునా?

ఆర్యుడు:-

దేశాభివృద్ధి విషయమున నిదివరకు వివరించినదాని కంటె ప్రశస్తతర మార్గము వేరొండులేదు.

ఏమన, ఒక ఖాలములో పండిన గింజలు విశేషముగ తాలుతప్పరలై యుండె ననుకొనుము. పుట్టుకలోనే గల్గిన దోషమునకు తగిన చికిత్స యొనర్చి బాగుచేయగలవారెవరైన నుందురా? ముమ్మాటికిని లేరు. ఆ గింజలకు గట్టితన మెన్నటికిని రాజాలదు. అటులనే పుట్టు గ్రుడ్డివారలకు వైద్య చికిత్స యెంతచేసినను గ్రుడ్డితనముపోదు. పుట్టుకలోనే వంకరగనున్న కుక్కతోకకు బద్దలుగట్టి యెంతకాలముంచినను ఆవంక తీరునా!

అట్లే మానవజాతిని సృష్టించుటలో—నేర్పరితనము జూపుటయే వివేకలక్షణమగుచున్నది. అటులగాక యెటులనో కామాంధులై తోచినటులెల్ల చిత్తకార్తెలోనున్న కుక్కల

రీతి కలియుచున్నయెడల, జనించువారిస్వభావముల మార్చుట కెవరితరము ?

నీతి నియమములు పాటింపక బిడ్డలను కనుటవల్లనే యీనాడు పూర్వ పశ్చిమార్ధ గోళములం దెక్కడజూచినను స్వజాతివైరములు దినదినాభివృద్ధిజెందుచున్నవి.

అనార్యుఁడు:-

ఆర్యమహాశయా! లోకమున దేశాభివృద్ధిని కోరని జాతియే లేదు. కావుననే ప్రతిజాతి స్వాభివృద్ధికై యత్నించుచున్నది. ఎంతనేర్చినను తామనుకొన్నంత మహోన్నత స్థితికి పోవువారుండరు. దీనికిఁ గారణమేమి ?

ఆర్యుఁడు:-

ప్రతివాఁడు తానెట్టి యభివృద్ధిని బొందవలసియుండునో అందుకు దగినట్లే జన్మించును. అనగా పుట్టుకలోనే అంతయు నిమిడియున్నదని యర్థము. ఏకార్యమైనను కట్టుబాటు లేనిది సఫలముఁగానేరదు. ఒకజాతి జన్మించినపిమ్మట దాని నభివృద్ధి జేయుటకు యత్నించుటకంటె దానిని బుట్టించుటలోనే యెక్కువ శ్రద్ధ వహించుట మహోపకారమని తెలియుచున్నది.

ఏమన హిందూదేశమున పలురకములుఁగల గుఱ్ఱములుఁగలవు. అరేబియాదేశపు గుఱ్ఱములింతకంటె చాల ఘనమైనవి. మన గుఱ్ఱముల నెంత బోషించినను వానితో సమాన మెన్నటికిని గాజాలవు. అందుకు హేతువు లేక పోలేదు. ఆ భేదము పుట్టుకయందేయున్నది. ఒకవేళ మన గుఱ్ఱములను అరేబియా గుఱ్ఱములతో సమానముగా [illegible]యు

వలెనన్న నొక విచిత్రమగు మార్గముఁగలదు. అదియు పుట్టు కకు సంబంధించియేయున్నది. వీలున్నయెడల మన దేశపు ఆడగుఱ్ఱమునకు నాదేశపు మగగుఱ్ఱమును జోడింపవలెను. అప్పుడు మనదేశమున అరేబియాదేశపు గుఱ్ఱములే పుట్టఁ గలవు. అట్లు వీలులేనియెడల మఱియొకమార్గముగలదు. ఈదేశపు ఆడగుఱ్ఱములను ఇక్కడనున్న మగగుఱ్ఱములతోఁ గలుపుచు నాడగుఱ్ఱమున కెదురుగ అరేబియాదేశపు గుఱ్ఱము నుంచవలెను. అపుడు జన్మించినవి అరేబియాదేశపు గుఱ్ఱము లను పోలియుండును.

కావున నేదేశమందైనను మానవజాతిని పుట్టించుట లోనే తగినంత బలము-తెలివి-కల్గియుండునటుల నొసర్చిన యెడల ఆజాతి అట్టి బలము-తెలివి-గల్గి వర్ధిల్లగలదు. దేశాభి వృద్ధికి నిజమైన మార్గమిదియే. తదితర సాధనములన్నియు నీ మార్గమునకు సహాయపడగలవు. అనేకు లీవిషయమెఱుం గక జాతి యేర్పడినపిమ్మట తదభివృద్ధికై యత్నించుచుందురు. ఈ యుద్యమ మెన్నటికిని సఫలము గానేరదు. వివేకు లీ రహస్యమెఱింగి స్త్రీపురుషుల నొకచోటఁ జేర్చుటలో మంచి కట్టుదిట్టము లేర్పఱచుచుండవలెను. అట్లు జేర్చుటకే వివాహ మనిపేరు. వివాహమైనది మొదలు స్త్రీపురుషు లిరువురు ఒక గృహమున వసింతురు. క్రమముగ వారికి సంతతి గల్గి జన సంఖ్య పెరుగుచుండును. ఇట్లనేకగృహములుఁగూడి యొక గ్రామమగుచున్నది. గ్రామము లెన్నియోకలసి దేశమనఁ

బడును. కనుక దేశమనునది వేఱుగ లేదు. గృహమే దేశమని యెఱుంగుము. ప్రతిగృహస్థుఁడు తన గృహమందలి జనులను సక్రమముగ పాలించినయెడల నింతకంటె దేశసౌభాగ్యము వేఱొండులేదు. దేశాభివృద్ధియనగా గృహాభివృద్ధియే.

సక్రమమైన గృహపరిపాలనము దేశసౌభాగ్య సాధమునకు బునాదివంటిదని స్పష్టమగుచున్నది.

ఎవనికి గృహరాజ్యమున స్వరాజ్యసిద్ధి లేకుండునో వానికి దేశరాజ్యమును నడిపించుటకు ఆధిపత్యముండరాదు. భార్యవలన మంచి బిడ్డలను కనలేని గృహస్థులు దేశనాయకులై వర్తించుచున్నంతవరకు దేశాభివృద్ధి కాజాలదు.

అనార్యుఁడు:-

ఆర్యమహాశయా !

లోకమున గృహరాజ్యమున కాధారము వివాహమని చెప్పితిరి. వివాహమనగా స్త్రీపురుషులకు ఏర్పడిన నొక సంబంధముగదా. ఎట్టి పురుషుడు ఎటువంటి స్త్రీని ఏవయస్సునందు పెండ్లాడవలెనో తెలిపెదరా?

ఆర్యుఁడు:-

నీవడిగిన ప్రశ్నకు సమాధానమొసంగుట సులభమే కాని యిందలి తత్త్వమును సంపూర్ణముగ గ్రహించుట, సామాన్యులకు దుర్లభము. అయినను సూక్ష్మబుద్ధితో గ్రహించినయెడల సాధ్యమేయగును. కాన ప్రస్తుతము సంగ్రహముగఁ జెప్పెదను.

స్వజాతీయ పురుషులు స్వజాతి స్త్రీలనే వివాహ

మాడవలెను. అంతియేకాని యితరజాతులవారిని బెండ్లాడ రాదు. అట్లు పెండ్లాడినయెడల వానినుండి కల్గిన సంతానము సంకరమనఁబడును. ఈ సంకరమును సజ్జనులెవ్వరు అంగీక రింపరు.

ఇక వివాహకాలమునుగూర్చి తెలిసికొందము. స్త్రీ వయస్సుకంటె పురుషునివయస్సు రెట్టింపుగ నుండవలయును. అటుగాక ఒకటి రెండేండ్ల భేదముఁ జాలునని తలఁచి పండ్రెం డేండ్లవానికి పదేండ్ల కన్య నొసంగరాదు. స్త్రీకంటె పురుషుని వయస్సు ఎంత నతిశయించిన నంతమేలు. కాఁబట్టి పదేండ్ల కన్యకు దగ్గఱ వయస్సులోనున్న 12-14 ఏండ్ల పురుషుని యుంటఁగట్టక తుదకు 18 ఏండ్ల వానినైననుఁ జేయవలెను. కాని పదేండ్ల బిడ్డను 50 ఏండ్లవానికి పెండ్లిచేయరాదు. అట్లొనర్పక యీడుజోడుగ నుండిరని కొంచెము హెచ్చు తగ్గులుఁ గలవారలకు పెండ్లిసేయుచో ననేక నష్టములు వాటిల్లును. వానిని వినుము.

స్త్రీపురుషు లిరువురకు కనీసము 10 ఏండ్లు తేడా యుండినగాని వారిసంతతి సర్వవిధముల యోగ్యమైయుండదు.

తల్లిదండ్రులు అజానుబాహులైనను బిడ్డలు అటుల జనింపక కుఱుచవారుగ నుందురు. వారు కామమును పట్టజాలక కట్టుబాట్లకు లొంగరు. ఆహారపుష్టి తగ్గును. మనోబలము క్షీణించును. దూరదృష్టి సన్నగిల్లును. గంభీరస్వభావము లుండక చిలిపిచేష్టలు కలిగియుం దురు. దైవవిశ్వాసము క్రమముగ నశించును. దేశోద్ధ

రణ విషయమున పట్టుదలలుండవు. ఒకవేళ ఉన్నను అది కపటముగనుండును.

కావుననే స్త్రీపురుషుల వివాహ వయస్సును గమనించుటలో ఎక్కువ శ్రద్ధ చూపవలెను. 8 సం॥ లు మొదలు సమర్తాడు లోపుననే స్త్రీకి వివాహమొనర్చుట దేశాభివృద్ధికరము. అట్లుగాక సమర్తాడినతరువాత జరపినచో దుష్ట సంతానముఁగల్గి వారివలన దేశదౌర్భాగ్య మావహిల్లును.

ఈ నియమము ఏజాతియందైనను-ఏదేశమందైనను-ఏయుగమందైనను-మానవమాత్రునకు ఒక్కటిగనేయున్నది. కాని యిందొక విశేషముఁగలదు. ఏ స్త్రీలు సామాన్య స్త్రీలవలె ప్రజలలో గలసిమెలసి తిరుగకుందురో వారికి మాత్రము సమర్తాడినపిమ్మట వివాహము జరిగినను దోషహేతువు కానేరదు.

అనార్యుఁడు:-

అయితే మానవజాతియంతయు నొక్కటేగదా. స్వజాతీయుఁడు స్వజాతి స్త్రీలనే చేసికొనవలెనని చెప్పుటలో అర్థమేమి? మానవుఁడు స్వజాతి స్త్రీలను పెండ్లాడక పశుపక్ష్యాది జాతులను పెండ్లాడునా? మీ సిద్ధాన్తము అవకతవకగనున్నదే?

ఆర్యుఁడు:-

ఆ సిద్ధాంత మెంతమాత్రము దోషమైనదికాదు. నీవు చాల పొరపడుచున్నావు. ప్రశ్నించువారలకు లోకజ్ఞాన మత్యవసరము.

వృక్షములు పశువులు పక్షులు మానవులు మున్నగు జాతు లనేకము లీలోకమునగలవు. ఇందలి జాతిభేదములు సహజముగ స్వరూపములచేతనే వేర్వేరుగ నున్నట్లు కనం బడుచున్నవి. అనగా నిదివృక్షము-ఇది పశువు-ఇది పక్షి-అని చూడగనే తెలియుచున్నది. దీనినింబట్టి రూపభేదములచేతనే జాతిభేదములుండునని స్పష్టమగుచున్నది. ఈ రూపభేదముల వలన ఒకజాతితో వేరొకజాతికి ఏవిషయమందైనను పోలిక యున్నట్లు కనపడదు.

ఎట్లనగా

పశుజాతికిని వృక్షజాతికిని స్వరూపమున నెంతయో భేదము గలదు. వృక్షములతో పశువులను-పశువులతో పక్షు లను-పక్షులతో మనుష్యులను - ఇట్లెన్నివిధముల నొకదాని కొకటి సరిజూచినను వీనిలో నెంతమాత్రము సమానస్థితి గోచరింపదని తెలియుచున్నది. ఈవిధముగనుండునవి మొదటి తరగతి జాతిభేదములని యెరుంగుము.

సాధారణదృష్టిలో జాతిభేదము లిట్లే నిర్ణయింపబడు చున్నవి. కాని సూక్ష్మదృష్టితో విచారించినయెడల ప్రతిజాతి యందు సైతము అవాన్తరజాతులున్నట్లు లోకానుభవము చాటుచున్నది. ఏలనన,

మొదట నొక వృక్షజాతినిగూర్చి పరిశీలింతము. ప్రథ మమున పశుపక్షి మనుష్యాది జాతులకంటె నీ వృక్షజాతి వేరుగనున్నది. మరల వృక్షజాతియం దనేకభేదములుగలవు. అవి స్వరూపముచేతనే వేరుగ నున్నట్లు మనకు గోచరించు

చున్నవి. మామిఁడి-దబ్బ-నిమ్మ-వేప-మఱ్ఱి-రావి - మున్నగు చెట్లు వేర్వేరు రూపములఁ బొందుచు నొక్క వృక్షజాతిలోనే అనేక జాతిభేదములున్నట్లు ఋజువుజేయుచున్నవి. జాతులలో-వీనిని అవాంతరజాతులందురు. ఈ అవాన్తరజాతులు రూపములయందు వేరుగనుండి యనేకజాతులుగ నేర్పడినను ఆ భేదములు పశుపక్షి వృక్షాదులందలి రూపభేదములవలె నొకదానికొకటి సంపూర్ణసంబంధము లేనివైయుండలేదు. అవి స్వల్పభేదములతో నొప్పుచు కొంత సంబంధమునుఁ గల్గియున్నవి. కావుననే భిన్నజాతులుగ వ్యవహరింపఁబడుచున్నవి.

ఎట్లనగా వృక్షజాతిలో మామిడి-వేప-మున్నగు అవాన్తరజాతులు భిన్నములుగ నున్నను వానిరూపములందు చాలావరకు పోలిక కనపడుచునేయుండును. ఏ స్వల్పముగనో భేదముమాత్రము గోచరించుచుండును.

నేరేడాకునకు జువ్వియాకునకుఁ జాలవఱకు సమానమైన రూపము గల్గియుండును. ఇట్లే చెట్లయొక్క యాకులు కొమ్మలు మొదళ్లు పువ్వులు పండ్లు మున్నగునవి సాధారణముగ కొంచెము భేదముతో నొకేరంగు ఒకే రూపమును బొందుచున్నవి. ఈచెట్లయందు కొంతవరకు పోలికయున్నను నింకొకవిధముగ భేదమెంతయో కలదు. దానిని తెలిసికొందము. విషముష్టి చెట్టుకలదు. దాని పండ్లు ఇంచుమించుగ నిమ్మపండ్లను బోలియుండును. వానిని తినినయెడల మరణింతుము. ఇట్లే కొన్ని ఆకులు, వేళ్లు ప్రాణముల దీయును. సంజీవిచెట్టు చచ్చినవారిని బ్రతికించును. అరటిపండ్లు మామిడిపండ్లు భుజించినయెడల ఆకలిదీరును. కొన్ని యాకులను

కూరలుగ నుపయోగించినపుడు ఎంతయో ఆరోగ్యమొదవును. మరికొన్ని యాకులవలన రోగములు పుట్టును. ఇటుల నొక్కొక్క చెట్టు ఒక్కొక్క రుచిని-ఒక్కొక గుణమును-ఒక్కొక్క యుపయోగమును కలిగియున్నది. మొత్తము మీద వృక్షజాతి యొక్కటైనను పై కారణములచే చెట్లలో ననేకజాతులున్నట్లు అంగీకరింపకతప్పదు. కావున మొదటి తరగతి జాతిభేదముగాక-రెండవ తరగతి జాతిభేదముసయితము కలదని స్పష్టమగుచున్నది. దీనినే అవాంతర జాతిభేదములని పిలుచుచుందుము.

ఈ జాతిభేదములోని తరగతులు ఇంతటితో పూర్తికాలేదు. అవాంతరజాతులైన మామిడి దబ్బ నిమ్మ మున్నగు వృక్షములలో ప్రతిజాతియందును తిరిగి జాతిభేదములు కలవు. ఇందులో నేదోయొక చెట్టునుగూర్చి యాలోచింతము.

సాధారణముగ వృక్షములన్నియు నొకటేజాతియైనను అందు మామిడిచెట్టు ప్రత్యేకముగ నొకజాతియని తలచుచుందుము. ఇదియొక జాతిగ నున్నప్పటికిని ఇందులో రసాలు బంగినపల్లి-మల్గువా-మున్నగు భేదము లెన్నియోగలవు. ఈ చెట్లను జూచినప్పుడు ఇది రసాలమామిడియనిగాని-ఇది బంగినపల్లి మామిడియనిగాని సాధారణముగ మానవులుఁ గుర్తింపఁజాలరు. సామాన్యదృష్టికి భేదము కనుపడనంత మాత్రమున మామిళ్ళలో పలుతెగలు లేవని జెప్పవచ్చునా? చెప్పరాదు. ఒకవేళ నటుల వాదించువారున్నచో వారలకు లోకజ్ఞానములేదని వృక్షశాస్త్రమెఱింగినవారందురు. ఈరీతిగ మామిడిచెట్ల విషయమేకాదు. ఇంకొకదానిని దీసికొందము.

అవాన్తరజాతిలోఁ జేరిన వడ్లుసైతము ఒకటేజాతి యని సామాన్యముగఁ దోఁచుచుండును. బాగుగ పరీక్షించిన యెడల నిందనేకజాతులుఁగలవు. ఆట్రిగడ్డలు-మొలకొలుఁకులు-కొనామణి-బంగారుతీగలు-అక్కుళ్లు మొదలగు భేదము లెన్నియో కలవు. వీనిలో నే పైరును జూచినను ఇది ఆట్రి గడ్డయనియు ఇవి మొలకొలకులనియు సామాన్యముగ గుర్తింపఁజాలము. చూడగనే ఇందులో భేదము గన్పింపనంత మాత్రమున వడ్లన్నియు నొక్కటే తెగయని వాదించుట తగునా. ఒకవేళ వ్యవసాయముఁ దెలియనివారెవరైన భేదము లేదందురేమోగాని వ్యవసాయశాస్త్ర మెఱింగిన రైతు మాత్ర మనఁజాలఁడు. ఇట్లెన్నియో దృష్టాన్తములుఁ జూప వచ్చును.

ఇఁక మానవజాతినిగూర్చి ముచ్చటింతము.

వృక్షజాతివలె మనుష్యజాతియు ప్రత్యేకముగనుండెను. మొట్టమొదట వృక్షములన్నియు నెటుల నొకేజాతిగ పరిగణింపఁబడినవో అట్లే మానవులును ఒకేజాతిగ నెంచఁ బడుదురు. ఒకేజాతిగల వృక్షము లెటుల మామిడి-పబ్బ-మున్నగు భిన్నజాతులుగ నొప్పుచున్నవో, అట్లే ఒకేజాతిగల మానవులు స్వల్పరూప భేదములచే ననేక జాతిభేదములుఁ గలవారై వర్తించుచున్నారు.

ఏలనన-మామిడి-మఱ్ఱి-రావి-వరి-మున్నగునవి వేర్వేరు రూపములతో భిన్నజాతులుగ నేర్పడినట్లు మానవులలో ఆర్య-కకేశియా-మంగోలియా-నీగ్రో మొదలగునవి స్వల్ప

రూప భేదములతో భిన్నజాతులై యున్నవి. దేశచరిత్రి లెఱింగినవారెల్లరకు నిది తెలిసినవిషయమే. మానవజాతిలో వీనిని అవాంతరజాతులందురు. ఇటుల భేదములుండుటకు గారణమెద్దియో విచారింతము.

ఈశ్వరసృష్టిలో భూభాగమంతయు నొక్కటిగనున్నను శీతోష్ణాది భేదములచేతను - మట్టియందలి భేదములచేతను- అనేక దేశములుగ విభజింపఁబడినది. దేశస్వభావమునుఁబట్టి ప్రతిదేశమున లభించెడి పదార్థములందును భేదము లేర్పడి యున్నవి. ఆయా దేశములందు పుట్టిన మనుష్యులయందును దేశతత్వము ననుసరించి పరస్పర జాతిభేదము లేర్పడెను. ఒక దేశమున పుట్టిన మనుష్యులకు బుగ్గలెత్తుగను-వేఱొక దేశమున జన్మించినవారలకు సొట్టముక్కుగను-మఱియొక దేశస్థునకు పిల్లిగడ్డముగను-ఇట్లే తెల్లగను నల్లగను ఎఱ్ఱగను పచ్చగను ఎన్నియో భేదములున్నవి. ఈ భిన్నరూపములు గలవారలే కకేశియా-మంగోలియా-నీగ్రో మొదలగువారని దేశచరిత్రలు చెలుపుచున్నవి.

సృష్ట్యారంభమున మానవజాతి ఒక్కటిగ లేదనియు, పై విధముగ నాయా దేశములందు ప్రత్యేక జాతులుగ (స్పెషల్ ట్రైబ్సు) సృష్టింపఁబడినదనియు చరిత్రకారులు చెప్పుచున్నారు. కావున మానవులలో జాతిభేదములు కల్పితములుకాక స్వతస్సిద్ధములని యెఱుఁగవలెను.

అవాన్తరజాతియగు మామిళ్ళలో నెట్లు

రూపభేదములేకుండ బంగినపల్లి రసాలు మున్నగు జాతిభేదములు గల్గుచున్నవో అట్లే అవాన్తరజాతియగు ఆర్యులలో సైతము సులభముగ గుర్తించుటకు వీలులేనట్టి వివిధజాతు లేర్పడుచున్నవి. కకేశియా-మంగోలియా-మున్నగుజాతులను సాధారణముగ మనము జూచియుండలేదు. మనకందఱకు దెలిసిన రెండుజాతులను గూర్చి చెప్పెదను.

తెల్లవారు-నల్లవారు-అను రెండుజాతులను మనము నిత్యముఁజూచుచున్నాము. ఈ జాతిభేదము కల్పితముకాదని సర్వులెఱింగిన విషయమే. ఇదివరకు నీవు మానవజాతి యంతయు నొక్కటేయని భ్రమించితివి. కాని యిక నా భావమును తొలగించుకొనుము. తెల్లజాతిపురుషుడు, స్వజాతిస్త్రీని పెండ్లాడక నల్లజాతిని పెండ్లాడెనేని ఆవివాహము అన్యజాతితో చేయబడినదని యెఱుంగుము. అంతియేకాని నీవనుకొన్నట్లు మనుజుడు పశుపక్ష్యాది జంతువులను పెండ్లాడుటయే-అన్యజాతిని పెండ్లాడుటయని తలంపకుము. అందువలన ఒకజాతి పురుషుడు వేరొకజాతి స్త్రీని పెండ్లాడరాదని చెప్పియుంటిని.

తెల్లవారు యూరపు దేశమున జన్మించుటవలన "యూరోపియను"లనఁబడుదురు. ఏషియాఖండమున బుట్టుటచే నల్లవారు "ఏషియను"లని పిలువబడిరి. యూరోపియను జాతిలోని స్త్రీపురుషులు తమలోతాము వివాహము చేసికొనుచుండుట స్వభావసిద్ధము. అట్లే ఏషియన్ జాతివారు తమ జాతియందే వివాహముఁ జరుపుకొందురు. ఇట్టి యాచారము సృష్ట్యాదినుండి నేటివఱకు నిరాఘాటముగ జరుగు

చున్నది. ఎల్లరు దీనినే పవిత్రమని తలంచుచుండిరి. కొంత కాలమునకు జనులలో వివేకము తగ్గెను. అదిమొదలు యూరోపియను పురుషుఁడు ఏషియను స్త్రీలను (అనగా తెల్లవారు నల్లవారిని) పెండ్లాడుటకు మొదలుపెట్టిరి. వారికి గల్గిన సంతతి "యూరోపియన్" అనిగాని "ఏషియన్" అనిగాని జెప్పఁబడదు. పై రెండుజాతులు కలియగా "యూరేషియన్" అని ఒక క్రొత్తజాతి పుట్టును. దీనినే సంకరజాతియందురు. సంకరజాతియైన "యూరేషియనులను" యూరోపియనులు తమతో సమానముగఁ జూడరు. యూరోపియనులలోనున్న ఆంగ్లేయులు (ఇంగ్లీషువారు) ఏషియనులలోనున్న ఇండియను (హిందూ) స్త్రీలను వివాహమాడినయెడల వారికి గల్గిన సంతానమును ఆంగ్లేయులనిగాని యిండియనులనిగాని పిలువరు. వారిని "ఆంగ్లో యిండియనులు" అని పిల్చుచుందురు. ఆంగ్లేయులు సైతము ఆంగ్లో యిండియనులను కొంచెము తక్కువగ జూతురు. ఈ సంకరము మానవులలో మాత్రమే గాక పశ్వాదులలో సైతము కలదు.

పశువులన్నియు ఒక్కటేజాతి అయినను గుఱ్ఱము గాడిద మున్నగు భేదము లెన్నియో గలవు. గుఱ్ఱము-గాడిదతో కలసెనేని కంచరగాడిద యను నొక క్రొత్తజాతి పుట్టుచున్నది. గుఱ్ఱమునకు జనించినను దానివలె గౌరవింపబడదు. మరియు యోగ్యులెవరును దానిపై స్వారీచేయరు.

ఈశ్వరసృష్టిలో మొట్టమొదట పరిశుద్ధజాతులు జనించెను. అవి తమలోతాము కలియుచుండినయెడల బాగుగ

నుండెడిది. ఒకజాతి రెండవజాతిలో కలియుటకు నేర్చుకొను టచే సంకరజాతులు పుట్టుటకు కారణమయ్యెను.

కాన నో సోదరా !

పశ్వాదులలోవలె మానవులలో సైతము ఒకజాతివారు వేరొకజాతివారిని పెండ్లాడినయెడల వారికి సంకరులు పుట్టి దేశదౌర్భాగ్యకారకులగుచుందురు.

అనార్యుఁడు:-

ఒకజాతి వేరొకజాతిని పెండ్లాడినయెడల సంకరజాతి పుట్టినను దానివలన నష్టమేమి?

ఆర్యుఁడు:-

నష్టమింతయని చెప్పుట కలవిగాదు. శ్రద్ధతో వినుము. ఒక రకపు మామిడిచెట్టునకు వేరొక రకపు మామిడిని అంటు కట్టినయెడల ఆ రెండురకములనుండి మూడవరకపు మామిడి బయలుదేఱుచున్నది. దానిని అంటుమామిడియందురు. దాని పండ్లు చూపులకేగాక తినుటకు సైతము బహు రుచికరములై యుండును. కాని ఆరోగ్యశాస్త్రప్రకారము మిగిలిన మామిళ్ల వలె పథ్యకారి కానేరవు. మఱియు రోగముల బుట్టించును. ఇంతియేకాదు. మంచి మామిళ్లవలె నివి ఊరగాయకు పనికి రావు. ఊరబెట్టినయెడల జెడిపోవును. చాలాకాలము నిలువ జాలనందున వానిని భుజించువారికి సైతము ఆయుష్యము వృద్ధికాజాలదు.

మన మనేకప్రదేశములలో మామిడితోటలను జూచు చున్నాము. అవి నక్షత్రమండలమును తాకుచున్నవో

యున్నట్లు చాల పొడవుగనుండును. తగినంత విశాలముగ నుండి వివిధజీవులకు నిలువనీడ నొసంగుచు మహోపకార మొనర్చుచున్నవి. ఇక సంకరజాతులైన అంటుమామిళ్ళు చాల పొడవుగ పెరుగజాలవు. విశాలప్రదేశమును సయితము ఆక్రమింపనేరవు. సంకరముగ బుట్టుటచేతనే వానికాక్షీణదశ యేర్పడెను. సంకరమువలన రోగములు—అకాలమరణములు తప్ప క్షేమ మెంతమాత్రము లేదు.

అనార్యుఁడు:-

మహాశయా! మానవులలోని * జాతిభేదములు కల్పితములని తలచియుంటిని. అవి స్వతస్సిద్ధములనియు, మానవ నిర్మితములు కావనియు నేటికి గ్రహించితిని. స్త్రీపురుషులు స్వజాతివారై యుండవలెననియు వివాహ మొనర్చుకొనుటకు అట్టివారే యర్హులనియు బాగుగ తెలిసినది. పెండ్లియొక్క ముఖ్యోద్దేశము.♦"మంచిబిడ్డలను కనుటకే"యని స్పష్టపడినది.

"యోగ్యులై జనించిన బిడ్డలే" దేశాభివృద్ధి జేయుగలరని బోధపడినది. అట్టి సంతతిని కనుటకు

1. పారిశుద్ధ్యత.
2. సంగ్రహణకాలము.
3. పదార్థపరిమితి

---

* రాబోవు గ్రంథములలో వేదప్రమాణముల ననుసరించి జాతిభేదములున్నటుల తెలుపబడును.

♦ మంచి బిడ్డలను గనుటకు స్త్రీపురుషులు ఏ యాహారము భుజింపవలెనో ఏయే దినములలో ఏయే సమయములందు కలియుచుండవలెనో రాబోవు గ్రంథములలో తెలుపబడును.

ఈమూడును అవసరములనియు గోచరించెను. సత్సంతతిని బడయుటకు పైమూడు లక్షణములు స్త్రీపురుషుల విషయమున నెటుల సరిపోవునో తెలుపగలరా ?

ఆర్యుఁడు:-

## 1. పారిశుద్ధ్యత.

పెండ్లాడదలచిన స్త్రీపురుషుల కుటుంబ సాంప్రదాయముల పరిశోధింపవలెను. ఆ వంశములు పవిత్రములై యుండిన యెడల వారలకు పెండ్లిసేయవలెను.

కం॥ శ్రీయును కులమును రూపును
పాయము శుభలక్షణంబు బాంధవ విద్యా
శ్రేయముగల వరునకు క
న్యాయుతునిగ జేయవలయు నధికప్రీతిన్.

## 2. సంగ్రహణకాలము.

సంగ్రహణమనగా స్త్రీని పురుషుడు గ్రహించుటయని యర్థము. పురుషుడు స్త్రీయొక్క చేతిని గ్రహించుచుండుటచే నయ్యది పాణిగ్రహణమనబడుచున్నది. పెండ్లికి పాణిగ్రహణ మనిపేరు. ఏకాలమున స్త్రీని సంగ్రహింపవలెనో (చేపట్టవలెనో) దానినే సంగ్రహణకాలమందురు. స్త్రీల విషయమున ఈ సంగ్రహణకాలము × సమర్తాడుటకు పూర్వమేయని యెఱుంగవలెను.

---

× సమర్తాడుటకు పూర్వమే స్త్రీలకు వివాహమొనర్పవలెనని వేదశాస్త్ర పురాణ ప్రమాణములు రాబోవు గ్రంథములలో జూపబడును.

### ౩. పదార్థపరిమితి.

వైద్యుడు ఓషధులను దెచ్చి ఔషధము చేయుచుండును. ఏ ఓషధిని (అనగా చెట్టుయొక్క ఆకులో పువ్వులో కాయలో వేళ్లో) యెంతెంతకలుపవలెనో ఆ పరిమితిని జాగ్రతగా జూచును. ఒక్కొక్క మందులో 2 తులములు శొంఠి పొడియు 4 తులములు మిరియాలపొడియు ఇట్లు ఏదోయొక విధముగ పాళ్లను గమనించుచుండును.

అట్లే స్త్రీకంటె పురుషుడు ఎన్నిపాళ్లు (అనగా ఎన్నిరెట్లు) పెద్దవాడైయుండవలెనో ఆ విషయమున శ్రద్ధవహించి పెండ్లింప్లు చేయుచుండవలెను. దీనినే పధార్థపరిమితియందురు.

వీనిలో నే విషయమున అశ్రద్ధచేసినను మంచి బిడ్డలు కలుగజాలరు.

అనార్యుడు:-

అయ్యా! సాధారణముగ స్త్రీలు 10 వత్సరములు మొదలు 16 సం॥ లోపల సమర్తలగుచుందురు. పదియవయేట పెండ్లిచేసినయెడల 20 ఏండ్ల పురుషుని అంటగట్టవలెను. † 14 ఏండ్లు వయస్సుగల స్త్రీని—పెండ్లాడదలచిన పురుషునకు 28 యేండ్ల వయస్సు ఉండవలెను. దీనింబట్టి స్త్రీకంటె పురుషుడు రెట్టింపుతో నుండినయెడల దేశాభివృద్ధియగునని తెలియుచున్నది. పురుషునకు ఇరువదేండ్లవరకు పెండ్లికానియెడల నతడు నిలువజాలడు. ముఖ్యముగ వేడిదేశ

† స్త్రీపురుషుల వివాహవయస్సునుగురించి సరియైన శాస్త్రప్రమాణములు రాబోవు గ్రంథములలో తెలుపబడును.

మున నిరువదేండ్లకే పురుషుడు కామవికారమునకు లోనగు చుండును. అట్టియెడ నాలస్యమొనర్పక పెండ్లాడవలసియుండును. ఆ పురుషుని వరింపదలచిన స్త్రీయొక్క వయస్సు 10 సం॥ లు లేక 12 సం॥ ల కంటె నధికముగనుండరాదు. జీవితాంతమువరకు పురుషునితో సుఖింపదలచిన స్త్రీ-తనకు దగిన పురుషుని పెండ్లాండవలసియుండునేని-తగినవాడెవడో తెలిసికొనుటకు లోకజ్ఞానమవసరము. 16 సం॥ల లోపల నట్టి జ్ఞానముండునా? ఉండదు. కాబట్టి లోకజ్ఞాన మలవడినపిమ్మట అనగా 16 సం॥ లు దాటినతరుహాతనే తగినవానిని వరింపవలసిం ఘను. కావున స్త్రీలు 17-18 సంవత్సరములలోనే పెండ్లాడవలెననుట న్యాయము. ఈ విషయమున మీ యభిప్రాయమేమి ?

ఆర్యుడు:-

పనికిరాదు. ఎందుకనగా అట్టి స్త్రీకి రెట్టింపువయస్సుగల 30యేండ్లవాడులభించుట దుర్లభము. దొఱకినను ఆ మెకు లోకజ్ఞానముకలిగియుండదు. లోకమున నేయే వ్యవహారము లొనర్పవలెనన్నను 18 సం॥లు దాటిననేగాని మానవునకు సామర్థ్యము కలుగకున్నది. కావుననే న్యాయస్థానము (కోర్టు)లలో ప్రభుత్వమువారు 18 ఏండ్లు దాటినవానినే సాక్షిగా గైకొందురు.

ఈ యనుభవము ననుసరించి 18 ఏండ్లు దాటినగాని స్త్రీలకు వివాహవయస్సు నిర్ణయింప వీలులేదు. పురుషులతో

యుగభేదములబట్టిగాని ఆయా సందర్భముల ననుసరించిగాని 10 ఏండ్ల స్త్రీని 30 ఏండ్ల పురుషుడు పెండ్లాడవచ్చునని శాస్త్రములలో గలదు.

పాటు * స్త్రీలకు సైతము సమానస్వాతంత్ర్య ముండవలెనని కోరితి మేని పురుషులవలె స్త్రీలుగూడ 18 ఏండ్లు గడచిన పిమ్మటనే పెండ్లాడవలసియుందురు.

అట్లుగాక పురుషులకు 18 ఏండ్లు దాటవలెననియు స్త్రీలకు 17–18 ఏండ్లు ఉండిన జాలుననియు జెప్పుటకు కారణ మేమి? స్త్రీలు పురుషులతో సమానులుగారా? సమానులే యైనచో వారిద్దరికిని 18 సం॥ లు అనిగాని లేక 20 సం॥ లు అనిగాని యుండవలెను.

అనార్యుఁడు:-

17-18 సం॥లలోనే పెండ్లి కావలెనను నియమము లేదు. మాటవరుసకు 17-18 సంవత్సరములని జెప్పితిని. స్త్రీలు కూడా వాస్తవముగ 18 ఏండ్లు గడచినపిమ్మటనే పెండ్లాడ వలెనని నా యూహ. కావున వారిద్దరు సమానులే.

ఆర్యుఁడు:-

మంచిది. వారిద్దఱు సమానులేయని మఱవకుము. నీమాటను నీవు నిలబెట్టుకొనుము. మనోభావములలో ఆహార విహారములలో కామసుఖములలో, ఇంతయేల—సర్వవిషయ ములలో—స్త్రీలకు—సంపూర్ణస్వాతంత్ర్య ముండవలెననికదా నీ యభిప్రాయము.

* స్త్రీ పురుషులకు సమానస్వాతంత్ర్యముగలదా? లేక పురుషుడే అధి కుడా? ఈ విషయమునుగుఱించి వేదప్రమాణములతో రాబోవు గ్రంథములలో వెలువడును. బైబిలు — ఖురాను గ్రంథములనుండియు ప్రమాణములు జూప బడును.

20 సం॥ వయస్సుగల స్త్రీ - పెండ్లాడదలచినయెడల పురుషుని వయస్సు-ఎంత యుండవలెను? 22 సం॥ అనియో 24 సం॥ అనియో తెలిపెదవు కాబోలు.

అంత నొక స్త్రీ బయలుదేరి

“పురుషుని వయస్సుకంటె స్త్రీ వయస్సు తక్కువగు టకు హేతువేమి? నీ దృష్టిలో స్త్రీలు తక్కువగనుండిరా? కోపము వచ్చినపుడు బెదరించుటకు వీలగునని పురుషుని వయస్సు పెంచియుంటివా? ఈ దౌర్జన్య మెంతకాలము? జగము పుట్టినది మొదలు పురుషజాతి మదించి యొడలెఱుం గక మమ్ము హీనముగనొనర్చి యణగద్రొక్కినది చాలదా? సిగ్గులేక నిరువది సంవత్సరములుగల స్త్రీలను 24,25 సం॥ లు గల పురుషులు పెండ్లాడుదురా? ఈ యాట లింక సాగవు. మేము 25 ఏండ్ల వయస్సులో నుండగా మీరు ఏ 20 సం॥ గల యీడులోనో యుండవలెను. ఎంతకాలము చెప్పుక్రింద నున్న తేలువలె మమ్ము నొక్కిపట్టితిరో-అంతకాలమువఱకు వివాహవయస్సు మాకంటె పురుషులకు తక్కువగనే యుండ వలయును. పిమ్మట స్త్రీపురుషు లిరువురు సమానవయస్కులై పెండ్లిజేసికొనవచ్చును.”

అని ప్రశ్నించినయెడల నీవేమిచెప్పెదవు? గ్రుడ్లు మిటకరించుటకంటె సమాధానము లేదు.

ఒకవేళ నా స్త్రీ - స్త్రీ సంఘముల నేర్పరచి గొప్ప యాందోళనము గావించినయెడల నింటింటనుండు స్త్రీలెల్లను తమ జాతి నుద్ధరించుటకు బయలుదేఱకుందురా? సత్యాగ్ర

హాము బూని పురుషులొనర్చు పనులనన్నిటిని యడ్డగింపరా? వంటలను మాని ఉపవాసములు జేయింపరా? స్త్రీలు తలచుకొన్న యెడల నేకార్యముకాదు?

"అడిగేవారికి చేప్పేవారు లోకువ" అను సామెతను జ్ఞప్తియందుంచుకొనుము. ధర్మబద్ధులై ప్రశ్న పరంపరల విసరినయెడల సమాధానము లెన్నియైనను జెప్పవచ్చును. అటుగాక స్వేచ్ఛగ మాట్లాడువారిని మెప్పింపగలవారెవరు? దేవుడైనను సమర్థుడో-కాడో!

అనార్యుడు:-

ఏనాటికైన తెగబడి స్త్రీలు పైవిధముగ ప్రశ్నింతురేని ఆకాలపు పురుషులు తగిన సమాధానములు జెప్పలేకపోరు. వ్యాధియే లేనపుడు మందుకై యత్నించు టెందుకు? ప్రస్తుతము నన్ను బాధించుచున్న నొక సందియము దీర్పుడు.

కామము కల్గినది బిడ్డలకుగాని తల్లిదండ్రులకుగాదు. ఆకలియైనపుడు తిండిపెట్టి- సిగ్గుకల్గినపుడు గుడ్డలిచ్చుటకే- తల్లిదండ్రుల కధికారముకలదు. అంతియేకాని కామమేర్పడినపుడు తండ్రులు నోరెత్తుటకైనను వీలులేదు. స్త్రీలు తమంతటతామే యిష్టమైనవారిని పెండ్లాడవలెను. ఇందుకై మీరేమందురు?

ఆర్యుడు:-

† ఆకలిగాని కామముగాని కడుపులో పుట్టును. దక్షి

---

† మానవుడు ఏ పదార్థముల నెన్నిమారులు భుజింపవలెను. ఏ యే యాహారములు మంచి బుద్ధులను చెడ్డ బుద్ధులను పుట్టించును. ఈ విషయము రాబోవు గ్రంథములలో తెలుపబడును.

ణాదివారు తమ బిడ్డలకు సాంబారు-చారు-కొళంబు మొద లగువాని వలనను ఉత్తరాదివారు రొట్టె-పాలు-మున్నగు వాని మూలముననుా, ఆంధ్రులు ఉప్పు-పులుసు-కారము-పచ్చళ్లచేతను ఆకలిని దీర్చుచున్నారు. ఒకరి యాకలికి చారు-ఇంకొకరి యాకలికి రొట్టె-వేరొకనికి పచ్చడి-ఇట్లుండ వలెనని సృష్టిలో నొక నిర్ణయము కలదా? లేదు. కాని యేది యలవాటుచేసిన నదే యొక స్వభావమగును. మర ణించువరకు దానినే తినుచుందురు.

మనుజుని గొప్పతనము ఇందే యిమిడియున్నది. బాల్య మునుండి దేని నభ్యసించునో దానినే సుఖప్రదమని తలచు చుందురు. ఆకలి యెట్టిదో కామము అట్టిదే. అయితే కొం చెము హెచ్చుతగ్గులుండవచ్చును. ఆకలియైనపుడు దేనినో యొకదానిని తినవలెను. అటులనే కామము పుట్టినపుడు ఎవ నినో యొకనిని పొందవలెను. కావుననే ఆకలి రుచి యెరుగ దనియు కామము మంచిచెడ్డల నెఱుంగదనియు సామెత గల్గెను. బాల్యమున నెట్టి యాహార మభ్యసింతురో-దానినే యౌవనదశయందును తినుచుందురు. అంతేకాని చిన్నతన మున అలవాటు పడిన భోజనమును మార్చువారుండరు. ఉండినను వెయ్యికొక్కరుండవచ్చును. అటుల జేయుట చాలా కష్టము.

ఏయే పదార్థముల దినిన ఆరోగ్యము కల్గుచుండునో వాని నన్నిటిని తల్లిదండ్రులుగ్రహించి బిడ్డలకు పెట్టుకొందురు. కావున ప్రతిమానవుని యాహారనిర్ణయము బాల్యముననే యేర్పడుచున్నది.

బాగుగ లోతునకు దిగి సూక్ష్మబుద్ధితో నాలోచించి తిమేని ఆకలి పుట్టుటకుపూర్వమే జీవునకు ఆహారము నిర్మింపబడినదని తెలియుచున్నది. ఆకలిమాట యటుంచుము. శిశువు జన్మించుటకు మునుపే ఆ బిడ్డ ఆకలిని తీర్చుకొనుటకై తల్లి గర్భమున చనుబాలు సృష్టింపబడెను. ఇదొక్కటేగాదు. విచారింపగ లోకమంతయు నిట్లేయున్నది.

సృష్ట్యారంభమున జలమునుండి భూమి జనించెను. కొంతకాలమునకు వర్షింపగా గఱిక మొదలగు గడ్డి యేర్పడెను. ఇదియొక జంతువున కాహారపదార్థమైయున్నది. కాలమొకింత గడచెను. ఆగడ్డిని తినుటకై పశువులు జనించెను. సారాంశమును వినుము. పశువు జనించుటకు పూర్వమే దాని యాహారము సృజింపబడెనని తెల్లమగుచున్నది.

+ పెద్దపులులు మున్నగు జంతువులు మాంసమును భుజించును. అవి పుట్టుటకుపూర్వమే వాని యాహారమునకై మేకలు ఆవులు మొదలైనవి కల్గెను. పిల్లులకంటె ఎలుకలు మొదటపుట్టెను. పాముల యాహారమునకై కప్పలు సయితము ఆదియందే సృజింపఁబడెను.

స్త్రీకంటె పురుషుడు మొదటనే యుత్పత్తియయ్యెను. ఈ సిద్ధాంతమును బైబిలుకూడ అంగీకరించుచున్నది. దేవుడు మొదట "ఆదాము" అను పురుషుని పుట్టించెననియు కొంతకాలమునకు అతనినుండి స్త్రీని సృజించెననియు క్రైస్తవుల సిద్ధాంతము.

---

+ దయామయుండగు దేవుడు క్రూరమృగముల బుట్టించి సాధుజంతువుల జంపించుచుండుట న్యాయమా? ఈ విషయము రాబోవు గ్రంథములలో వివరింపబడును.

దీనింబట్టి స్త్రీ నిమిత్తము-అదివఱకే (అనగా నామె పుట్టుటకుపూర్వమే) పురుషుడు జనించెనని నిశ్చయించుకొనుము. కొంతకాలమైనపిమ్మట ఆమెకు కామము జనింపనుండెను. ఏది జనింపనుండెనో దాని యాహారము అంతకు పూర్వమే సృష్టింపబడవలసియుండెను.

ఈ సిద్ధాంతము ననుసరించి జనింపబోవు కామమునకు ఆహారపదార్థము (అనగా నొక పురుషుడు) అదివరకే నిర్ణయింపబడవలెనని యెఱుంగుము. ఆ నిర్ణయమునకే వివాహమనిపేరు. కావున కామోత్పత్తికి పూర్వమే స్త్రీలకు వివాహమొనర్పవలెననుట ప్రకృతిసిద్ధమైయున్నది. ఇదియే ఈశ్వరోద్దేశ్యము. దీనిని కాదనుటకు మానవున కెంతమాత్రము అధికారములేదు. ఈశ్వరాజ్ఞనుల్లంఘించుచో దైవద్రోహమై ప్రకృతివిరుద్ధమై సర్వవిధముల శిక్షింపబడుదురు.

అనార్యుఁడు:-

అయ్యా! తాము చెప్పినది యుక్తియుక్తముగ-ప్రకృతిసిద్ధముగ-నున్నమాట నిజమే. కాని మనశ్శాంతి కలుగకున్నది. ఇందుకు హేతువేమి?

ఆర్యుఁడు:-

ఓయీ ఒక భూమి కలదనుకొనుము. అది వందల కొలఁది వత్సరములనుండి పశువులచే త్రొక్కబడుచుండెను. దానినెన్నడును దున్నినవారులేరు. కావున బండబొటిగ గట్టిచే నిండియుండెను. ఒక రైతు దానిని కొని విత్తనములు చల్లి పైరు పెంచదలచెను. ఆ బీడునందు ఎంతమంచి విత్తనములు చల్లినను అది చక్కగ ఫలింపదయ్యె. అందువలన బహు

కాలమునుండి వ్యవసాయ మొనర్పబడుచున్న మఱియొక పొలమును కొనెను. వెంటనే దానిని దున్ని విత్తనములు జల్లెను. అది బాగుగ పండి యతనిని సంతోషపెట్టెను. ఈ రెండు పొలములలో విత్తనముల విత్తిన పురుషుడొక్కడే యైనను పొలములలోని భేదముల ననుసరించి ఒక తావున పండుటయు వేరొకచోట నెండుటయు తటస్థించుచున్నది. అటులనే యిక్కాలమున భారతీయ హృదయములలో చిర కాలమునుండి విదేశీయభాషలు వేషములు సిద్ధాంతములు జొరబడి కలుపుమొక్కలవలె పెఱిగి వానిని మహారణ్య ప్రాయములుగ నొనర్చుచున్నవి. అందు సింహములు — పులులు — ఎలుగుబంట్లు — మొదలగు ఘోర మృగముల బొబ్బరింతలవలె బయలుదేరిన సంశయము లెన్నియో కలవర పెట్టుచున్నవి. అవి సులభముగ శాంతింపజాలవు. బీటి భూముల నొక్కమారు దున్నిన చాలునా? చాలదు. అటు లనే బంజరాటిన భారతీయ హృదయక్షేత్రములను అనేక పర్యాయములు ధర్మప్రచారరూపమున దున్నుచుండవలెను.

* ఈ వ్యవసాయము బ్రాహ్మణులదైయున్నది. వారు స్వీయధర్మములను మఱచి పరధర్మపరులై గాఢాంధకారమున మునిగిరి. ఎవ్వారు విషయభోగముల లెక్కింపక పర్ణశాలల వసించుచు ఆకలాబుల దినుచు కడుబీదలంబోలి విజ్ఞానధనులై యొప్పారుచుండిరో అట్టి బ్రాహ్మణులు నేడు భోగలాలసులై

* బ్రాహ్మణధర్మము లెవ్వియో వారి కర్తవ్యము లెట్టివో రాబోవు గ్రంథ ములలో విమర్శింపబడును.

యుందు రేని జాతీయ గౌరవాభ్యుదయమునకు వినాశకులు కారా ?

ఇప్పుడైనను మేల్కాంచి ధర్మప్రచారమును సాగింప కుందురేని భావిభారతీయుల సౌభాగ్యదృష్టిలో వీరి సంతతికి నిలువ నీడయుండదు. త్వరపడి బ్రాహ్మణసభల నెలకొల్పి ధర్మరక్షణముకై బూనిన బాగుండెడిది. అట్లు జరుగకుండుట మహానర్థకము. రైలునకు ఇంజను యెటులనో మానవులలో బ్రాహ్మణులట్లుండిరి. ఇంజను చెడెనేని బండి నడువజాలదు. ఎపుడు రాకపోకలుండవో అపుడు పెట్టెలన్నియు తుప్పుపట్టి చెడిపోవును. నేడు భారతీయుల దుర్గతి యిట్లైనది.

ఇక్కాలపు బ్రాహ్మణులు ధర్మప్రచార మొనర్ప కుండుటకు కారణమెద్దియో గ్రహింపుము. వారిలో బుద్ధి మంతులు రెండు తెగలైరి. అందొక తెగవారు ఇంగ్లీషు చదివి జాతీయ వేషభాషల మఱచి ప్రజలతో కలసిమెలసి తిరుగు టను మాని సర్వవిధముల దాస్యవృత్తి నవలంబించి ధర్మ ప్రచార మొనర్ప నసమర్థులగుచున్నారు.

రెండవ తెగవారు కులవిద్య నేర్చియు దైవవిశ్వాస మును గోల్పోయి ఇంగ్లీషుబడులలో చదువు చెప్పుకొని జీవించుచున్నారు. ధర్మప్రచార మొనర్చుటకు వీలులేక వీరిరువురు దూరస్థులైరి. ఏకొలదిమందియో వేదవిద్యాసంపన్ను లైయున్నను ఆ వేదమాతను నమ్మజాలక తమ పుత్రులను ఇంగ్లీషులో దింపుచున్నారు. భాషాజ్ఞానమునకై చదివించిన బాగుండెడిది. అటుగాక బ్రతుకు తెరువుకై చదివించుట

వేదమాతయొక్క యశోబింబముపై గొప్ప కళంకము నాపా
దించినట్లగుచున్నది.

మొత్తముపై నొకరిద్దఱు విద్వాంసులు పైవలలో జిక్కుకున్నను లోకమున ప్రస్తుతము వ్యాపించియున్న వాతావరణమున మునిగి చేయునదిలేక దుఃఖించుచున్నారు. ఇంక మతరక్షణమునకు మార్గమెటులనో తెలియకున్నది. అయిన నొక గొప్ప శుభసూచకము గోచరించుచున్నది. స్కూళ్లలో గాని ఆఫీసులలోగాని బ్రాహ్మణులకు అధికారపదవులొసంగరాదని యొక సిద్ధాంతము బయల్పడెను. దానిని శరణు జొచ్చినయెడల పూర్వకాలపు బ్రాహ్మణత్వము - ఆ జగద్గురుత్వము-సర్వజనపూజ్యత-జన్మసఫలత - కలుగగలదని తెలియుచున్నది.

ఈ కీలక మెఱింగి వివిధమార్గములలోని బ్రాహ్మణులెల్లరు బ్రాహ్మణ మహాసభల నెలకొల్పవలెను. × బ్రాహ్మణులలోని శాఖాభేదముల తొలగించుటకై ప్రయత్నములు సలుపవలెను. శాస్త్రములందెచ్చటను శాఖాభేదములు గన్పట్టవు. వెలనాడు-తెలగాణ్యము-మురికినాడు-ప్రాజ్నాడు-ఆరువేలు-మున్నగు బ్రాహ్మణశాఖలు మధ్యకాలమున కొన్ని సందర్భములలో కల్పితములయ్యెను. అట్టి భేదములను తీసివేయుటకు యత్నింపలేని ఆ యసమర్థత ఎంతకాలము రక్ష

× బ్రాహ్మణాది నాలుగుజాతులలో నేర్పడిన శాఖాభేదములు శాస్త్రసమ్మతములు కావనియు వాని నన్నిటిని కల్పినయెడల దేశమునకు మహోపకారము గల్గుననియు రాబోవు గ్రంథములలో వెల్లడింపబడును.

నాశములందు జీర్ణించియుండునో అంతవఱకు దేశమునకు మేలుకలుగదు. ఇటులనే క్షత్రియ - వైశ్య- శూద్రులలో సైతము శాస్త్రవిరుద్ధములు కానట్టి శాఖాభేదముల తొలగించుటకు ప్రచార మొనర్చుచుండవలెను. అపుడపుడు సంఘ క్షేమమునకు భంగకరములైన ఆచారములు ప్రబలుచుండిన యెడల వెంటనే సంస్కరించి సంఘముయొక్క పూర్వరూపమును నిలువబెట్టిననేగాని ఆజాతి-ప్రపంచమున నిలువజాలదు.

ఇక్కాలమున నిట్టి సంస్కరణములు జరుగనందున సమస్త హృదయములు సంశయములకు పుట్టలై రణరంగ కారణములగుచున్నవి. ఎంతజెప్పినను పూర్వప్రశ్నలోని సంశయము నిన్ను బాధించుచున్నట్లగపడుచున్నది. అయినను వేరొక ఉదాహరణమొసంగి సంశయనివారణ మొనర్చెదను.

ఒకనికొక రోగము సంభవించెననుకొనుము. ప్రతిక్షణమున ననేక పదార్థముల తినుట కిచ్ఛయించుచుండెను. కాని వైద్యుడందుల కంగీకరింపలేదు. కావున బంధువులు అతని యిష్టమును నెరవేర్పరైరి. బంధు నిర్బంధము సహింపజాలక—

"ఒకరి యిష్టమును వేరొకరడ్డగింపరాదు. ఎవరికష్టము వారికే తెలియును. మీకుకూడ రోగమువచ్చినగాని తెలియదు. ఒకనిపై వేరొకని పెత్తనమేల? ప్రతివానికిని స్వాతంత్ర్యము గలదు. కావున నాయిష్టప్రకారము నన్ను తిననిండు"

అని వచింపదొడంగెను.

ఎంత చెప్పినను బంధువులు విందురా ? మానవుడు సాంఘిక జీవి. సంఘమును విడచి స్వేచ్ఛగ ప్రవర్తించుటకు హక్కులేదు. ఆ రోగికి సర్వస్వాతంత్ర్యమొసంగి యిచ్చ వచ్చినటుల తినుట కంగీకరింతు రేని యతని రోగము క్రమముగ ప్రబలి ఏకొంచమైనను తినుటకు వీలులేని దుర్దశ దాపరించును. ఒకసమయమున మరణము సైతము కలుగవచ్చును.

అటులనే ఒక కుటుంబమున నొక యాడబిడ్డ కలదని యెరుంగుము. ఆమె పదునాలు గేండ్లకు సమర్తాడెను. అంత కామసుఖముకై తీవ్రమగు కోర్కె జనించెను.

(Love is blind) కామము గుడ్డిది. అను సామెత ననుసరించి మంచిచెడ్డలను విమర్శించునట్టి యోగ్యత నశించెను. కామమునకంత బలముగలదాయని పరిహాసింపకుము. భార్యను–భర్తను–తల్లిని–తండ్రిని–వ్యాపారములను – ఉద్యోగములను–తుదకు ప్రభుత్వమునైన విడచి కామలోలురై తిరుగుచున్న స్త్రీపురుషు లెందఱో–లోకమున గలరు. కామదేవతను సామాన్యమని తలంపరాదు. లోకమంతయు నాడించునది ఆ దేవతయే. కామమును జయించుట కడు దుర్లభము. రోగముకంటె నీ కామము వెయ్యిమడుంగులు ఘోరమైనది. కామముగూడ రోగములలో జేరినదే. రోగములకు మందు గలదుగాని కామరోగమునకు చికిత్సలేదు. స్వభావసిద్ధమైన కామమును రోగముగ పోల్చదగునాయని తలంపకుము. ఎన్నడును నీవు కామజ్వరమును వినియుండ లేదు కాబోలు. కొంపలను గూల్చివేయును. రాజ్యముల తారుమారొనర్చును. వివిధసంఘములలో క్రోధానల జ్వాలల ప్రజ్వలింపజేయును.

కామజ్వరపీడితుడగుటచే రావణునకు వంశక్షయమయ్యెను.

రోగము-ఒక్క రోగినే చంపును. కామరోగమో ఆమె నొక్క తెనేగాదు. తన్ను బొందిన పురుషుని వారిపురి వల్ల గల్గిన బిడ్డలను-ఆబిడ్డల బెండ్లాడినవారిని ఇటుల వంశ పారంపర్యముగ సర్వనాశన మొనర్చును.

కావున నీరోగ మంకురించుటకు పూర్వమే (అనగా-సమర్తాడుటకు మునుపే) తగిన చికిత్స నొనర్చినయెడల (అనగా వివాహమును గావింతుమేని) ఆ భర్త దివ్యౌషధ స్వరూపుడై సర్వసౌఖ్యముల గల్గజేయును.



# రాబోవు గ్రంథములలో

## ఈక్రింది ప్రశ్నలకు సమాధానము లొసంగబడును.

(1) దేవుడు కలఁడా? ఉన్నచో నొక్కఁడా? ముగ్గురా? లేక అనేకులా? దేవతల నివాసమెక్కఁడ? వారికి సంసారములుగలవా? బ్రహ్మ తనకూతురిని పొందెను. విష్ణువు పరస్త్రీయగు తులసితో గలసెను. కృష్ణుడు వేలకొలది గోపికలతో రమించెను. శివుడు ఋషిభార్యలపైపడెను. ఇంద్రుడు అహల్యను చెఱిచెను. చంద్రుడు గురుభార్యను పొందెను. రాముడు దొంగయై వాలిని సంహరించెను. మఱియు తపమొనర్చుచున్న శంబుకుని చంపెను. విష్ణువు వామనుండై పరమభక్తుడగు బలిచక్రవర్తిని పాతాళమునకు ద్రొక్కెను. చేప, తాఁబేలు, పంది, మున్నగు జన్మములెత్తి వివిధబాధ లనుభవించెను. ఇవన్నియు నిజమా? అయినచోఇట్టి దేవతలను పూజించువారికి మోక్షము గలదా?

(2) బ్రహ్మదేవుని తొడలనుండి నారదుడు—కన్నులనుండి అత్రి—మనస్సునుండి మరీచి—జన్మించిరి. స్తంభమునుండి నృసింహావతారము—లింగాకారమునుండి శివావతారము అవిర్భవించెను. హిరణ్యాక్షుడు భూమినంతయు చుట్టజుట్టెను. ఇవి నిజమా? అయినచో నసందర్భములు గావా!

(3) వేదము లెవరువ్రాసిరి? దేవుడే వ్రాసినయెడల నవి మనుష్యుల కెట్లు లభించెను? ఆతడు భూలోకమునకువచ్చి యిచ్చెనా?

(4) దేవుడొక్కఁడైనచో ననేకమతము లెందులకు? ఆతనిని బొందుట కొక్కమార్గము జాలదా? భక్తి—కర్మ—జ్ఞానము అని మూడుమార్గములు కావలెనా?

(5) దేవుని ధ్యానించుటకు గుడి యెందుకు? గుడిలో దేవుడుండెనా? కోట్లకొలది గుళ్లలో కోట్లకొలది దేవతలుండిరా? రాళ్లను పూజించువారికి తెలివికలదా? రాళ్లకు నైవేద్యములుపెట్టినను అవి తినవుగదా? ఇక నైవేద్యమెందుకు? దేవునకు ఆకలిగలదా? గుడిపై బూతుబొమ్మలెందుకు? అట్టిగుడికి వెళ్ళవచ్చునా?

(6) పక్షులకు-కుక్కలకు-జింకలకు-పందలకు - పుట్టిన బ్రాహ్మణులను గౌరవింపవచ్చునా? శూద్రకులమునబుట్టిన నారదుడును భోగముస్త్రీకిపుట్టిన పంచమస్త్రీయగు అరుంధతిని పెండ్లాడిన వశిష్ఠుడును - బ్రాహ్మణులు కాగా

అట్టి బ్రాహ్మణవంశములకు ప్రత్యేక గౌరవమెక్కడిది? జాతులు పుట్టుక చేతనా—గుణముచేతనా—కర్మచేతనా—లేక జ్ఞానముచేతనా?

(7) స్వర్గనరకములు గలవా? ఉన్నచో నెక్కడ? పాపమునకు శిక్ష నరకమున విధింపబడగా తిరిగి భూలోకమున పాపమనుభవించుటెందుకు? ఒక నేరమునకు రెండుశిక్షలా? పూర్వజన్మముకలదా? ఉన్నచో ఆజన్మమందలి సంగతులు ఈజన్మమున జ్ఞప్తికి రాకుండుటకు గారణమేమి? ప్రారబ్ధమును తప్పించుకొనుటకై యేమిచేయవలెను? దరిద్రుడు—ధనవంతుడు—కుంటి—గ్రుడ్డి—రోగి—పామరుడు—పండితుడు—పుత్రహీనుడు—పుత్రవంతుడు—ప్రభువు—సేవకుడు మున్నగు భేదములుండుటకు హేతువేమి?

(8) లోకమంతెక్కడను లేని జాతిభేదములు హిందూదేశముననుండుటకు గారణమేమి? బ్రాహ్మణులకొక్కరికే మోక్షమా? వారెంత భ్రష్టులైనను వారినే గౌరవించుచుండవలెనా? జాతిమాత్ర బ్రాహ్మణులను పూజించిననేగాని ముక్తి చేకూరదా?

(9) ఒక పురాణమున శివుడే దేవుడనియు వేరొక పురాణమున విష్ణువే దేవుడనియు నుండగా దేనిని నమ్మవలెను ?

(10) చనిపోయినవానికి కర్మ చేయవలెనా ? చేయనియెడల నష్టమెవరికి ? చచ్చినవారికి సంవత్సరమున కొక్కసారి పిండములు పెట్టినయెడల అవి వారికి చేరునా ? చేరుట నిజమైనయెడల ప్రతిదినము తద్దినములు పెట్టనక్కరలేదా ? ఆనాడు బ్రాహ్మణులు భుజించినయెడల వారి కడుపు నిండవచ్చునుగాని, చచ్చినవారికి ఆకలి తీరుటెట్లు ?.

(11) స్త్రీలకు పురుషులతో సమానమగు స్వాతంత్ర్యము లేదా ? భార్యాభర్తలకు పూర్వజన్మమున సంబంధముండెనా ? అది యెట్టిది ? రాబోవు జన్మమున వారు తిరిగి భార్యాభర్తలయ్యెదరా ? ఒకనికి అనేక భార్యలుండవచ్చునా ? స్త్రీలకుమాత్రము అనేక భర్తలుండకూడదా ? కూడనిచో ద్రౌపదికి అయిదుగురు భర్తలుండిరేమి ? పూర్వకాలమున పెండ్లాడకయే కర్ణునికని పారవేసిన కుంతి, కొంతకాలమునకు పాండురాజును పెండ్లాడి అతని వలన సంతానము కలుగనందున పరపురుషులతో భోగించి రాజాధిరాజులను కని కీర్తివహించి యుండ నిక్కాలమున స్త్రీలకెంతమాత్రము స్వేచ్ఛ లేదనుట శాస్త్రవిరుద్ధముకాదా ?

విధవలగు అంబిక, అంబాలికలకు సంతానము లేనందున వ్యాసునివలన

ధృతరాష్ట్రుని—పాండురాజును—కని సుఖించియుండ నిక్కాలపు విధవా స్త్రీలకు కామసుఖము లేకుండ నణగద్రొక్కుట న్యాయమా ?

అర్జునుడు విధవయగు ఉలూపిని పెండ్లాడెను. కృష్ణుని కుమారుడగు ప్రద్యుమ్నుడు శంబరాసురుని జంపి అతని భార్య విధవయైయుండ నామెను పెండ్లాడెను. ఇటుల విధవా వివాహము లెన్నియో పూర్వకాలమున గోచరించుచుండ నిప్పటి విధవా స్త్రీలకు వివాహము లేలచేయరాదు ?

(12) కలియుగమున అయిదువేల సంవత్సరములకు వర్ణసంకరమగునని ఋషులు వ్రాసియుండ నా వాక్యముల ధిక్కరించి వర్ణాశ్రమధర్మములను రక్షించుటకై ప్రయత్నించుట పాపహేతువుకాదా ?

ఇంకను ఇట్టి ప్రశ్నలు చాలాకలవు.

## ఒక మనవి

ఈ పుస్తకమందలి విషయములపైన నెవరికైనను సందేహములు కల్గినయెడల-అనవసరముగ తర్కించుకొనక వెంటనే శ్రద్ధతో

"హిందూ మత గ్రంథమాలా ఆఫీసునకు"

జాబు వ్రాసినయెడల ప్రత్యుత్తరమొసంగబడును. సమయ సందర్భములబట్టి సమాధానమిచ్చుటకు వీలులేనియెడల రానున్న గ్రంథములలోగాని లేక దీని రెండవ ముద్రణ మందుగాని తెలుపబడును. మీ గ్రామములలో ఉపన్యాసములు కావలసినయెడల ఈ గ్రంథమాలా ఆఫీసునకు తెలియజేయ గోరుచున్నాము. ఆహ్వానము చేరగనే గ్రంథమాలాధిపతులు ప్రచారకులనుపంపగలరు. ఆహ్వానకర్తలు సంపూర్ణ వేదశాస్త్రపురాణ ప్రమాణబద్ధులై యుండవలెను. సమాధానములు కూడా వేదశాస్త్ర పురాణ ప్రమాణములతోడనే యుండును.

# హిందూ మత గ్రంథమాలా

## విరాళముల వివరములు

మహారాజాధిరాజపోషకులు రూ. 116-0-0 మొదలుకొని మనసోత్సాహముకొలది.

| | | |
|---|---|---|
| మహారాజపోషకులు | సం॥ ౧కి రు | 25-0-0 |
| రాజపోషకులు | " | 10-0-0 |
| పోషకులు | " | 5-0-0 |
| సహాయకులు | " | 3-0-0 |
| అభిమానులు | " | 2-0-0 |

## చందా వివరము

| | | | |
|---|---|---|---|
| సంవత్సరం చందా | రూ. | 0-12-0 | |
| పోస్టుతో సహా | " | 1-2-0 | (బ్రిటిష్) |
| " | " | 1-4-0 | (నైజాం) |

☞ విరాళదాతల పేర్లు ప్రతియు పుస్తకమునందు ప్రకటింపబడుచుండును.

చిరునామా

మేనేజరు:—

## హిందూ మత గ్రంథమాల

లాలాటెంపెల్ స్ట్రీటు,

శికిందాబాదు (దక్కన్)

---

☞ గ్రంథమాలా సభ్యులుగ నుండదలచినవారు తమ పేరు, పోస్టు, తాలూకా, జిల్లాను విడివిడె అక్షరములతో వ్రాయవలెను.

# దాబోత్ర గ్రంథములు



సత్పుత్రుల కథనటివి కావలెంచితివా?

గృహ రాజ్యమును వదలచుకొని

తక్కిన అయిదు రాజ్యములు నాస్వాదింపుము.

అవి యెవ్వి?

౧ దేహ రాజ్యము    ౨ దేవ రాజ్యము

౩ దేశ రాజ్యము

౪ ధర్మ రాజ్యము    ౫ మోక్ష రాజ్యము

ఈ రాజ్యము లన్నిటిని పరిపాలించు విధానమును

తేటతెల్లముగ దెలియజేయు

హిందూ మత గ్రంథమాలా

కుసుమముల సేకరింపుము.

హిందూమత గ్రంథమాల. 2 వ పుష్పము.

ధర్మోద్ధారక, ఉపన్యాస చక్రవర్తి

బ్రహ్మశ్రీ ప్రభాకర ఉమామహేశ్వర పండితులవారి

ఉపన్యాససారము

# గృహరాజ్యము.

( 2 వ భాగము )




కొండా శంకరయ్యగారి ప్రిమియర్ ముద్రాక్షరశాల,

సికిందరాబాద్.

 వెల 0-1-6

# గృహారాజ్యవము.

## ( 2 వ భాగము )

అనార్యుడు:— (14 వ ప్రశ్న)

ఒకవేళ తల్లిదండ్రులు బాగుగ నాలోచించి తమ కుమార్తెలకు తగిన సంబంధమును దెచ్చినయెడల మంచిదే. అటుగాక ధనాశాలోలురై అజ్ఞానవశమున తగిన భర్తల నేర్పరుపక ఏ పనికిమాలినవారికో అంటగట్టినయెడల నా బిడ్డలకు బ్రతికినన్నాళ్లు తీరని దుఃఖము వాటిల్లును. ఈ బాధ లేకుండుటకై స్త్రీలు స్వయముగ పతిని వరించుకొనుట మేలు కాదా ?.

ఆర్యుడు:—

తల్లిదండ్రులొనర్చు పెండ్లిండ్లవలన స్త్రీలకు దుఃఖము కల్గుననియు స్వయంవర వివాహములవలన సర్వసౌఖ్యము లబ్బుననియు తలచుట గొప్ప పొరబాటు.

ఏమన, సృష్టి ప్రారంభమునుండి నేటివరకు బయలు వెడలిన ఉద్యమములన్నియు నూటికి పాతికవంతైనను జనులకు నష్టము కలుగజేయుచున్నవి. రాజకీయముగ గాని, సాంఘికముగగాని ఆరోగ్యవిషయమునగాని, నూటికి నూరు వంతున సంపూర్ణసౌఖ్యమును కలుగజేయు పద్ధతి లోకమందెచ్చటను గానరాదు. అటులొనర్చు శక్తియు మానవునకు లేదు. ఇకముందెప్పుడైన నటుల కలుగవచ్చునని జెప్పినను అది ప్రకృతిసిద్ధముగ నుండదు. దీనికి దృష్టాంతములు వినుము.

నంతగ ఫలించునా? పుట్టుకలోనే సత్స్వభావము గల మన స్సుండెనేని దానికి శిక్షణము తోడ్పడగలదు. అటుగాక చెడ్డమనస్సున కెన్ని చేసినను నిరర్థకములే. దేశాభివృద్ధి నపే క్షించువారు మొదట మంచిమనస్సుగల జనుల బుట్టించుట కంటె వేరొండు మార్గములేదు. పిమ్మట విద్యాబుద్ధుల నేర్ప నగును. ఈరెండు మార్గములులేని దేశమెన్నడును బాగు పడదు. అది యెటులనో వినుము.

ఒకరికి గణితమున, వేరొకనికి భాషలో, ఇంకొకరికి యుక్తులందు తెలివియుండుటకు హేతువేమి? కర్మానుసార మటుల గలెనని జెప్పుదుము. వెంటనే యాకర్మము ఎప్పటి దని ప్రశ్నింతుము. పూర్వకర్మమని ప్రత్యుత్తరము వచ్చును. పూర్వమనగా నెప్పుడని సంశయముగల్గును.

I కొందరు పూర్వజన్మమందలి కర్మమనియు,

II పుట్టుటకు పూర్వము గర్భమందు తలిదండ్రులొసం గిన కర్మమని మరి కొందఱును

III ఫలమనుభవించుటకు పూర్వ మీజన్మమున జేయ బడిన కర్మమని వేరొకరు జెప్పుచుందురు. నాస్తవమున నిందొక్కొక్కటి యెన్నటికి కారణము కాదు.

I పూర్వజన్మము.
II మాతృగర్భము.
III ప్రస్తుత కృషి (స్వీయకర్మము)

ఈమూడుకలిసి యొకఫలమునకు కారణంబగును. ఏమన నొక కార్యమున కొక్కటేకారణముండుట లోకమున

గానము. రెండుమూడు కారణములు కలిసి యొక కార్య మగును.

(1) ఒకని మంచిచెడ్డలకు హేతువు పూర్వజన్మ కర్మ మని గాని,

(2) మాతృగర్భమందున్నపుడు తల్లి యొనర్చిన కర్మ మని గాని,

(3) జన్మించినపిమ్మట నతడొనర్చిన కర్మమనిగాని,

ప్రత్యేకముగ జెప్పక పై మూడును గలసి సుఖ దుఃఖము లొసంగునని వచింపవలెను. దీనిని బాగుగ తెలిసి కొందము. ఇపుడు మూడు కారణములు వివరింపబడినవి. అందు మొదటిది పూర్వజన్మ సంబంధము. దానినిగుఱించి యీ జన్మమున జేయదగిన పని యెంతమాత్రము లేనందున తర్కించి ప్రయోజనము లేదు.

ఇక రెండవ కారణమును గూర్చి మాట్లాడుదము. దీనికి పూర్వజన్మకర్మము బీజమగుచున్నది. ఆ బీజము ఏదో యొక ప్రదేశమున (అనగా తల్లిదండ్రుల గర్భమున) జీవుని జన్మింపజేయుచున్నది. మొదట తండ్రియందు మూడునెల లుంచి పిమ్మట తల్లిగర్భమున జేర్చును. జీవుడు పరలోక మును విడచి భూమిపై నవతరించుట కివ్విధముగ తల్లిదండ్రుల నాశ్రయించెను. గర్భస్థుడైయుండుటచే, నేపనియు జేయ జాలడు. అయితే తల్లిదండ్రుల సంకల్పములే యతని సం కల్పములు. వారి యాహారవిహారములే యతని భోజనాది కృత్యములు. జన్మించినపిమ్మట రెక్కలు వచ్చువఱకు తల్లి దండ్రుల కృత్యములే యతని సుఖదుఃఖములకు హేతువులు.

వారి సంకల్పములుగాని కర్మములుగాని యెంతశుద్ధములైన నంత మేలు. అతని క్షేమమునకు గారణము పూర్వజన్మ కర్మమైయున్నను, ఈ జన్మమున తల్లిదండ్రుల కర్మములు సైతము సహాయపడునని తెలిసికొంటిమి. అయితే ఈ రహస్యము సామాన్యులెరుగరు.

దృష్టాంతపూర్వకముగ నీవిషయమును వినుము.

ఆకసమునుండి సూర్యునివలన బయలుదేరిన వేడిమి యొకవిధమైన పరిమితిని కల్గియుండె ననుకొనుము. దానివలన జీవుల కంతగ బాధలేకుండెను. అయినను ఒకడా వేడిమిని సహింపలేక యిల్లు కట్టుకొనెను. మఱియొకడు వేఱొక గృహమును నిర్మించుకొనెను. మొదటివానిది రేకుల యిల్లు. రెండవవానిది పూరిల్లు. వారిద్దఱికి సూర్యుడొక్కడే. అయినను మొదటివాని యింట్లో వేడి యధికమయ్యెను. రెండవవాని గృహము చల్లగనుండెను. సూర్యతాప మొక్కటిగ నున్నను గృహభేదములబట్టి శీతోష్ణములు భిన్నములయ్యెను. వేడికల్గుటకు ప్రథమకారణము సూర్యుడు. ఆ వేడి యతిశయించుటకుగాని తగ్గుటకుగాని గృహము రెండవ కారణము. ఆ యిల్లు రేకులతో మూయబడుటచే సూర్యతాపమును వృద్ధి జేసెను. అందువలన నా గృహస్థు తపించుచుండెను. దీనికితోడు ఆరోగ్యశాస్త్రమెఱుంగనందున ఆహారవిహార విధానములలో నేర్పరిగాక తోచినటులెల్ల సంచరించుచుండెను. అనగా ఇత్తడి పాత్రలో వంటజేయించి ఫ్యాక్టరీ (గిన్ని) బియ్యముపయోగించి విశేషముగ నూనెపదార్థముల దినుచుండెను. వృత్తియందును విశ్రాంతి

లేదు. అందువలన రేకులవల్ల వచ్చిన వేడియింకను వృద్ధియై జీవుని బాధించుచుండెను. ఈకష్టములకు కారణము లెవ్వియో తెలిసికొనుము.

(1) మొదటి కారణము సూర్యుడు.
(2) రెండవది రేకులయిల్లు.
(3) మూడవది స్వకీయకర్మము.

ఇటుల నొకదాని కొకటి తోడై దుఃఖమును కలుగ జేసెను. మొదటి కారణము మాఱి సూర్యునకు బదులు చంద్రుడుండెనేని మిగిలిన రెండుకారణములవలన నతనికి బాధకలుగ నేరదు. దీనింబట్టి పై మూడు హేతువులుగలసిన నే గాని సుఖమో దుఃఖమో కలుగదని తెలియుచున్నది.

ఒకడీ రహస్య మెఱుంగక ఉష్ణబాధను తొలగించు కొనుటకై దంపుడుబియ్యమును దెచ్చి కుండతో వండి నూనెకు బదులు నేతిని వాడుచుండెను. అటులొనర్చినను దేహ తాపము తీఱలేదు. అందుచే నొక వైద్యుని జేరి యా బాధను తొలగింపుమని కోరెను. అతడాహారమునకుతోడుగ రేకులను తీసి గడ్డిని కప్పుమనెను. అటులజేయగా నుష్ణబాధ తొల గెను. మొదటికారణమును మార్చుట కెవ్వరికిని శక్తి లేదు. దుఃఖము పోయి సుఖము కల్గుటకై మిగిలిన రెండుకారణము లను మార్చుకొనవలెను. ఇది మన చేతిలోనిపని. కావున నీ రెండే దేశశాంతికి ముఖ్యకారణములు. అందొకటి లోపించి నను సుఖము కలుగజాలదు.

సూర్యుని మార్చుట కెటుల వీలులేదో అటుల పూర్వ జన్మకర్మమును తొలగించుట సాధ్యపడదు. వైద్యుల సలహా ననుసరించి రేకులను తీసి పూరింటిని నిర్మింపలేదా? అటుల ధర్మశాస్త్రానుసారము గర్భమందున్న శిశువిషయమై సత్కర్మ ముల జేయుడని తల్లిదండ్రులకు బోధింపవలెను.

ఈ విషయమున శ్రద్ధ బూనక దేశాభివృద్ధికై యెన్ని పనులొనర్చినను అన్నియు నిరర్థకములనుట నిశ్చయము. వైద్యశాస్త్రమును ధిక్కరించి రేకులింటిని దీయక ఆహారాది కార్యములం దెంత నేర్పరియై నటించినను సుఖము కలుగునా? అట్లే ధర్మశాస్త్రమును తిరస్కరించి బాహ్యదృష్టికి గోచరించు దేశోద్ధరణ కార్యము లొనర్చినను శాంతిచేకూరదు.

ఎవరు దేశాభివృద్ధి నభిలషింతురో వారు కేవలము స్థూలదృష్టికి గనపడు సాధనముల నైకొని యుద్యమముల సాగింపుచున్నారు. ప్రజాక్షేమమునకై చేయదగిన పను లలో మొదటిది మాతృకృతకర్మమనియు, రెండవది స్వయం కృతకర్మమనియు నిదివరకే తెలిసికొంటిమి. ఇక్కాలపు దేశాభిమానుల సాధనములు రెండవదానిలో జేరుచున్నవి. మొదటిదానినివిడచి రెండవదానిని నెరవేర్చుట వివేకము కాదు. దానివలన కార్యసాఫల్యము గలుగదు. సూక్ష్మ బుద్ధిగలవారు మొదటిరకములో జేరి దేశాభివృద్ధి యొనర్తురు. ఇది సర్వోత్తమంబగు మార్గము. దీనిని బట్టి విచారింతుమేని గర్భస్థుడైన జీవుని రక్షించుటయే ముఖ్య కర్తవ్యమని తెలియగలదు. కాన మొదటిమార్గమునే

సక్రమముగ నడిపింతుమేని రెండవది సులభమగును. ఈ విషయమును లోకానుభవమున జూతుము.

పదిమందిని బలాఢ్యులుగ జేయదలచి వ్యాయామ శాలను ( తా లిం ఖా నా ) స్థాపించి వారందరికి క్రమ శిక్షణ మొసంగితిమి. తుదకొక్కరో, యిద్దరో కలియుగ భీముౖలెరి. ఇతరులు కేవలమారోగ్యమునుపొందిరి. ప్రయ త్నములొక్కటిగనున్నను ఫలములు వేౖరెనవి. కారణము తెలియునా ? పుట్టుకలో లోపముండెను. అనగా మొదటి నుండి వారియెముకలో గట్టితనములేదు. అందుచే నెంతశ్రమ పడినను బలము కలుగలేదు.

పుట్టుటకు పూర్వము వారితల్లిదండ్రులు ఆరోగ్యపద్ధ తుల గమనించి రసవంతములగు పదార్థముల సేవించియుందు రేని, యీజన్మమందొనర్చిన వ్యాయామము అభినవభీము లనుగ జేసియుండెడిది.

అటుల జరుగనందున వారికృషి వ్యర్థమయ్యెను. సారాంశమునుజూడ దేశాభివృద్ధికై జేయదగిన పని మాత్ర గర్భసంరక్షణమని స్పష్టమగుచున్నది. ఆసంరక్షణ విధాన మునకు మార్గముల దెలిసికొందము.

1. తల్లికి గర్భమగుటకు హేతువు తండ్రికదా! కావున, ఏవయస్సుగల పురుషుడు ఏయీడుగలస్త్రీని ఏ నియమములకులోబడి పెండ్లాడవలెనో

2. వారిరువురు ఏయేయాహారముల భుజింపవలెనో,

3. ఎట్టిసమయమున కలియవలెనో,

4. గర్భమైనపిమ్మట ప్రసవించువఱకు స్త్రీల నియమములెవ్వియో,

5. శిశువుపుట్టినపిదప ఱెక్కలువచ్చువరకెట్టుల పోషింపబడవలెనో,

ఇవియన్నియు తల్లిగర్భమును రక్షించుటకు ముఖ్యసాధనములైయున్నవి. వయస్సువచ్చినపిమ్మట ధర్మోపదేశములొనర్చి బాగుచేయుటకంటె,

1. పితృవీర్యమున జేరుటకుపూర్వము తండ్రులను,
2. తల్లిగర్భమున కేగుటకుపూర్వము తల్లులను,
3. యౌవనము పొందుటకుపూర్వము బాల్యమును-

సంస్కరించుట యెంత తెలివియో గమనింపుము. పైమాటిలో సర్వులెఱిఁగిన బాల్యదశను గుఱించి స్వానుభవమున జూతము.

జన్మించినది మొదలు పసితనమున చాలినన్ని పాలు-తగినంత చమురు-బిందెలకొలది నీరు-ప్రతినిత్యము శిశువున-కుపయోగింపవలెను. రెండుమూడేండ్లుగడచిన పిమ్మట వలసినంత నెయ్యి పాలు అన్నము మున్నగు రసవంతములగు పదార్థములచే పోషింపవలెను.

వెలుతురు, గాలి, ఎండ మొదలగునవి కలుగునట్లు చూడవలెను. మఱియు సదాచారమును నేర్పవలెను. పై పనులలో నెయ్యవిలోపించినను వయస్సుమీఱిన కొలది మనుజుడు రోగగ్రస్తుడై దుఃఖములపాలగును. యౌవనమందలి సుఖమునకు బాల్యమెట్టుల కారణమైనదో తెలిసినదిగదా? ఇంతటితో ముగియలేదు. ఈ దశకుపూర్వము

తలిదండ్రుల యాహారవిహారములుకూడా యోగ్యములైయుం డవలెను. ఈసంస్కారమున లోపముగలైనేని బాల్యదశ చెడును. తన్మూలమున యౌవనము భంగమై జీవితము వ్యర్థమగును.

"చెట్టై యొంగనిది మ్రానై యొంగునా? పుట్టుకతో బుట్టినబుద్ధులు పుడకలతోగానిపోవు. ఎముక ముదిరినచో, నెవరినైనను మెప్పింపలేము. చెట్ల పాదును గట్టిచేయక వృక్షముల బెంచజాలము. మంచిమట్టిని సేకరింపని కుమ్మరి గట్టికుండలను చేయగలడా? కాకిబంగారముతో సొమ్ములు చేయుటెట్లు?

ఆలోచింపగ మనకు తెలియనిదిలేదు. స్వవిద్య, స్వవేషము, స్వబుద్ధి, లేకున్నను పరవిద్య, పరవేషము, పరబుద్ధి, కల్గి పగటివేషధారులవలె సర్వజ్ఞుల మనుకొను చున్నాము. దేశ చరిత్రము, భూగోళము గణితము సైన్సు, తెలియకున్నను తెలిసినట్లే నటించుచుందుము. మనదశ యిట్లైనది. నివాసమా! భారతదేశమున, పుట్టినదా! ఋషి.గోత్రమున, లేక సూర్యచంద్రులవంశమున, లేక మరుద్గణమున, లేక సత్కులమున. ఏలినదా! సప్తద్వీపయగు వసుంధర. పొందినదా! చక్రవర్తి బిరుదము. ఎక్కినదా హిమాలయ శిఖరోపరిభాగము. వెలిగించినదా! జ్ఞానజ్యోతి. ఇచ్చినదా! అభయహస్తము. ఇట్లైన్ని లేవు.

"అంగడిలోనన్నియున్నవి. అల్లునినోటిలో శని యున్నది" అను సామెత సార్థకమగుచున్నది. దౌర్భాగ్య దేవత భారతీయ హృదయసీమల విహరింపుచున్నది.

కామదేవత బ్రహ్మచర్యమును భంగమొనర్చుచున్నది. మాయముసింప జ్ఞానజ్యోతికి ప్రకాశమెక్కడిది ? కొమ్ములు తిరిగిన యోధానయోధులు సైతము సత్యమార్గమును గమనింపక నిరంతర భ్రమణమునకు గుఱియగుచున్నారు. దేశాభివృద్ధికి ప్రథమకారణమగు మాతృగర్భరక్షణ విధానమును గమనింతురేని యెంతయో మంచిది. అందుకై వివిధయత్నము లొనర్పవలెను. అయ్యవి సత్సంతానమునకు కారణములగును. ఈ మార్గమును బోధించు మహాద్యమ మెచ్చటగలదో అచ్చట జన్మసాఫల్య మగును.

మహోన్నతమై సర్వసమ్మతమై, యమూల్యమై, యప్రతిహతమై యొప్పునాయుద్యమమే వివాహ సంస్కార మనబడును. జాతినిపుట్టించునదియు నీసంస్కారమే. మాతృగర్భ సంరక్షణము, ఇందే యిమిడియున్నది. కాబట్టి సర్వశక్తు లుపయోగించి దేశోద్ధారకంబగు సత్సంతతినిగనుటకై వివాహధర్మమును స్థాపింపవలెను. ఆ ధర్మమును తెలియు టెట్లు? నీవుహిందువుడవేని హిందుమతమే నీకు శరణ్యము. అదిమానవ నిర్మితముకాదు. దైవకృతము. వేదమూలమున నామతము జగత్కర్త చే బోధింపబడెను. దైవప్రేరితమై వేద సమ్మతమై యొప్పుమతమునువిడచి వివాహమొనర్ప మానవునకు తగదు. ఇది మొదలు వివాహమునకు మతముతో సంబంధమేమియని యవివేకియై పలుకకుము. మతముపోయిన మతిపోవును. అంత పతనము సంభవించును. అధోగతిని కోరుట భావ్యమా ? అధునాతన ప్రసంగములు మానుము. సనాతన మతస్థుడవై సనాతనుండవగుము.

అనార్యుడు:—

అయ్యా! వివాహము భూలోక సుఖమునకై యేర్పడిన ఒక తంత్రము. అది స్త్రీపురుషు లిరువురికే జరుగుచుండును. మనుజులే కాదు. పశువులుసయితము ఆడది, మగది కలసి యిట్టిసుఖ మనుభవించును. ఈయనుభవము సమస్త జీవ రాశికి సహజము. ఇట్లుండగా దీనిని మతసంబంధముగ నిర్ణయించు టెందుకో తెలియకున్నది. కామ వ్యాపారము మత సంబంధమైనయెడల పశ్వాదులకుగూడ మతముగలదని జెప్ప వలెను. ఎందుకన అవియు కామసుఖ మనుభవింపుచున్నవి. అయితే పశువులకు మతములేదు. ఈవిషయ మెల్లరెఱింగి నదే. కావున కామసుఖమునకై యేర్పడిన తంత్రము మత సంబంధమగుటతగదు. ఈవిషయమున మీప్రత్యుత్తర మేమి?

ఆర్యుడు:—

మిత్రమా! నీవు మతమన నెద్దియో తెలిసినటుల లేదు. దానిని కేవలము దైవసంబంధమని తలచుచున్నావు. మతమును బోధించిన గ్రంథమెద్దియో నీవు తెలియునా? హిందుమతమునకు వేదము మూలగ్రంథము. నీవనుకొన్న టుల దీనిలో దైవసంబంధ మొక్కటియే యుండవలెను. కాని యటులలేదు. స్త్రీధర్మములు, పురుషధర్మములు, జాతి ధర్మములు, రాజధర్మములు, భృత్యధర్మములు, సత్సంతాన పద్ధతులు, ఆహార విషయములు, ఆరోగ్య విధులు, ఆయు ర్వృద్ధి సాధనములు, మున్నగు ప్రాపంచిక విషయము లెన్నియో వివరింపబడియున్నవి.

వేదము కేవలము దైవసంబంధమే యైనయెడల స్త్రీ పురుష ధర్మములు, రాజధర్మములు మొదలైనవి అందుండ వలసిన పనియేమి ?

ఉదాహరణముకై ఈక్రింది మంత్రముల జూడుము.

"ఆనోవీరో జాయతాం" (వేదము)

మాకు వీరపురుషుడు జనించుగాక.

"సజాయతాం వీరతమస్స్వానామ్" (వేదము)

మాకు కలిగినబిడ్డ సంఘములో వీరాగ్రేసరుడై యుండుగాక.

"ఆతేగర్భోయోనిమేతు పుమాన్ బాణఇవేషుధిమ్" (వేదము)

నా పుత్రుడు అంబులపొదిలోని బాణమువలె నుండుగాక.

"ధనంధాన్యం బహుపుత్రలాభం శతసంవత్సరం దీర్ఘమాయుః" (వేదము)

ధనధాన్యములు, సంతానాభివృద్ధి, దీర్ఘాయుష్యము, మాకు లభించుగాక.

"సప్రథసభాంమేగోపాయ యేచసభ్యాస్సభాసదః తానింద్రియావతఃకురు." (వేదము)

నేను సభాపతినై యుందునుగాక. ఆసభలోని సభ్యులెల్లరు ఇంద్రియపుష్టికలవారై యుందురుగాక.

"శగ్గస్య పశూన్ మే గోపాయ
ద్విపాదోయే చతుష్పదః
యేచైకశఫా ఆశుగాః. (వేదము)

నాకు అనేక గోవులు, గుఱ్ఱములు మొదలగునవి కలుగుగాక. అని యిహలోక సంపదను వేదమెటుల బోధించినదో తెలిసినదా? మఱియు దంపతులగూర్చి వేద సంబంధమును వినుము.

"ప్రజాతంతుం మావ్యవ చ్ఛేత్సీః" (ఉపనిషత్)

ఓయీ నీవు స్వర్గసుఖ మపేక్షింతువేని యొంటరిగ నుండకుము. ఒక స్త్రీని తోడుజేసికొని ఆమెయందు సంతతినిగనుము. బిడ్డలు లేనివాడవై యుండకుము.

"ఆరభేధామనుసగ్ంరభేధాం + జాయాపతీసగ్ం
రభేథాం" (వేదము)

ఓ దంపతులారా! మీరిరువురుగలసియే కర్మ లొనర్పుడు. వేరుగ నొక్కపనియైనను జేయకుడు. అపుడే మీకు స్వర్గము లభించును.

"అయజ్ఞోవా ఏషోఽపత్నీకః"

ఓ మనుజుడా! యజ్ఞమొనర్పుము. భార్య లేనియెడల నీకు యజ్ఞమొనర్చుట కధికారములేదు. ఒక యజ్ఞమేకాదు. ఏపవిత్రమైనను ఆమె లేకుండ చేయకుము.

"పరీక్ష్యలోకాన్ కర్మచితాన్ + సగురుమేవాభిగచ్ఛేత్"
(వేదము)

భార్యాసహితుడవై వేదకర్మ లన్నిటిని పూర్తిగావించి తుదకు వైరాగ్యమును బొందుము. అంతవఱకు భార్యను విడువకుము. సర్వవిషయములు తుచ్ఛములని యేనాడు గ్రహింతువో ఆదినమే భార్యనువిడిచి సన్యసింపుము. అని వేదము బోధింపుచున్నది.

ప్రపంచసంబంధ మున్నంతవరకు గృహస్థుడవై జగ త్సౌఖ్యముల ననుభవింపుమని వేదమెటుల బోధించెనో స్పష్ట మయ్యెనుకదా! స్త్రీ పురుషు లెటుల నడువవలెనో దానిని మాత్రమే వేదము తెలుపలేదు. పెండ్లి చేసికొను విధాన మును సైతము వివరించెను. ఆమంత్రముల జూడుము.

"గృభ్ణామి తే సుప్రజాస్త్వాయహస్తం"

(వివాహ మంత్రము)

ఓ భార్యా! సత్సంతానముకొఱకు నీ చేతిని పట్టు కొనుచున్నాను. అనగా పెండ్లాడుచున్నాను. ప్రాణములను విడుచువరకు నిన్ను వదలను. అని వేదము, పురుషునిచే బలికించుచున్నది.

దీనింబట్టి వేదమునకు వివాహముతో నిమిత్తము లేదని తెలుపగలమా? మంత్రములు లేకుండ పెండ్లియే లేదు. ఇక మంత్రములకును పెండ్లిండ్లకును సంబంధములేద ని చెప్పుటెట్లు? ఆలోచింపగ మంత్రములు మతసంబంధ ములనుట నిస్సంశయము. నిజముగా స్త్రీపురుషులకు పెండ్లి చేయునది మతమేసుమా!

ఏ పురోహితుడో, ఏ వేదమంత్రములో, ఏ పౌరాణిక శ్లోకములో, లేని వివాహ మెచ్చటనైన కలదా? ఒకవేళ నున్నచో నది వివాహమనబడదు. ఎందుకన మంత్రములు లేకుండ ఆడపశువు, మగపశువు కలియుచున్నది. మంత్రము లతో పనిలేక కేవలము స్త్రీపురుషులుకూడ కలిసినయెడలఅది యును పశుధర్మమేకదా? కావున ఎన్నటికినిదానిని వివాహమన

రాదు. కామము గల్గినపు డొకమగపశువు ఆడపశువుతో జేరుచున్నది. అంతకు పూర్వము ఆ రెంటికిని వివాహమనునది యుండదు. ఏదోయొక దినమున కామసుఖమనుభవించును. అంత సంతతిగలుగును. రెండవమారు మఱియొక బిడ్డను గన వలెనన్న ఆ యాడపశువు మొదటిపశువుతోడనే కలియవలె నను నియమములేదు. వేఱొక మగదానిని జూచుకొనును. బిడ్డబిడ్డకు క్రొత్తమగడే యన్నట్లున్నది ఈ కథ. సంఘాభి వృద్ధికై పశుజాతిలో నిటుల జరుగుచుండును. ఈ యభివృద్ధి విషయమున ప్రత్యేక నియమము లెవ్వియునుండవు. కావున వావివరుసలును లేవు. చూచితివా! పశుధర్మము. పశువులకును మనుజులకును కామము సమానమా లేక హెచ్చుతగ్గులా? యని విమర్శింతము. ఆ విషయమున భేదమెంతయోగలదు. పశువుల కామము సంవత్సరమునకో, ఆరు నెలలకో, మూడు మాసములకో నియతమై ఒక్కసారి వ్యక్తమగును. అంతట మగపశువు ఆడపశువు కలియును. వెంటనే గర్భమేర్పడును. అది గర్భిణిగ నున్న దినములలో నొక్కసారియైనను మగ పశువుతో కలియదు. మొత్తముమీద పశుస్వభావ మిట్లే యున్నది. ఈ నియమమును మానవులు విన్నపుడు ఆశ్చర్య మొందుదురు. ఎందుకనన ఎన్నిజన్మములు తపమొనర్చినను కామవిషయమున నియమబద్ధులై యుండలేరు. ఈ దురవస్థకు గారణము వారు చేతులార చేసికొన్న నేరమైయున్నది. అదియెటులనో వినుము. సృష్టిప్రారంభమున స్త్రీలకుగాని పురుషులకుగాని యింతటి కామప్రవృత్తి లేదు. ఆకాలమున స్త్రీలు తమ జీవితములో నొక్కసారియే పురుషుని పొంది

గర్భవతులై బిడ్డల గనుచుండిరి. కొంతకాలమున కది సరి కాదని నిశ్చయించి * స్త్రీలెల్లరు తమకు కావలసినపుడెల్ల పురుషసంబంధము గల్గునట్లు వరమిమ్మని ఇంద్రుని ప్రార్థించిరి.

ఆ వరమువలన స్త్రీలకంతగ నష్టము కలుగకుండెను. అయితే స్త్రీలతో కలసిన పురుషులు దేహబలమును, మనో బలమును పోగొట్టుకొని రోగములపాలై ఆయుర్విహీనులగు చుండిరి. ఈ కామము పురుషుల పాలిటికి మృత్యుదేవతయై వెలయుచున్నది. స్త్రీలు పురుషులకు జేసిన మహాపకార మిదియే. పైకథ కల్పితమనియు హిందూమతమందలి లోపము లివియేయనియు కొందఱనవచ్చును.

క్రీస్తు మతములో సైతము ఇదేగతిపట్టినది చూడుము.

దేవుడు "ఆదాము" అను పురుషుని పుట్టించి అతడు నిద్రింపుచుండ అతని ప్రక్క-ఎముకనుండి యొక స్త్రీని సృజించెను. వారిరువురిని భార్యాభర్తలుగ నొనర్చి ఒక చెట్టును జూపి దాని పండును తినరాదని హెచ్చరించి వెళ్లెను. "సైతాను" అను మాయాదేవి ఆదంపతుల కడకేగి ఆ పండును తినుడని ప్రోత్సహించెను. ఎంతజెప్పినను "ఆదాము" వినలేదు. అతని భార్యయగు "హావ్వ" దేవుని వాక్యము కంటె సైతాను వచనము మంచిదని తలచి తనభర్తను బల వంతపెట్టి దేవుడు నిషేధించిన పండును తినిపించెను. తాను కూడ తినెను. ఆ సంగతి దేవుడెఱింగి,

* ఈవిషయమై రాబోవుగ్రంథములలో వేదశాస్త్రములనుండి ప్రమాణము లొసంగబడును.

"మీరిరువురు నాయాజ్ఞల దిరస్కరించితిరి. సైతాను వలలో జిక్కితిరి. ఇది మొదలు మీకు కామమభివృద్ధియై సంతతిని పొంది రోగములపాలై మృత్యుముఖాగ్ని గుండమున బడి చెడిపోవుదురుగాక!"

అనిశపించెను. తురకమతమునగూడ యిదేకథగలదు. ప్రపంచమందెచ్చట జూచినను స్త్రీలు మాయాస్వరూపిణులై నిరంతర కామప్రవృత్తికి మార్గదర్శినులై మానవలోకమున నీతినియమములకు చోటులేకుండ జేసిరి. పశువు లెంతహీనములగనున్నను నియమాతిక్రమణము లేనందున కొంతవఱకవియే మేలని జెప్పవచ్చును. మనుజు లెన్నివిధములనో తెలివిగలవారయ్యు వివేకమంతయు మంటగలిపి కామదాసులై పశువులకంటె హీనులై భ్రష్టులగుచుండిరి. వీరికి కామరాజు దేవుడయ్యెను. భగవంతుని విడిచి భగసేవ జేయుచుండిరి. ఈ ముఱికి గుంటలో పడి పొర్లాడినకొలది జాతికి వికాసము కలుగునా? ఇహలోకమున వేరే యమకూపము లేదు. రాజాధిరాజులు, వేదవేదాంత వేద్యులు, యోగులు, పండితులు సైతము భగభాగ్యభోగసంపన్నులై, ఉభయసామ్రాజ్యసింహాసనచ్యుతులై నీచాతినీచులైవర్తించుచున్నారు.

ఈభయంకర కృత్యమునుండి తప్పించుకొనుటకు దారిగానక నతివేగమున పరుగిడుచున్న కామరథమును నెమ్మదిగ నడుపుటకును, మానవత్వము పశుత్వముగ మారకుండుటకును, భగధ్యానము క్రమముగ భగవద్ధ్యానముగ మార్చుటకును, కామోత్పత్తి కలుగకుండుటకుపూర్వమే మతసంబంధ

మగు వివాహపద్ధతి నియమింప బడవలసివచ్చెను. ఇందుకై లోకదృష్టాంతము లెన్నియోకలవు.

1. ఒకనాడు బండిపై నెక్కి యొక గ్రామాంతరము జేరదలచితిమి. అందుకై యొక గుఱ్ఱము కావలసియున్నది. చూపుల కందముగనుండి మంచి బలముగల్గి స్వేచ్ఛగ విహరించిన గుఱ్ఱమునుదెచ్చి బండికి కట్టినయెడల నది గమ్యస్థానమును జేర్చునా? చేర్చదు. వెంటనే మార్గమును తప్పించి యేగోతియందో పడవేయును. అందువలన ప్రాణములు పోగలవు.

2. ఆంబోతులను అరకగట్టి పొలము దున్నగలమా? లేక బండిని లాగింపగలమా? కండ్ల కావరమెక్కిన పశువులకు మన్నుమిన్ను కనబడదు.

కావుననే బాల్యమునుండి యలవరచుకొనక వానినుపయోగింపరాదు.

ఇక స్త్రీపురుషాదులను గుఱించి మాట్లాడుదము. నూటికి 99 మంది పురుషులు స్త్రీల వ్యామోహమున జిక్కుచుందురు. అదేమిచిత్రమో! స్త్రీయనిన పురుషుని దేహము పొంగుచుండును. ఆమెదగ్గర సూదంటురాయి యున్నదేమో తెలియకున్నది. ఇక పురుషులో యినుపముక్కలవలె మెల్లగ స్త్రీలను సమీపింతురు. ఈకష్టమునుండి తప్పించుకొను పద్ధతి యేసంఘమున కలదో ఆసంఘము పరమపవిత్రమై యభివృద్ధి జెందగలదు. అందుకు మార్గమెద్దియో యాలోచింతము.

మాయాస్వరూపిణియగు నా స్త్రీని బాల్యమునుండి యొకని యధీనమొనర్చి వేషమందును, నడకయందును, నివాసమందును, తగిన కట్టుదిట్టము లేర్పఱచి వానియందు భయభక్తులతో సంచరించునట్లొనర్చి ఆతనిని దైవముగ భావించునట్లు జేయవలెను. స్వేచ్ఛావిహారమునకు చోటియ్య రాదు. మాటిమాటికి పురుషుల కండ్లలో బడనీయరాదు. ఒకవేళ విధిలేక నొకానొక సమయమున పురుషుల దర్శింప వలసినయెడల, లజ్జగలిగి, వేషము, చాతుర్యము గనబడ కుండునటుల నలవాటు చేయించవలెను. ఈపద్ధతుల నభ్య సింపజేసినయెడల కామప్రవృత్తి చాలావఱకు నశించును. అట్టి యభ్యాసమొనర్చుటకై కామోత్పత్తికి పూర్వమే పెండ్లిచేయుట శ్రేయస్కరము.

బాల్యమున స్త్రీలకు వివాహమైనయెడల పతిని దైవ ముగ భావించి భయభక్తులుగల్గి వర్తింపగల స్థితికివత్తురు. పిమ్మట రజస్వలలై కామప్రేరితలైనను కామచిహ్నములగు నడకలు, వేషములు, వయ్యారములు, తమ పురుషులకడ చూపక సిగ్గుపడుచుందురు. అవినయవిధేయతలు మాటి మాటికి పురుషుని కామపాశముల జిక్కనీయక బంధించును. అంత వారిరువురికి శ్రేయస్సుగల్గును. ఇటుల మానవోన్నతి కి బాల్యవివాహము క్షేమకరమై వెలయును.

అటుగాక యౌవనానంతరము వివాహము జేసితిమేని ఆమె తనపురుషుని దైవముగ జూడజాలదు. కేవలము కామ పీడితయై యుంటచే నాకామరోగమునకు ఆతనిని దివ్యౌషధ ముగ భావించి కామదృష్టిచేగల్గిన బంధుత్వమని భ్రమించి

కామకార్యముకొఱకే తన జీవయాత్రను సాగింపుచుండును. ఈమార్గము మానవజాతికి వినాశహేతువని యిదివఱకే తెలిసికొంటిమి. కావున యువతీవివాహము నష్టదాయకము.

వాస్తవమున బాల్యమున జేయబడునదే వివాహ మనబడును. యౌవనమున స్త్రీపురుషు లిద్దరుగలిసి తాము భార్యాభర్తలమని తలచినను వారికి జరిగినది పెండ్లికాదు. వారు సతీపతులునుకారు. ఒకవేళ వివాహతంత్రము మంత్ర పూర్వకముగ జరిగినను బొమ్మలకు పెండ్లిచేయుచు మంత్రములు చదివినమాత్రమున నవి భార్యాభర్తలై యుండనట్లు యువతీ యువక దాంపత్యముకూడా శాస్త్రసంబంధమై మానవధర్మమై యుండదు.



కొండా శంకరయ్యగారి ప్రిమియర్ ముద్రాక్షరశాల, శికింద్రాబాద్.

# ఒక శేషమాట.

ఉంటావా నీమతంలో సరిగా ఉండు. లేదా! హిందూత్వాన్ని వదలుకో!! అయితే హిందూమతంలో అన్నీ సందేహాలంటావా? అదంతా వెనకటి ముచ్చట. ఇప్పుడో!

"హిందూమత గ్రంథమాల"

బయల్దేరింది. వరసబెట్టి సందేహాలు తీరుస్తున్నది.

ఇల్లాంటివేగా! నీసంశయాలు,

1 దేవుడున్నాడా? ఉంటే నామరూపాలుంటయా? బ్రహ్మ తన కూతుర్ని, విష్ణువు తులసిని, శివుడు ఋషిభార్యల్ని, కృష్ణుడు గోపికల్ని, ఇంద్రుడహల్యను, చంద్రుడు తారను, పొందారు. రాముడు వాలిని చంపాడు. శంబుకుణ్ణి వధించాడు. వీరంతా పూజ్యులా? ఇందులో రహస్యమేమైనా ఉందా?

2. బ్రహ్మదేవుడి తొడలో నారదుడు, కండ్లలో అత్రి, వేలిలో దక్షుడు పుట్టారని వుంది. ఇది నమ్మడం యెల్లాగ?

3. వామనుడు తనపాదంతో భూమినాక్రమిస్తే బలిచక్రవర్తి యెక్కడుంటాడు? ఇక మూడవ పాదాన్ని అతని నెత్తిమీద పెట్టారనడం అసంభవం కాదూ?

4. వేదాలు వ్రాసిందెవరు? దేవుడా? లేక బ్రాహ్మణులా?

5. దేవుణ్ణి మనస్సులో ధ్యానిస్తే చాలదూ? గుళ్లూ గోపురాలెందుకు? గుడిమీద బూతుబొమ్మలెందుకో?

6. కుక్కలకు, కుండలకు పుట్టిన బ్రాహ్మణుల్ని గౌరవించాల్నా? శూద్రస్త్రీకి నారదుడు, భోగస్త్రీకి వశిష్ఠుడు, బోయవానికి వాల్మీకి పుట్టారు. వాళ్లు బ్రాహ్మణులెల్లాగయినారు? జాతులు పుట్టుకచేతనా? గుణంచేతనా? ఎక్కడలేని జాతిభేదాలు హిందూదేశంలో మాత్రమెందుకు?

7. స్వర్గనరకాలుంటాయా? పూర్వజన్మంలో చేసిన పాపానికి నరకంలో శిక్షవుంటుందిగదా? మళ్ళీ భూలోకంలో యీకష్టాలెందుకు? ఒక నేరానికి రెండుశిక్షలా? అసలు పూర్వజన్మంవుందా? ఉంటే ఆజన్మంలో సంగ

తులు ఈజన్మంలో జ్ఞప్తికి రావడంలేదేమి? చచ్చినవాడికి తద్దినం పెడితే ఆకలి తీరుతుందా? అల్లాగయితే రోజూ పెట్టాలిగాని యేడాదికొకమాటేమిటి?

8. మీసాలువచ్చిన మగవాళ్లకు పెండ్లిచెయ్యొచ్చుగాని పెద్దమనిషయిన పిల్లకు పెండ్లిజేయడంతప్పా?

9. ఆడవాళ్లు మగవాళ్లతోపాటు సమానంగా ఉండకూడదా? ఇప్పుడున్న మొగుడుపెళ్లాలే మళ్ళీపుడితే వాళ్ళే పెండ్లిచేసుకుంటారా? మగవాళ్లు చాలామందిని పెండ్లాడవచ్చుగాని, ఆడవాళ్లకు పనికిరాదేం? అయితే ద్రౌపదికి అయిదుగురుభర్తలు న్నారేం? పెండ్లికాకముందే కర్ణుణ్ణి కనేసిన కుంతి మొగుణ్ణిడిగి పరాయివాళ్లవల్లబిడ్డల్ని పుట్టించుకోవచ్చా? పూర్వకాలంలో మొగుడుచచ్చినవాళ్ళు బిడ్డల్ని కనలేదా? ధృతరాష్ట్రుడు, పాండురాజు, అల్లాపుట్టినవారుకారూ!! ఇప్పుడుచేస్తే తప్పేం?

ఇవేకాదు ఇంకా ఎన్నిరకాల ప్రశ్నలైనాసరే ఈగ్రంథమాల నిమిషాల మీద యెగరగొడుతుంది. దీనిబలంఏమిటో తెలుసునా!! వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, సైన్సు, యుక్తులు అనుభవాలు. ఇంకేంగావాలె?

☞ వెంటనే సభ్యులుగాచేరి చదవండి!! నెలకొకబుక్కు బయలుదేరుతున్నది.

విడిపుస్తకం రు 0-1-6 మాత్రము.

సంవత్సరానికి పోస్టేజీతోకూడ రు 1-2-0 బ్రిటిష్

" " రు 1-4-0 నైజాం.

అడ్రసు

మేనేజరు:—

# హిందూ మత గ్రంథమాల

లాలాటెంపిల్ స్ట్రీటు,

శికిందాబాదు (దక్కన్.)

---

ఏజెంట్లకును, వ్యాపారస్థులకును, కమీషను ఇవ్వబడును. కావలసినవారు వ్రాయుడు.

# హిందూ మత గ్రంథమాలా

## విరాళముల వివరములు

మహారాజాధిరాజపోషకులు రూ. 116-0-0 మొదలుకొని

మనయొత్సాహముకొలది.

| | | |
|---|---|---|
| మహారాజపోషకులు | సం॥ నకు రు | 25-0-0 |
| రాజపోషకులు | ,, | 10-0-0 |
| పోషకులు | ,, | 5-0-0 |
| సహాయకులు | ,, | 3-0-0 |
| అభిమానులు | ,, | 2-0-0 |

## చ ం దా వి వ ర ము

సంవత్సరం చందా

పోస్టుతో సహా ,, 1-2-0 (బ్రిటిష్)

,, ,, 1-4-0 (నైజాం)

☞ విరాళ దాతల పేర్లు ద్వితీయ ముద్రణమునుండి ప్రకటింపబడుచుండును.

చిరునామా

మేనేజరు:—

# హిందూ మత గ్రంథమాల

లాలా టెంపిల్ స్ట్రీటు,

శికిందాబాదు (దక్కన్)

---

☞ గ్రంథమాలా సభ్యులుగ నుండదలచినవారు తమ పేరు, పోస్టు, తాలూకా, జిల్లాను విడివిడి అక్షరములతో వ్రాయవలెను.

# రామోక్త గ్రంథములు

——:——

పట్టాభిషిక్తుడవై కాదలంచితివా?

గృహరాజ్యమును వశపరచుకొని

తక్కిన అయిదు రాజ్యముల సాధింపుము.

అవి యెవ్వి?

౧ దేహ రాజ్యము ౨ దేవ రాజ్యము

౩ దేశ రాజ్యము

౪ ధర్మ రాజ్యము ౫ మోక్ష రాజ్యము

ఈ రాజ్యము లన్నిటిని పరిపాలించు విధానమును

తేటతెల్లముగ తెలియజేయు

## హిందూ మత గ్రన్థమాలా

కుసుమముల సేకరింపుము.

హిందూ మత గ్రంథమాల

ఉపన్యాస చక్రవర్తి

ఉమామహేశ్వర పండిత్‌గారి ఉపన్యాససారము.

# Home Rule

# గృహరాజ్యము

4 వ భాగము.

విక్రమ సం॥ పుష్యమాసము.

4 వ పుష్పము



వెల
**0-1-6**



నమస్తే

ఈ గ్రంథమాలలో
వెలువడు గ్రంథములపై సర్వాధికారములు
బ్రహ్మశ్రీ
ప్రభాకర ఉమామహేశ్వర పండితులవారివి.

హిందూమత ప్రచారక, ఉపన్యాస చక్రవర్తి

బ్రహ్మశ్రీ ప్రభాకర ఉమామహేశ్వర పండితులవారి

ఉపన్యాససారము

# గృహారాజ్యము.

## ( 4 వ భాగము )



కొండా శంకరయ్యగారి ప్రీమియర్ ముద్రాక్షరశాల,

సికిందరాబాద్.

 వెల 0-1-6

# గృహరాజ్యము.

—:—

## 4 వ భాగము.

(27 వ ప్రశ్న)

అనార్యుడు:—

అయ్యా! బాల్యవివాహమే వివాహమనియు సమ ర్తాడినపిమ్మట జరిగిన పెండ్లి—పెండ్లి కాదనియు తెలిపితిరి. ఇంతియేకాదు. కామము జనించినపిమ్మట పెండ్లియైనచో నది పశుధర్మమని నుడివితిరి. ఇదే నిజమైనయెడల స్త్రీపురుషు లిరువురికి బాల్యవివాహమే చేయవలెను. అటుగాక స్త్రీల కొక ధర్మము—పురుషులకొక ధర్మమా?

ఆర్యుడు:—

మిత్రమా! స్త్రీపురుషు లిరువురు సమానులని భ్రమిం పుచున్నావు. అది నిజమైనయెడల సృష్టిలో స్త్రీలనియు, పురుషులనియు, రెండుజాతు లుండుటకు హేతువేమి? అట్లుండుటకు కారణము సృష్టి చక్కగ నడచుటకేయని తెలియుచున్నది. ఇందులకు లోకానుభవమే సాక్ష్యము.

మొదట స్త్రీపురుషు లిరువురు పెండ్లాడు టెందుకో తెలిసికొందము. వారి వివాహములు సంతతి నిమిత్తమేయని యెల్లరెఱుంగుదురు. (అనగా నొక పదార్థమును పుట్టించుట కని తేలుచున్నది.) లోకమం దెచ్చటనైనను రెండు పదార్థ ములు గలసి మఱియొకవస్తువును పుట్టించునేమో చూతము.

I సున్నము-పసుపు-కలవనుకొనుము. ఈ రెండును గలసి పారాణమను నొక పదార్థమును పుట్టించుచున్నవి. కావున నీరెంటిని దంపతులుగ పోల్చుకొనవచ్చును. ఈ దంపతుల తత్త్వము సమానమా? లేక భిన్నమా? యని విమర్శింతము. సున్నపు ధర్మము వేరు-పసుపు ధర్మము వేరు అని సులభముగ తెలియగలదు.

ఇంతయేల? రూపమందును - వర్ణమందును-స్వభావమందును-వినియోగమందును-ప్రయోజనమందును సర్వవిధముల నవి రెండును భిన్నములైయున్నవి. పసుపుతో. జేయదగిన పనులను సున్నముతో జేసినయెడల పడరాని పాట్లు పడుదుము. కాబట్టి యేజాతిధర్మ మాజాతికే నియతమైయుండుట దైవనిర్మితము. ఈ పోలికను స్త్రీపురుషుల విషయమున జూచినయెడల వారి ధర్మములు సమానముగ నుండరాదని తెలియుచున్నది.

(2) ఇంతియే కాదు. మఱియొక ఉదాహరణము గైకొందము. మన యనుభవమున భూమి-విత్తనము అని రెండు పదార్థములు కలవు. ఇవి చేయుచున్న పనియేమి? ఒకదానితో నొకటి గలసి వృక్షములను బుట్టించుచున్నవి. చెట్లు పుట్టుటకు భూమి-విత్తనము ఈ రెండును కారణములైనను భూమినుండియే యవి మొలచి ఫలించుచున్నవి. అపుడే యా భూమి సారవంతమైనదనియు-సస్యాఢ్యయనియు ఇట్లు వివిధనామముల బ్రసిద్ధిజెంది వన్నెకెక్కుచున్నది. పైరుతో కళకళలాడు భూమిని కనులారగాంచినపుడున్న యానందమునకు మేరలేదు. ఆ సమయమున లక్ష్మితాండవ

మాడినట్లుండును. సర్వ వస్త్రాభరణ భూషితమై యొప్పు ము తెరువోయున్నట్లు తోచును. ఈ శోభను-అనుభవించునది భూమియే కాని విత్తనములు కావు. విత్తనసహాయము లేని యెడల భూమి కాశోభ రాజాలదు. సారాంశమేమన ! ఏ రెండు పదార్థములుగలసి మఱియొకదానిని సృష్టించుచున్నవో అందొక పదార్థము సహాయమును బొందునదియు, రెండవది సహాయమొనర్చునదియునని స్పష్టమగుచున్నది.

ప్రస్తుతము భూమి విత్తనమునుండి సహాయమును బొందుచున్నది. విత్తనము భూమికి సహాయమొనర్చు చున్నది.

(౨) మఱియొక ఉదాహరణమును గ్రహింతము. సూర్యుడు-చంద్రుడు-అను రెండు పదార్థములు కలవు. ఇవి కలసినపుడు వెన్నెల పుట్టుచున్నది. వెన్నెలను పుట్టించుట చేతనే చంద్రుడు రాణించుచున్నాడు. లేనియెడల చంద్రునకు నామరూపములుండవు. ఎందుకన ! మనకు గోచరించు చంద్రబింబములోని తెలుపు వాస్తవమున నామండలమున లేదు. అది మొదట నల్లని పెంకువలె నుండెను. అయితే ఈ తెలుపెట్లువచ్చినదో చూతము. సూర్యుని తేజస్సు చంద్రునిపై బడగా నలుపుపోయి తెలుపువచ్చినది. అంత చంద్రుడు కళకళలాడెను. చంద్రు డిటుల వన్నెకెక్కుటకు కారణము సూర్య సహాయమే సుమా ! సూర్యుడు సహాయ మొనర్చెననియు చంద్రుడు సహాయమును పొందెననియు తేలినది.

(4) ఇప్పటికి ప్రపంచమందున్న మూడు దృష్టాంతములను గైకొంటిమి. ఇక ప్రపంచమునే యొక దృష్టాంతముగ గ్రహింతము. పారాణము-వృక్షములు-వెన్నెల పుట్టినటులు నీ జగముకూడ నొకానొక కాలమున సృష్టింపబడెను. ఎయ్యది జన్మించెనో దానిని పుట్టించుటకై రెండు పదార్థములుండవలెనని తెలిసికొంటిమి. అయితే జగమును సృజించిన పదార్థములెవ్వి? అవియే బ్రహ్మము-మాయ అని చెప్పబడును. ఈ విషయము మతమువలన గాని తెలియదు.

మాయ యనునది భూమివలె స్వతస్సిద్ధముగ రాణింపజాలదు. ఒకరి సహాయమును పొంది వన్నె కెక్కుటలో నత్యద్భుత ప్రజ్ఞ కల్గియున్నది.

కావుననే బ్రహ్మముయొక్క సహాయముచే నీ యనంతకోటి బ్రహ్మాండముల సృజించి జగజ్జననియై ప్రకాశింపుచున్నది.

ఈ దృష్టాంతములలో గమనింపదగిన రహస్యమొకటి కలదు. భూమి-చంద్రబింబము-మాయ-ఈ మూడును భాషాసాంప్రదాయమున స్త్రీ తత్త్వములుగ వర్ణింపబడినవి. విత్తనము-సూర్యుడు-బ్రహ్మము ఇవి పురుషతత్త్వములుగ గణింపబడియున్నవి. సహాయమొనర్చిన పదార్థములు పురుషతత్త్వములో నున్నవి. సాయము పొందిన వస్తువులు స్త్రీతత్త్వమున జేరెను.

సహాయకులు పురుషులనియు, సాయము పొందినవారు స్త్రీలనియు విశదమగుచున్నది.

ఈ స్వల్ప కారణముచే పై మూటిని స్త్రీలలో జేర్చుట న్యాయమా యని కొందఱనవచ్చును. కాని దీని నెవరు కల్పింపలేదు. అయితే హిందూ సిద్ధాంతమం దటుల కలదు. ఇక్కాలమున సామాన్యు లెల్లరకు పరమ ప్రమాణ మనదగిన పాశ్చాత్త్యుల సాంప్రదాయమున భూచంద్రులు స్త్రీలో-లేక పురుషులో తెలిసికొందము. దేశాభిమాన మంకురించినపుడు ఇంగ్లీషువాడు "My mother land" నా దేశమాత అని చెప్పును. దీని భావమేమి? తన దేశము తల్లియని గదా! దేశము తల్లియైనపుడు తండ్రి యెవడు? దేవుడని వాని భావము. స్త్రీనుండి పుట్టుటచే నామె తన కెటుల తల్లియయ్యెనో అటులనే తాను జన్మించిన దేశమును గూడ తల్లిగ భావించుచున్నాడు. ఇది న్యాయమనుటలో సంశయము లేదు. కనుకనే వారి భాషలో భూమిని స్త్రీలింగ ముగ వాడిరి.

ఇక చంద్రునిగూర్చి విచారింతము.

ఆంగ్లభాషలో చంద్రుని మూన్ అను శబ్దముచే పిల్తురు. మరియు దానిని స్త్రీలింగముగవాడుదురు. ఈవిషయ మాంగ్లభాషావేత్త లెఱింగినదే. ఇందుకు కారణమేమో యూహింపుము. చంద్రునియొద్దకు వెళ్లి స్వయముగ పరీక్షించి లింగనిర్ణయ మొనర్చిరా? లేదు. సహజముగ ప్రకాశింపజాలని పదార్థములకు సహాయ మొనర్చు వస్తువులు పుంలింగములనియు సహాయ మనుభవించునవి స్త్రీలింగములనియు, నిర్ణయించిరి.

మఱియు స్వతంత్రశక్తి గల్గి విశేషబలముగల పదార్థ

నులు పుంలింగములనియు, అస్వతంత్రములై బలహీనములై యుండునవి స్త్రీలింగములనియు నిశ్చయించిరి. ఇంతకంటె స్త్రీపుంలింగ విభజనమునకు కారణము వేరొండు లేదు. ఇటుల జగత్స్వభావమును పరిశీలించినపుడు సృష్టించుటకు రెండు పదార్థము లుండవలెననియు నవి పాజిటివ్-నెగిటివ్ కరెంటులవలె భిన్నతత్త్వముల కల్గియుండెననియు-అందొక వస్తువుయొక్క పని రెండవది చేయరాదనియు-అటుల జేయుచో సృష్టి కార్యము జరుగదనియు-మఱియు జగత్కల్యాణ మొనగూడదనియు ఆ రెంటికని సమానధర్మ మెన్నడును లేదనియు-అందొకటి స్త్రీతత్త్వము-రెండవది పురుష తత్త్వమనియు స్పష్టమయ్యెను.

ఈరీతిగ ప్రపంచ పరిశోధన చేసినపుడు తేలిన యథార్థమును గ్రహింపక స్త్రీపురుషు లిరువురు సమానులే యని వచించుట లోకజ్ఞుల లక్షణము కాదు. ఇక స్త్రీపురుషుల వివాహవయస్సును గూర్చి విమర్శింతము.

స్త్రీపురుష ధర్మములు వేరగుటచే వారి వివాహవయస్సుకూడ భిన్నముగ నుండవలెననియే నిశ్చయింపవలెను. అది యెటులనో వినుము.

స్త్రీపురుషు లిరువురు కామసుఖమునకై యత్నించుచున్నారు. వారు పెద్దమనుష్యులైనపుడే ఆ సుఖ మనుభవించుటకు సమర్థులగుచుందురు.

స్త్రీజాతి-పురుషజాతి అని వేరుగనున్నందున వారు పెద్దమనుష్యులగునట్టి వయస్సుకూడ భిన్నమగుచున్నది.

సాధారణముగ స్త్రీలు 12-13-14 వత్సరములలో పెద్దపిల్లలగుచున్నారు. పురుషులకు మీసములు వచ్చిన గాని పెద్దమనుష్యులుకారు. ఆ స్థితి 16 వత్సరములు దాటి నపుడు కలుగుచున్నది. అపుడైనను స్త్రీని పొందుట కర్హు డుగ నుండడు.

స్త్రీలు పెద్దపిల్లలైనది మొదలు అనగా సుమారు 12 వత్సరములనుండి సంతతిని కనుచున్నారు. అట్టి స్త్రీలకు సహాయమొనర్చుటకై 20 సం॥ దాటిన పురుషులే తగియుం దురు. ఈ లోపల పురుషుడు స్త్రీకి సంతతి నిమిత్తమై సహాయమొనర్చినను అతడు మనోదౌర్బల్యమును పొంది నిర్వీర్యుడై అల్పాయుష్మంతుడగును. వారిరువురు సమాన ధర్మము కలవారైనయెడల 12 యేండ్ల స్త్రీని 12 యేండ్ల పురుషుడే యేలపొందరాదు ?

లేదా 16 యేండ్ల స్త్రీకి 16 యేండ్లవా డెందుకు సహాయమొనర్పరాదు ? ఇక్కాలపు నాగరికులు సైతము 14 యేండ్ల స్త్రీకి 20 యేండ్లవానిని చేర్చుచున్నారు. భేదము లేదని యుపన్యాసములలో జెప్పుచు వారిని కలుపుటలో భేదమును జూపుచుందురు. ఈ సంస్కారులు చెప్పునది యొకటి, చేయునది మఱియొకటి.

12 యేండ్లకు స్త్రీలు పెద్దపిల్లలగుచుండ-ఇరువదేండ్లకు పురుషులు పెద్దమనుష్యులగుచున్నారు. అనగా సంతానో త్పత్తికి అర్హులగుచున్నారు. అందుచే స్త్రీల వయస్సుకంటె పురుషవయస్సు అధికముగ నుండవలెనని తెలియుచున్నది.

ఇందొకరికి బాల్య వివాహము—మఱియొకరికి యువక వివాహము జరిగితీరవలెను.

సాధారణముగ పురుషులకు పదునారేండ్లు దాటినగాని కామప్రవృత్తి కలుగదు. స్త్రీలు పదేండ్లకే రజస్వల లగుటయు పురుషులు 16 యేండ్లలోపలనే కామలోలురగుటయు నచ్చటచ్చట తటస్థించినను అది రోగరూపమని వైద్య శాస్త్రము తెల్పుచున్నది. ఎటుజూచినను పురుషులకంటె ముందుగ స్త్రీలకే కామోత్పత్తి కల్గుచున్నటుల స్పష్టమగుచున్నది. దీని ననుసరించియు స్త్రీలకు కామము విశేష మనుట తెల్లము.

"కామ మష్టగుణాం ప్రోక్తం"

అని పురుషులకంటె స్త్రీలకెనిమిదిరెట్లు కామ మధికమని శాస్త్రము తెలుపుచున్నది. దీని సత్యాసత్యము లరయుదము. స్త్రీపురుషు లిరువురు కామకార్యమున ప్రవర్తించుచుందురు. సుఖమందలి హెచ్చుతగ్గుల విమర్శించుటకంటె దానివలన కల్గిన ఫలములనుబట్టి కామాధికు లెవ్వరో తర్కింతము. కామసుఖ మనుభవించినపిమ్మట స్త్రీపురుషు లిరువురు తమ పనులలో నుందురు. స్త్రీ తాననుభవించిన సుఖఫలముచే తనివిజెందక ఆ కర్మఫలమును తన గర్భమున జేర్చి దానికొక రూపమును నిర్మించి తొమ్మిదినెలలు రక్షించి ఆ విగ్రహమును కనులార జూడగోరి నానాకష్టముల కోర్చి భూమిపై దింపి ఆ శిశువును పోషించుచు ముద్దులిడుచు తన కామఫలమునుగూర్చి యానందించుచుండును. మఱియు బిడ్డలకు వ్యాధి సంభవించినపుడు తానారోగ్యవతియైయున్నను-కఠిన పథ్యము

లొనర్చును. ఈ పాట్లన్నియు పడుటకు కారణము కామ మెక్కువగ నుండుటవల్ల నేకదా!

స్త్రీల కున్నంత కామము పురుషులకున్నచో వీరును గర్భములు ధరించి యెన్నియో యిడుమలు పడియుండెదరు.

ఈ యనుభవమునుబట్టి స్త్రీలకు కామ మెక్కువని స్పష్టమగుచున్నది. దీనివలన స్త్రీపురుషుల వివాహ వయస్సునకు సంబంధమేమియని నీ వడుగవచ్చును. స్త్రీలతో పాటు పురుషులకు బాల్యముననే వివాహ మొనర్చినయెడల స్త్రీలకు త్వరలో కామప్రవృత్తి యేర్పడుటయు, ఆ సమయ మున పురుషునకు కామము లేకుండుటయు తటస్థించును. ఇక వారికోర్కె సఫలము కానేరదు. ఉభయులకు కామ ప్రవృత్తి కల్గినపిదప పెండ్లిచేయరాదా! యని ప్రశ్న కలుగ వచ్చును. అదికూడదు. ఎందుకన ! 12 వత్సరములకే రజస్వల యైన స్త్రీ తనకు 16-18 యేండ్లు వచ్చువఱకు తగిన వరునికై నిరీక్షించి యే 25 యేండ్ల పురుషునో పెండ్లిచేసికొనవలెను. ఈ లోపల కామసుఖముకై త పిం చి రహస్యముగ పురుషు లెందఱినో కూడును. బాల్యముననే వివాహమై యున్నయెడల కామాతిశయము గల్గినను అదివరకే సమ కూర్పబడియున్న భర్తను పొందవచ్చును. వారు పరిశుద్ధ శరీరులై సత్సంతతిని కనగలరు. లేనిచో వివాహమునకు ముందే సవామేహాదిరోగముల నార్జింతురు. పిమ్మట వారు పెండ్లిచేసికొన్న ప్రయోజనమేమి? ఆ భర్తకును వాని వలన గల్గిన సంతతికిని పై వ్యాధులు సంక్రమించును.

అందువలన బాల్యవివాహములు స్త్రీలకేగాని పురుషులకు కూడవు.

అనార్యుడు:—

యుక్తవయస్సు వచ్చిన స్త్రీలు పెండ్లాడినయెడల నది వివాహమే కాదనియు మఱియు పశుధర్మమనియు జెప్పితిరి. ఇంతకుపూర్వము క్షత్రియులలో యువతులు పెండ్లాడ వచ్చునని వచించితిరి. అవియెట్లు వివాహములనబడును ?

ఆర్యుడు:—

ఓయీ ! స్త్రీలు రెండు తరగతులని యిదివఱకే చెప్పితిని. అది మఱచియుందువు. క్షత్రియ స్త్రీలకును-తదితర స్త్రీలకును సంబంధ మెంతమాత్రములేదు. పురుషులలో సామాన్యులకును, గుహాంతర్వర్తులగు యోగీశ్వరులకును యెటుల ధర్మభేదములుగలవో అటులనే బ్రాహ్మణ-వైశ్య-శూద్రాది స్త్రీలకును-అంతఃపురనివాసినులగు క్షత్రియ స్త్రీలకును-చాల తారతమ్యముగలదు. కావున వారికి యువతీ వివాహములు దుష్టములుకావు.

అనార్యుడు:—

క్షత్రియాంగనలు తప్ప తదితర స్త్రీలు యువతులైన పిమ్మట పెండ్లాడిరేని అది వివాహమే కాదని నుడువుట సాహసము కాదా?

ఆర్యుడు:—

మిత్రమా ! దానిని మ్యారేజి యందురేకాని వివాహ మనరు. వేదమత ప్రకారము హిందువులకు మ్యారేజిలేదు. వివాహధర్మముచే హైందవ స్త్రీపురుషులు కలియుదురు. తది

తరు లొక కంట్రాక్టులో జేరిన మ్యారేజిచే కూడుదురు. కాన దానిని వివాహమని హిందువు లంగీకరింపరు.

అనార్యుడు:—

ఆర్యమహాశయా! నే నాంగ్ల విద్య నభ్యసించినపుడు మ్యారేజియనగా వివాహమని చదివియుంటిని. మా మాస్టర్లు సైత మట్లే చెప్పిరి. ప్రపంచ వ్యవహారమంతయు నిటులనే యుండెను. డిక్షనరీ (నిఘంటువు)లో మ్యారేజి శబ్దమున కర్థము వివాహమని కలదు. ఇట్లు వ్యవహరించుట దోషమా? అయితే మ్యారేజియనుదాని యర్థమును సూచించుటకై సంస్కృత భాషలో నేశబ్దమును వాడుదురో తెలుపగలరా

ఆర్యుడు:—

ఓయీ! నీవడిగినది బాగుగనున్నది. ఒక్కొక భాష యొక్కొక దేశచరిత్రను తెలుపుట కేర్పడెను. భాషలోని శబ్దములచేతనే వారి సిద్ధాంతములను-ఆచారములను-సృష్టి కార్యములను తెలిసికొనవచ్చును. ఎటులనో వినుము.

తురకభాషలో మనుష్యుడు "ఆద్మి" అను పదముచే పిలువబడును. సంస్కృతభాషలో నతడు మనుష్యుడని పేర్కొన బడును. కాళ్లు చేతులు మొదలగు నవయవములు కలిగిన జీవుడే ఆ దేశమందు ఆద్మియనియు-ఈదేశమున మనుజు డనియు, పిలువబడును. రూప మొకటేయైనను దానికి పెట్టబడినపేర్లు ఒకే సిద్ధాంతముపై నాధారపడలేదు.

ఎట్లన! ఆదాము అను పురుషు డొకదేశములో మొదట జన్మించెను. అతని సంతతికి ఆదామువలన పుట్టిన వారని యర్థమిచ్చు శబ్ద మాదేశస్థులు నిర్ణయించుకొనిరి.

ఆదాముయొక్క బిడ్డలు అద్మియనబడిరి. అద్మి యనగా ఆదాము సంతతియని యర్థము. ఆ శబ్దమునకు నిఘంటువులలో మనుజుడనుపదము వ్రాయబడెను.

ఈ మనుజశబ్దమొక హిందుదేశములో వ్యవహరింపబడుచున్నది. ఇట్లుండుటకు కారణమేమన! నవవిధ బ్రహ్మలు కలరు. అందు మనుబ్రహ్మకు జనించుటంజేసి హిందువులు మనుజులని పేర్కొనబడిరి.

ఆదాము సంతతి అద్మి యనియు

మనువు సంతతి మనుజు డనియు

ఇటుల నాయా దేశస్థులయొక్క మూలపురుషులనుండి కల్గిన రూపములకు భిన్న నామములు కల్గెను. అద్మి-మనుజుడు-ఒకటేయైనయెడల ఆ దా ము సంతతివారమని హిందువులు చెప్పుకొనవలసివచ్చును. తాము మనుబ్రహ్మ సంతతి యని తురకలును-క్రైస్తవులును పలుకవలసియుందురు. వీరెవ్వరును తమ సిద్ధాంతముల విడువజాలరు. అయినను విధిలేక అద్మి శబ్దమునకు మనుజుడని యర్థమును, మనుజశబ్దమునకు అద్మియను నర్థమును పరస్పరము వాడుకొనుచున్నారు.

కావున నొక భాషలోనున్న శబ్దమందలి వాస్తవార్థమును మఱియొక భాష తన శబ్దములచే వచింపజాలదు.

సంస్కృతభాషలో ధర్మశబ్ద మొకటిగలదు. ఈ శబ్దమున కెన్నియో యర్థములుండును. వేదమందు జెప్పబడిన సిద్ధాంతమునకును-పుణ్యమునకును-సత్కర్మమునకును - వస్తుస్వభావమునకును-ఒకజాతియొక్క వృత్తికిని - ఒక యుద్యోగి

యొక్క పనికిని - ప్రపంచస్థితికిని ఇట్లెన్నియో భావముల సూచించుటయందు వాడబడుచున్నది.

ఈ ధర్మశబ్దమును ఇంగ్లీషులో డ్యూటీ యను పదముచే వాడుదురు. నిజముగ ధర్మ శబ్దమందలి సర్వ రహస్యములు డ్యూటీయను పదముచే వెల్లడింపబడవు.

అయినను గతిలేక ధర్మమును డ్యూటీయని పిలుచుచున్నారు. అట్లే వివాహశబ్దమునకు మ్యారేజియను పదమును తప్పనిసరిగ వాడవలసివచ్చెను. ఇంతియేకాని వివాహమనగా మ్యారేజికాదు.

అనార్యుడు:—

మహాత్మా! కామసుఖముకై స్త్రీపురుషులొక గృహమునజేరి జీవయాత్ర గడుపుచుందురు. అందుకై యేర్పరచుకొనిన యొడంబడికకే మ్యారేజియని పేరు. హిందువులలో సైతమిట్లుండదా యేమి?

ఆర్యుడు:—

మిత్రమా! అట్లెన్నటికినికాదు. హిందువుల పెండ్లిండ్లు కామనివారణమునకు మాత్రమే యేర్పడినవికావు. "ప్రజాయై గృహమేధినాం" యన్నట్లు సత్సంతతినిమిత్తమేర్పడినవి. ఇతర దేశస్థులందీనియమములేదు. హిందువులలో: స్త్రీపురుషులిరువురు ఈ జన్మమందేగాక రాబోవు జన్మములందును భార్యాభర్తలగుటకై వివాహమందెన్నియో విధులాచరింతురు. మ్యారేజియందీవిధులులేవు. హిందూస్త్రీలు కేవలము పతివ్రతాధర్మమను వ్రతమొక్కటే పూనియుందురు. అంతకు మించిన వేరొక పుణ్యమార్గము వారికి

లేదు. పతి మరణించినను అతడు పరలోకమున సజీవుడై యున్నటుల భావించి ధ్యానించుచు పునర్జన్మమం దతనినే వరింతురు. ఇదియే పతివ్రతాధర్మ మనబడును.

మఱియు పతి మృతిజెంద నతనిచితియందు జేరి మరణించువారు కలరు. అటుల సాధ్యముకానిచో వైధవ్యమును పాటించుచు ప్రపంచభోగముల విడనాడి పతిధ్యాన నిమగ్నలై జీవింతురు. హైందవ స్త్రీల పాతివ్రత్యధర్మ మిట్లుండెను. ఇట్టి ధర్మమును స్థాపించుటకై యేర్పడినవిధానమే వివాహమనబడును. ఈ పద్ధతులు మ్యారేజియం దుండెనని తెలుపుటకు సాహసించువారు లేరు. అట్టియెడ వివాహ శబ్దమునకు మ్యారేజి అను పదము సరిపోవుననుట యెంత యవివేకమో యాలోచింపుము.

అనార్యుడు:—

మహాశయా! వివాహశబ్దమం దెంతయో మహిమ యుండుగాక. అది వాస్తవముకావచ్చును. యువతులు పతివ్రతాధర్మమును పాలించుటకై పెండ్లాడినయెడల దానిని వివాహమనుట కభ్యంతరమేమి?

ఆర్యుడు:—

ఓయీ! అటుల వీలులేదు. బాల్యమందున్న స్త్రీ వివాహ మాడినపుడే పై విధుల ననుసరించి భర్తను దైవముగ భావింపగలదు. అతడు బ్రతికియున్నపు డెటుల పరపురుషుల నపేక్షింపకుండెనో అటులనే మరణించినపుడును పూర్వ నియమముల నుల్లంఘింపక బ్రహ్మచర్య వ్రతమును రక్షించుకొనుటకు శక్తిగల్గియుండును. యువతులైనపిమ్మట

పెండ్లాడినస్త్రీలు పతివ్రతాధర్మములను పాటింపజాలరు. కాబట్టి యువతీయువకులు కలియుటలో వివాహధర్మము పొసగనేరదు.

అనార్యుడు:—

అయ్యా! బాల్యమున పెండ్లియైన స్త్రీ పతిసేవ చేయ గలదనియు సమర్తాడిన స్త్రీలు పెండ్లాడినయెడల పతివ్రతా ధర్మముల ననుసరింపజాలరనియు తెలుపుటలో న్యాయ మెంత మాత్రమును లేదు. ఈ వాక్యములు అహంభావ పూరిత ములు గావా?

ఆర్యుడు:—

ఓయీ! ఈ ప్రశ్న కిదివఱకే ప్రత్యుత్తరము చెప్పి తిని. దానిని మఱచి యిటుల నడిగితివి. పతివ్రతాధర్మమనగా భర్త చెప్పినటుల వినుటయేయని భ్రమించుచున్నావు. ఆస్త్రీలు గుణవతులని గణింపబడుదురు. అంతమాత్రమున వారు పతివ్రతలు కాజాలరు.

భర్త మరణించినను అతని సూక్ష్మరూపమును మనసు నందిడుకొని ధ్యానించుచు తాను మృతినొందినపిమ్మట నత డేలోకముననుండెనో నాలోకమునకేగి కొంతకాల మతనితో వసించి మరల భూలోకమునకు వచ్చినపుడు అతనినే పెండ్లాడు నట్టి స్త్రీ పతివ్రత యనబడును. ఇటుల ననేకజన్మములవరకు పతిని విడువజాలని స్త్రీయే పరిశుద్ధురాలని హిందూ సిద్ధాం తము. ఇంతియేకాదు. ప్రతి జన్మమందును భర్తను దీర్ఘాయు ష్మంతునిగ నొనర్చుకొనవలెను. హైందవ స్త్రీలు వైధవ్య మనుభవించుట గొప్ప నేరముగనుండును. ఆ దుర్దశ రాకుం

డుటకై తాము చనిపోవులోపల భర్త మరణింపకుండునటుల చూచుకొందురు. అందుకై వాక్శుద్ధియు-చిత్తశుద్ధియు నవసరములు. యౌవనము వచ్చినపిమ్మట నివి లభించుట దుర్లభము.

ఎందుకనగా! ఆయీడున కామలోలత మెండుగనుండును. సంసారబాధ లతిశయించును. చిత్తశుద్ధి సన్నగిల్లును. అందువలన భర్తను బ్రతికించుకొనునట్టి యభ్యాసమునకు బలము కలుగదు.

“బాలకుల దీవెనలు బ్రహ్మదీవెనలు”

అను న్యాయమనుసరించి బాల్యవివాహ మొనర్చుకొనిన స్త్రీలు పరిశుద్ధహృదయులై “ఉదయకుంకుమనోము” మొదలగువానిచే పతియొక్క యాయువును పెంచుకొనగలరు.

ఈ పద్ధతి యువతీ వివాహములలో సున్న. ఆ కారణమున యువతీ వివాహములు-వివాహములే కావు. ఆ యువతులు పాతివ్రత్యమును నిలువబెట్టుకొనజాలరు.

అనార్యుడు:—

అయ్యా! బాల్యవివాహములవలన భర్తలను బ్రతికించుపద్ధతి యేర్పడునని సెలవిచ్చితిరి. ఇదివిచిత్రము. ఆయువును పెంచుట సామాన్యమా? ఎంతమనోబలము కావలెనో! అది పసిపిల్లలకు కలదా? శాస్త్రములైనను తెలియవే? లోకజ్ఞానమా-శూన్యము. తుదకు విద్యయైనను రాదు. అట్టి బాలికలాచరించువిధులు వారిభర్తలను దీర్ఘాయుష్మంతులనుగ జేయగలవా? వారివాక్యములు ఫలింపవలెనన్న నెంతయో వాక్శుద్ధి యుండవలెనే. అది బాల్యమందే లభించు టెట్లు?

ఆర్యుడు:—

నాయనా! ఈవిషయము తెలియుటకై లోకానుభవమెక్కువగ నుండవలెను. బాలురుగాని బాలికలుగాని దైవసములని హిందూ సాంప్రదాయమునసీవు వినియుందువు. వారికి పాపమే లేదు. వయస్సు ముదిరినకొలది దుర్బుద్ధులు-కుతంత్రములు-బయలు దేఱి మనస్సును దోషభూయిష్ఠముగ జేయుచుండును. అంతవరకు వారుపరిశుద్ధులని యెరుంగుము. కనుక నే-లాటరీ-వేయునపుడు న్యాయరక్షణముకై చీట్లను బాలబాలికలచే నెత్తించుచున్నాము. మనసునందొక కోర్కెపెట్టుకొని యదిఫలించునో లేదో తెలియదలచి బాలబాలికలజేసి-పండా-పచ్చియా-యని యడుగుచుందుము.

ఒకపుడు రెండువ్రేళ్లనుజూపి మీయిష్టమువచ్చిన వ్రేలుపట్టుకొనుమని పిల్లలనడిగి ఫలాఫలముల గుర్తించుచుంటిమి. దీనిభావమేమి? వారిహృదయములు నిష్కళంకములనిగదా? ఇందుకు మఱియొకయనుభవమును గమనింతము.

మెస్మరిజం-హిప్నాటిజం - మొదలగు యోగవిద్యల నభ్యసించినపెద్దలు వానిని ప్రదర్శింపదలచి సాధ్యమగునంత వఱకు బాలబాలికలనే స్వీకరింపుదురు. దీనికి కారణమేమో తెలియునా? వారిమనస్సు ప్రపంచవిషయమున తగుల్కొనలేదు. అందుచే నామనస్సు అపూర్వవిషముల గ్రహించి ప్రత్యుత్తర మొసంగుచుండును. కొందఱు మంత్రవేత్తలు యథార్థమును గ్రహింపగోరిరేని బాలురహస్తములకే యంజనము వేయుచుందురు.

గొప్పతపస్సంపన్నునకెంత మనశ్శుద్ధికలదో బాలురకట్టి శక్తిగలదు. "బాలవాక్యములు రిత్తవోవునా" యనుసూక్తి భాషాప్రపంచమునందుండెను. కావున స్త్రీలకు బాల్యదశయందే వివాహమొనర్చి యతనియాయుష్యమును వృద్ధిజేయు విధులను నియమించవలెను. అటులొనర్చినయెడల నదిఫలవంతము కాకపోదు.

బొట్టుపెట్టుకొనుట–సొమ్ములు ధరించుకొనుట–పువ్వులు ముడుచుకొనుట–తాళిబొట్టును భద్రముగజూచుకొనుట మొదలగు పనులన్నియు నీభర్తయొక్క యాయుష్యమును వృద్ధిజేయునని నేర్పుదుమేని యాబాలిక మాటిమాటికి నటులనే యూహించుచుండును.

తపోవంతులగు మునీశ్వరులు వాక్శుద్ధిగలవారగుటచే "దీర్ఘాయుష్మాన్ భవ" అని యాశీర్వదించిన మాత్రమున మనకు నాయుర్వృద్ధియగుటలేదా? అటులనే వాక్శుద్ధిగల బాలిక

"దీర్ఘాయురస్తుమేపతిః" (వివాహమంత్రము) తన భర్త దీర్ఘాయుష్మంతుడగుగాక, అని ప్రతికార్యమున తలచుచున్నయెడల నదికొంతకాలమునకు ఘనీభవించి తపోరూపమునుజెంది ఫలవంతమగును. కావుననే పెండ్లియైనది మొదలు తల్లిదండ్రులు తమబిడ్డలచే నెన్నియోనోములు పట్టించుచుందురు. ఆవ్రతములందలి సారాంశమెద్దియో యెఱుగుదువా?

(1) "ఉదయకుంకుమనోము" అని యొకవ్రతముగలదు. పెండ్లియైనది మొదలు ఒక సంవత్సరమువఱకు ప్రతిదినము

ఉదయమున లేచి దంతధావనాది నిత్యకృత్యము లొనర్చుకొని కుంకుమను గైకొని ఒకముత్తైదువు కడ కేగి యామెకు బొట్టు పెట్టుచుండవలెను. సంవత్సరాంతమున ఉద్యాపనము జేసికొనవలెను. కుంకుమను దానము జేయుటవలన నాబిడ్డకు కుంకుమ లోపింపకుండునని సారాంశమైయున్నది. జీవితాంతమువఱకు బెట్టుకొనునట్టిదశ సంభవించుననుటయే యీనోముయొక్క ఫలము. ఇది పతియొక్క దీర్ఘాయుష్యమునకు కారణమగుటలేదా ?

(2) "చిట్టిబొట్టునోము" అని మఱియొకవ్రతముగలదు. ఆబిడ్డ - ఒక వత్సరమో లేక నైదు వత్సరములో - ప్రతి దినము ప్రాంతఃకాలమున లేచి శుచియై గంధము-అక్షతలు-తీసికొని 5 గురు ముత్తైదువులకు బొట్టుపెట్టుచు వ్రతము పూర్తిగావింపవలెను. గంధము-అక్షతలు దానమొనర్చుటచే తాను బహుకాలము గంధాక్షతలను ధరించునట్టి స్థితినిపొందగల్గును. భర్త జీవించియున్నగాని యీదశ తటస్థింపదు. కావున నీవ్రతముసైతము భర్తకాయువును బ్రసాదింపుచున్నది.

(3) "అలంకారపునోము" అని యింకొకవ్రతము గలదు. ప్రతినిత్యము సాయంకాలమొకస్త్రీని గంధపుష్పాదులచే నలంకరించుచు నొకవత్సరము వ్రతముగావింపవలెను. పుష్పదానమొనర్చుటచే జీవితాంతమువఱకు తలలోపువ్వులు పెట్టుకొనునట్టి సౌమాంగల్యసిద్ధి కల్గుటకిదిసాధనము. భర్త బ్రతికియున్నపుడే స్త్రీలుపువ్వులు పెట్టుకొనవలయునని శాస్త్ర నియమముగలదు.

(4) "శ్రావణ మంగళవారపునోము" ఇది పెండ్లియై నదిమొదలు ప్రతిశ్రావణమాసమున నైదువత్సరములు జరుపవలెను. ఈవ్రతమందలికథలో చనిపోయినభర్త బ్రతికెనని కలదు. ఈవ్రతముకూడ భర్తయాయుష్యముకొఱకే యేర్పడినటుల స్పష్టమగుచున్నది.

(5) "సావిత్రీగౌరీవ్రతము." ఇది తొమ్మిదేండ్లు ఆచరింపవలెను. ఎట్లు సావిత్రీదేవి వైధవ్యమును పొందక పతివ్రతామహిమచే భర్తను చిరంజీవునిగజేసికొనెనో అటులే బాలికలు తమభర్తను బ్రతికించుకొనుటకై యీవ్రతమును సల్పుచుందురు.

(6) "మూగగౌరీవ్రతము" కార్తికమాసమున రాత్రి నక్షత్రము లుదయించినవెంటనే మౌనవ్రతముధరించి పెదవులుమూసికొని 5 నక్షత్రములలెక్కించి 5 గురుముత్తైదువులకు బొట్టుపెట్టవలెను. రెండవవత్సరమున అదేనెలలో 10 నక్షత్రములను లెక్కించి పదుగురు ముత్తైదువులకును- మూడవయేట 15 నక్షత్రములగణించి15గురుస్త్రీలకును బొట్టుపెట్టవలెను. ఇట్లు ముత్తైదువుల పూజించుటవలన నామెకయిదవతనము వృద్ధియగును.

(7) "మాఖగౌరీవ్రతము" 6 వత్సరములు ప్రతిమాఘమాసమున గౌరీదేవిని పూజించుచుండవలెను. ఎందుకన! భర్తను సంపాదించుటలోగాని-అతనిని చిరంజీవునిగ జేసికొనుట యందుగాని-ఎన్నిజన్మములెత్తినను ఆభర్తనే పెండ్లాడుట యందుగాని గౌరీదేవికంటె శ్రేష్ఠురాలెచ్చటను లేదు. కావున నీమెను పూజించుటవలన స్త్రీలకు పైలాభములన్నియు

గల్గుచుండును. రుక్మిణీదేవిసైతము కృష్ణుడేతనకు భర్తగావలె నని నిశ్చయించి గౌరీదేవిని పూజించినట్లు వినియున్నాము.

వివాహములలోసైతము పుట్టింటివారు తమకన్యలకు అంకు రారోపణానంతరము గౌరీపూజచేయింతురు. పతిని దీర్ఘాయుష్మంతునిగ జేయుటలో గౌరీవ్రతము మహాత్మ్యపుష్టమైనది.

మిత్రమా! భారతీయనారీమణుల దివ్యచారిత్రముల వినియుంటివిగదా! వారిపవిత్రభావములు గ్రహింపగల్గినయె డల హిందూధర్మముల నెదిరించుటకెన్నడును బూనుకొనవు. పతియొక్క దీర్ఘాయుష్యపద్ధతులను బాల్యమునుండి యభ్యసించు టంబట్టి యౌవనానంతరముసైతము వానిననుసరించుటకు యువతులు సమర్థలైయుందురు. బాల్యమందలి మనోబలము యౌవనమందలి మనస్సునకుతోడ్పడి-పతిని దీర్ఘాయుష్మంతు నిగ జేయగలదనుట నిస్సంశయము.

అనార్యుడు:—

మహాత్మా! ఈనోములచేతనే భర్తలు బహుకాలము జీవింపగలరని విశ్వసింతుమేని ఇటులనోచినవారి భర్తలెందఱో మరణించుటయు జూచుచున్నాము-అందుకు హేతువేమి?

ఆర్యుడు:—

రెండుమూడు కారణము గలసినగాని యొక కార్యము ఫలింపదని యిదివఱకే తెలిపియుంటిని. ఒకడు ధనవంతుడు కాదలచి నెలకు నూరు రూప్యముల సంపాదించుచుండెను. అతని భార్య అందు కొంతధనమును యింటికై వ్యయపఱచి మిగిలినది మూలధనముగ నుండునటుల యవకాశమొసంగెనేని యతడు ధనవంతుడు కాగలడు. అటుగాక నూటికి నూఱు

ఖర్చు పెట్టుచున్న యెడల నెంత రాబడియున్నను ప్రయోజనము గలదా ? ధనవంతుడగుటకు సంపాదన మొక కారణముగ నుండవచ్చును. కాని యాహేతు వొక్కటే చాలదు. మితముగ ఖర్చు పెట్టుటయును నొక కారణముగూడ ధనవంతుడగుట కొక సాధనమైయున్నది. అట్లే స్త్రీలు-పురుషుని యాయుర్వృద్ధికై యెంత యత్నించినను అందుకు విరుద్ధముగ పురుషుడు ప్రవర్తించెనేని స్త్రీలకు వైధవ్యము రాకపోదు.

పురుషు డాయుష్మంతుడగుటకై ప్రయత్నించుచుండగ నతని భార్య ఆయుర్విహీనకార్యము లొనర్చెనేని యామె వితంతువు కాకుండునా ?

ఒకవేళ పురుషు డాయుర్విహీనకార్యము లొనర్చుచున్నను స్త్రీ తన మనోబలముచే నతని యాయుష్మంతునిగ జేయదలచెనేని విశేషపరిశ్రమ మొనర్పవలసియుండును. అటు లొనర్చుట నందఱకు సాధ్యమా ? స్త్రీ పురుషు లిరువురు ఆయుర్వృద్ధికై పాటుబడుచుందురేని యింటింట వితంతువులు గోచరింపరు.

అనార్యుడు:—

అయ్యో! ఈ పతివ్రతాధర్మము స్త్రీల పాలిట ఘోరముగ కన్పట్టుచున్నది. ఇంత భారము స్త్రీలపై మోపుట ధర్మముగ లేదు. అది కల్పితమని నాకు తోచుచున్నది. వివాహకర్మలో నంత భారముండుటకు హేతువేమి ?

ఆర్యుడు:—

మిత్రమా ! ఇతర ప్రమాణములెందుకు? వివాహమను శబ్దమే ప్రబలప్రమాణము. ఆ శబ్దార్థమును వినుము.

"విశేషేణ ఉహ్యాతే ఇతివివాహః"

విశేషముగ వహింపబడునది గావున వివాహమనబడుచున్నది. వి-అను అక్షరముచే విశేషమనియు వాహః అను పదముచే మోయునదనియు వివాహశబ్దము గొప్ప బరువును నెత్తిపై బెట్టుచున్నటుల తెలుపుచున్నది. జీవుడు శుద్ధుడగుటకై యాచరించు కర్మలన్నియు పదునారుకలవు. వానినే షోడశ కర్మలందురు. అందు వివాహము కొలికిపూస. చంద్రుడులేని రాత్రివలె-సూర్యుడులేని పగలువలె-ప్రాణములేని దేహము వలె-వివాహములేని కర్మకాండ నిరర్థకము.

సన్యసించినవారికిని-యెప్పటికిని పెండ్లాడనివారికినితప్ప తదితరు లెల్లరకు వివాహము ప్రాణతుల్యము. వివాహధర్మము ననుసరించి స్త్రీపురుషులు కలసిననాడు నిజమైన మనుజుడు జన్మించును. అతడే వేదధర్మ మనుష్ఠించుట కర్హుడు. వాని మూలమున దేశముద్ధరింపబడును. ఈ వివాహముతోపాటు మిగిలిన కర్మలనుగూడ తెలిసికొనుము.

1. గర్భాధానము
2. సీమంతము
3. పుంసవనము
4. జాతకర్మ
5. నామకరణం
6. అన్నప్రాశనం
7. చౌలం
8. గోదానం
9. ఉపనయనం
10. ప్రాజాపత్యవ్రతం

11. సౌమ్యవ్రతం 14. స్నాతకము
12. ఆగ్నేయవ్రతం 15. వివాహము
13. వైశ్వదేవ వ్రతము 16. అపరకర్మ

ఇవియే షోడశకర్మ లనబడును. జీవుడు పురుషునిగుండా స్త్రీ యందు ప్రవేశించుటకై యేర్పడిన కర్మకు గర్భాధానమని పేరు. కర్మలందెల్ల నిది మొదటిది. గర్భమందున్న తొమ్మిది నెలలలో సీమంత పుంసవనములచే నతడు సంస్కరింపబడును. పుట్టిన వెంటనే చేయబడునది జాతకర్మము. పిమ్మట నామ కరణము జరుగును. ఇటుల 15 కర్మలు పూర్తికాగా నత డొకనాడు మరణించును. అపుడు చేయునది అపరకర్మ మన బడును. ఈ 16 కర్మలలో వివాహము 15 వ దై యున్నది. ఇదియే సర్వోత్తమమైనదనియు నెక్కువ భారముతో కూడిన దనియు నెఱుగుము.

పరమపవిత్రమై-ఆరోగ్యప్రదమై-దీర్ఘాయుష్య హేతువై దేశసౌభాగ్య మూలమై - ఆత్మోద్ధారకమై - స్వర్గ హర్మ్య సోపానమై యొప్పు నీ వివాహకలాపమును కనిపెట్టినవారు భారతీయులొక్కరే.

అట్టి భారతదేశమున జన్మించినవారి భాగ్యమే భాగ్యము. అయితే ఏ కర్మలో లేని భారము వివాహమందే యుండుటకు కారణ మెద్దియో తెలిసికొందము. దేశముల జయించి రాజ్య మాక్రమింపవచ్చును. సింహముతో పోరాడ నగును. ఏనుగును బొమ్మపై నెక్కించుకొనవచ్చును. విద్య నార్జింపవచ్చును. కాని సహజమైయుండు ప్రకృతికి

విరుద్ధముగ నడచువాఁడుండఁడు. అన్నిటికంటె నిది యొక్కఁటే మిక్కిలి భారము. ప్రకృతు లన్నిటిలో కామము బలమైనది. ఈ కామమే ప్రపంచరంగమున నాట్యమాడి సర్వజీవుల నాకర్షించుచున్నది. దాని నెవరును వశపఱచుకొనజాలరు. ఆహారాదులు వర్జించినవారు సైతము కామమును జయింప లేక తహతహలాడుచున్నారు. సహజముగ నున్న కామము వేగముగ ప్రవహించుచుండ దాని నెదుర్కొనునట్లు చేయుట కంటె గొప్ప భారము లేదు. అందు ముఖ్యముగ పురుషులకన్న స్త్రీలకు కామప్రవాహ మతివేగముగ నడచుచుండునని యిదివరకే గ్రహించియుంటిమి. కావున వీలైనంత వరకు దానిని తగ్గించుటకు చేయు సాధనమే బాల్యవివాహ మనబడును. అది యెట్లన? స్త్రీలకు కామోత్పత్తి యగుటకు పూర్వమే అనగా బాల్యముననే పెండ్లిచేసి భర్తను దైవముగ భావించునటుల బోధింపవలెను.

మఱియు నతని జూచినపుడు సిగ్గుతో నుండునటుల నేర్పవలెను. భయభక్తులతో వర్తించునటుల హెచ్చరింపవలెను. బాల్యమున నేయే వస్తువులం దేయే భావము లుదయించునో అవి జీవితాంతమువరకు విడువజాలవని ప్రకృతి రహస్య మొకటిగలదు.

కాన స్త్రీకి బాల్యమున వివాహమొనర్చి పతిని దైవముగ భావించునట్లు జేసినయెడల జన్మాంతమువఱకది తొలగ నేరదు. ఇందొక విశేషము కలదు. చిన్నతనమగుటచే పతి

☞ ఈ షష్ఠశకర్మ ప్రతుల దేశాన్యస్మృతుల ముఖ్యభాగములో రాబోవు గ్రంథములలో తెలుపబడును.

యందు కామబుద్ధిలేదు. భయభక్తులును దైవభావమును సహజమైయుండును.

ఈ సుగుణరాశి బాల్యమునుండి పతియందుండుటచే యౌవనమందు సైత మా భావములే తాండవించును. అంతియేగాని కామభావము మితిమించుటకు వీలులేదు. ఒకవేళ కామ మతిశయించినను అది ధర్మబద్ధమై సత్సంతాన హేతువగును. అట్టి సమయమున సైతము కామము కళ్లెము పెట్టబడిన గుఱ్ఱమువలె స్వేచ్ఛగ ప్రవర్తింపజాలక న్యాయ మార్గమున చరించును. ఇటుల కామవేగము నణచి జాగ్రతగ నడిపించుట స్వభావవిరుద్ధమగును. ఇంతకంటె మహత్తరమగు భారము వేరొండుకలదా? స్త్రీల పాలిటి కిదే గొప్ప తపస్సు.

కావుననే హైందవ స్త్రీలకు పాతివ్రత్యముకంటె వేరొండు తపములేదని శాస్త్రములు వక్కాణింపుచున్నవి. యువతీ వివాహము లొనర్చినయెడల పైవిధముగ నీతిబద్ధ లగుట దుర్లభము. పశువులందువలె స్వేచ్ఛాప్రవర్తనము ప్రారంభమగును. దాని నడ్డగించునట్టిభారము వారికి కలుగ నేరదు. ఎపుడుభారములేదో అపుడది వివాహమనబడదు. వివాహసంస్కారము లేనిచో నది మతసంబంధము కాజాలదు. అందువలన యుక్తవయస్సుగల స్త్రీలకు మతసంబంధమగు వివాహములులేవని స్పష్టమగుచున్నది.

అనార్యుడు:—

వివాహము మతసంబంధమే కానిండు. వేదమంత్రముల

మూలముననే-పెండ్లాడదలచిన స్త్రీ తనకుతగిన భర్తను వరిం చుటకై యత్నింపకూడదా ?

ఆర్యుడు:—

మిత్రమా ! స్త్రీ-తగిన వానిని వరింపవలెనన్న ఆమెకు యౌవనదశ రావలసియున్నది. సమర్తాడుటయే ఆదశవచ్చు టకు సూచన. అట్టిస్త్రీకి యువతియనిపేరు. ప్రతియువతి సమ ర్తాడియుండెనని మఱువకుము. శాస్త్రములలో నామెను పుష్పవతియందురు. పుష్పించుటచే పుష్పవతి యనబడును. లోకమునవృక్షములు పుష్పింపగా చూచుచున్నాము. స్త్రీలు పుష్పింతురాయని సంశయము కలుగవచ్చును. ఎందు కైచెట్లుపుష్పించుచున్నవో అందుకే స్త్రీలు పుష్పించు చున్నారు. వృక్షములు పుష్పించుటకు హేతువు కాయలు కాచుటకేగదా ?

అట్లే స్త్రీలు సమర్తాడుటకూడ సంతానరూప ఫల ములను పండించుటకేయని తెలిసికొనుము. ఎపుడుస్త్రీలు కూడ చెట్లవలె పంటనుపండించుచున్నారో-అపుడు వానివలె పుష్పించుటయు నవసరమే. అటులపుష్పించుటే సమర్తాడుట యని యెఱుగుము. సమర్తాడినగాని బిడ్డలగనజాలరు. మన యిండ్లలో బిడ్డయీడేరినపుడు సమర్తాడినదనియు-పెద్దపిల్ల యైనదనియు, పుష్పవతియైనదనియు జెప్పుచుందుము. శాస్త్ర సాంప్రదాయ మెఱింగినవారిలో తమబిడ్డ పుష్పవతియయ్యె నని జెప్పుట నేటికినివాడుకలోనున్నది. పుష్పవతులైనస్త్రీలు అనగా యువతులు స్వయముగ నొకభర్తనువరించి యతని వలన సంతతిని గనవలెనన్నది ప్రకృతివిరుద్ధమగును.

వేమన-జగత్పాఠశాలలోని యుపదేశములు ఇందుకు భిన్నములుగనుండెను. అదియెటులనో వినుము. పుష్పించునట్టి దశ - వృక్షములందును - స్త్రీలయందును - గన్పట్టుచున్నది. వృక్షములందెన్నియో భేదములు గలవు. కొమ్మలున్నవి చెట్లనియు-లేనివి తీగెలనియు పిలువబడును. వేదభాషలో తీగెలకు లతలని పేరు. ఇవి యితరవృక్షములవలె స్వయముగ నెదుగజాలవు. పందిరినిగాని చెట్టునుగాని యాశ్రయించి పెరుగుచుండును.

లతలవలె స్త్రీలుకూడ స్వయముగ రాణింపక-పురుషులనో యాశ్రయించి బ్రదుకుచుందురు. కావున స్త్రీలు లతలతో పోల్చబడిరి. మరియు లతలవంటి దేహములుంటచే లతాంగులనబడిరి. ఈవిషయము సర్వులెఱింగినదే.

తీగెలస్వభావమెట్టిదో ప్రపంచపాఠశాలలో తెలిసికొనుము. పుట్టినది మొదలు కొద్దికాలమునకు అనగా, లేతగానున్నపుడే యొకచెట్టునాశ్రయించి పెరుగుచుండును. కొమ్మలెన్ని వంకలుపోవునో వానిననుసరించి యవినడుచుచు చెట్టుపైకెగబ్రాకినపిమ్మట పుష్పించును. లతాధర్మమిట్లున్నది. ఇకలతాంగులధర్మమెట్లుండవలెనో తెలిసికొందము. లతవలెలతాంగియు జన్మించిన స్వల్పకాలమునకు-అనగా బాల్యమందే యొకనినాశ్రయింపవలెను. ఎటులచెట్లపైననే లతలుపుష్పించునో అటులనే లతాంగియు భర్తయొక్క ఆధిపత్యమున పుష్పింపవలెనని తెలియుచున్నది.

పుష్పించినతీగె నొకచెట్టునకు కంటగట్టినయెడల దాని

కొమ్మల ననుసరించి వంకరగతిరుగుచు పెనవేసికొని పెరుగునా? లేదు. చెట్టుదారివేరు. తీగెదారివేరు.

"ఎవరికివారే యమునాతీరే" అన్నట్లుండును. అటులనే లతాంగియు పుష్పించినపిమ్మట యువతియై యొకపురుషుని పెండ్లాడినను-పరస్పరప్రేమ లంకురింపక నొకరినొకరు ద్వేషించుకొనివిడిపోయి వేరొకని పెండ్లాడుటకు యత్నించును.

ఎటుల లతలు పుష్పించుటకు పూర్వమే చెట్లనాశ్రయించుచున్నవో-అటులనే లతాంగులుసైతము సమర్తాడుటకు పూర్వమే పురుషులను పెండ్లాడవలెను. ఆపెండ్లియు స్వయంవర రూపముననుండరాదు. తల్లిదండ్రులచే నిర్ణయింపబడిన పురుషులనే-చేపట్టవలెను. ఎందుకన? లతలస్వభావమటులున్నది. పుష్పించుటకుముందు లతలు స్వయముగ నొకవృక్షము నాశ్రయించి పెరుగవు. భగవంతుడే యదివరకొకచెట్టును లతాసమీపమున నుంచును. లేదా! లతను పెంచదలచినవా డొకపందిరియైనను వేయును. అపుడు దాని నాశ్రయించి పెరుగును.

అట్లే లతాంగులుసైతము పుష్పించుటకు పూర్వము తల్లిదండ్రులవలనగాని లేక బంధువులమూలమునగాని నిర్ణయింపబడిన పురుషులనే వరించి పెండ్లాడవలసి యుందురు. ఇందుకు విరుద్ధముగ స్వయంవరమొంతమాత్రము తగదు.

అనాధ్యుడు:—

లతలకు ప్రాణమున్నను అవి నడువజాలవు. అందువలన వృక్షములవద్దకేగి వాని నాశ్రయించుటకు శక్తి లేదు. స్త్రీలు,

లతలతో పోల్చబడినను వానివలె కదలక మెదలకనుండరు. ఇచ్చవచ్చినటుల పోగలరు.

కావున వారు స్వయముగ పురుషుల వరించిన దోషమేమి ?

ఆర్యుడు:—

మిత్రమా ! సంశయముల దీర్చుకొని మనశ్శాంతిని బడయుటకై దృష్టాంతముల జూపుట మానవలక్షణము. ఒక పోలికను జెప్పునపు డేయంశమునుగుఱించి సిద్ధాంతము జేయ నెంతురో ఆ యంశముకొఱకే దృష్టాంతమును గైకొందురు. అటుగాక దృష్టాంతములోని సర్వవిషయములను నిరూపింప దలచినయెడల నే దృష్టాంతమైనను అన్నివిధముల సరిపోవునది లేదు.

ఉదాహరణముకై యీ క్రింది పోలికను జూడుము.

"ఓ జగత్పితా! మేము నీబిడ్డలము. మమ్ము కాపాడుము" అని ప్రార్థింపుచుందుము. ఎవ్వరము దేవుని చూచి యుండలేదు. అయినను తండ్రితో పోల్చితిమి. అట్లు పోల్చుటకు గారణమేమి ?

ఎటుల తండ్రి మనల బుట్టించెనో అటులనే దేవుడు సమస్త జగమును సృజించెను. ఏ దేవుడు తండ్రితో పోల్చబడెనో అతడొకనాడు మన తండ్రివలె జనించెనా ? లేదు. మన తండ్రికి తండ్రియుండెను. అట్లే జగత్పితయగు దేవునకు వేరొక తండ్రిగలడా ? లేదు. తండ్రి తండ్రిని అనగా తాతను వలె దేవునియొక్క తండ్రిని జూపుమని యెవరైన ప్రశ్నిం

చినచో ప్రత్యుత్తరము చెప్పగలమా? లేము. అందువలన తండ్రితో దేవుని పోల్చరాదని వచింపనగునా?

మన తండ్రులకు రోగములు-మరణములు-దుర్బుద్ధులు గల్గుచుండును. వారితో పోల్చబడిన దేవునకుగూడ పై రోగాదులుండునా? జగత్ప్రభో! యని దేవుని ప్రభువుతో పోల్చితిమేని ప్రభువుయొక్క గుణములన్నిటిని దేవునియందు జూపుమని పట్టుబట్టినయెడల నటుల గనపరచువారుగలరా? లేనిమాత్రమున దేవుని ప్రభువుతో పోల్చకుందుమా? కావున స్త్రీలను లతలతో పోల్చినపుడు అందు గ్రహింపదగి యంశ మెద్దియో యోచింపుము. పుష్పించుటకు ముందు లతలు చెట్ల నాశ్రయించినట్లె రజస్వల లగుటకు పూర్వము స్త్రీలు భర్తల నాశ్రయింపవలెను.

ఇచ్చట ఆశ్రయమునే దృష్టాంతముగ గైకొనవలెనని యెఱుంగుము. అంతియేగాని లతలు నడువజాలవనియు లతాంగులు నడతురనియు వీరిరువురికి పోలిక కూడదనియు తెలుపుట తెలివిగలవారికి తగదు.

స ం పూ ర్ణ ము.



# ఒక్క పేవాట.

ఉంటావా నీమతంలో సరిగా ఉండు.

లేదా! హిందూత్వాన్ని వదలుకో!

అయితే హిందూమతంలో అన్నీ సందేహాలంటావా? అదంతా వెనకటి ముచ్చట. ఇప్పుడో!

## "హిందూ మత గ్రంథమాల"

బయల్దేరింది. వరసబెట్టి సందేహాలు తీరుస్తున్నది.

1. దేవుడున్నాడా? ఉంటే నామరూపాలుంటయా? బ్రహ్మ తన కూతుర్ని, విష్ణువు తులసిని, శివుడు ఋషి భార్యల్ని, కృష్ణుడు గోపికల్ని, ఇంద్రుడు అహల్యను, చంద్రుడు తారను, పొందారు. రాముడు వాలిని చంపాడు. శంబుకుణ్ణి వధించాడు. వీరంతా పూజ్యులా? ఇందులో రహస్యమేమైనా ఉందా?

2. బ్రహ్మదేవుడి తొడలో నారదుడు, కండ్లలో అత్రి, వేలిలో దక్షుడు పుట్టారని వుంది. ఇది నమ్మడం ఎల్లాగ?.

ఇవేకాదు ఇంకా ఎన్నిరకాల ప్రశ్నలైనా సరే ఈ గ్రంథమాల నిమిషాలమీద ఎగరగొడుతుంది. దీని బలం ఏమిటో తెలుసునా!! వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, సైన్సు, యుక్తులు అనుభవాలు. ఇంకేంగావాలి?.

☞ వెంటనే సభ్యులుగాచేరి చదవండి!! నెలకొకబుక్కు బయలుదేరుతున్నది.

# హిందూ మత గ్రంథమాలా

## విరాళముల వివరములు

మహారాజాధిరాజపోషకులు రూ. 116-0-0 మొదలుకొని మనసోత్సాహముకొలది.

| | | |
|---|---|---|
| మహారాజపోషకులు | సం॥ ౧కి రు | 25-0-0 |
| రాజపోషకులు | ,, | 10-0-0 |
| పోషకులు | ,, | 5-0-0 |
| సహాయకులు | ,, | 3-0-0 |
| అభిమానులు | ,, | 2-0-0 |

## చందా వివరము

సంవత్సరం చందా

| | | | |
|---|---|---|---|
| పోస్టుతో సహా | ,, | 1-5-0 | (బ్రిటిష్) |
| ,, | ,, | 1-4-0 | (నైజాం) |

☞ బ్రిటిషులో బుక్కుపోస్టు చార్జి రు. 0-0-3 లు హెచ్చినందున 12 నెలలకుగాను రు. 0-3-0 లు పెంచడమైనది.

ఈ పుస్తకములు వలయువారు

మేనేజరు:——

# హిందూ మత గ్రంథమాల

శికిందాబాదు (దక్కన్)

అని వ్రాయవలెను.

---

☞ గ్రంథమాలా సభ్యులుగ నుండదలచినవారు తమ పేరు, పోస్టు, తాలూకా, జిల్లాను విడివిడి అక్షరములతో వ్రాయవలెను.

# రాబోవు గ్రంథములు

—:—

షట్ఛాస్త్రముల కధిపతివి కాదలంచితివా ?

గృహరాజ్యమును వశపరచుకొని

తక్కిన అయిదు రాజ్యముల నార్జింపుము.

అవి యెవ్వి ?

## దేహ రాజ్యము ౨ దేవ రాజ్యము

## ౩ దేశ రాజ్యము

## ౪ ధర్మ రాజ్యము ౫ మోక్ష రాజ్యము

ఈ రాజ్యము లన్నిటిని పరిపాలించు విధానమును

తేటతెల్లముగ దెలియజేయు

## హిందూ మత గ్రన్థమాలా

కుసుమముల సేకరింపుము.

హిందూ మత గ్రంథమాల

ఉపన్యాస చక్రవర్తి
ఉమామహేశ్వర పండిట్‌గారి ఉపన్యాససారము.

# Home Rule

# గృహరాజ్యము

5 వ భాగము.

విక్రమ సం॥ మాఘమాసము.

5 వ పుష్పము

వెల
0-1-6



— నమస్తే —

ఈ గ్రంథమాలలో
వెలువడు గ్రంథములపై సర్వాధికారములు
బ్రహ్మశ్రీ
ప్రభాకర ఉమామహేశ్వర పండితులవారివి.

హిందూమత గ్రంథమాల. 5 వ పుష్పము.

హిందూమత ప్రచారక, ఉపన్యాస చక్రవర్తి

బ్రహ్మశ్రీ ప్రభాకర ఉమామహేశ్వర పండితులవారి

ఉపన్యాససారము

# గృహారాజ్యము.

1.
2.
3.

## ( 5 వ భాగము )

మొదటి కూర్పు




విద్వాన్

కొండా శంకరయ్యగారి ప్రిమియర్ ముద్రాక్షరశాల,

సికిందరాబాద్.

 వెల 0-1-6

గ్రంథములు వలయువారు

మేనేజరు:—

హిందూమత గ్రంథమాల

సికిందరాబాద్-దక్కన్

అని వ్రాయవలెను.

# గృహారాజ్యము.

---

## 5 వ భాగము.

(39 వ ప్రశ్న)

అనార్యుడు:—

మహాశయా! మీ యుక్తులను ఖండించుట కర్తృ లెవ్వరును లేరు. నీటిపై బుట్టు బుడగలవలె నిమిషమున కొక సంశయము పుట్టుచున్నది. శ్రమయనక ప్రతి సంశయమును దీర్పుడు. ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డలకు పెండ్లిజేయుట విలాసముకొరకా? లేక వారిరువురుగలసి కాపురమొనర్చుటకా? సంసారముకొరకే యన్నచో చిన్నతనమున ప్రేమ భావము లంకురించునా? లేదే! ఇక పెండ్లియెందుకు?

పురుషులతో తమ కెట్టి పని యుండునో తెలియని బాల్యావస్థలో వారిని పెండ్లాడిన లాభమేమి?

లోకమున నొకపదార్థముతో తన కెట్టి యవసరము గల్గునో తెలియనపుడు దానికై యత్నించువారుండరు. కావున సమర్తాడినపిమ్మట పురుషునితో నవసరమేర్పడును. అపుడతని పెండ్లాడుట యుక్తము. దీనిపై మీయభిప్రాయమేమి?

ఆర్యుడు:—

నాయనా! ఏయవసరముకల్గిన నాపదార్థముల స్వీకరింపవలెనని యంటివి. అది యెంతవరకనుభవసిద్ధమో విమర్శింతము.

(1) ఒక యిల్లు దహనమగుచున్నది. అపుడు దానిని చల్లార్చునట్టి యవసరమేర్పడెను. అపుడుచేయదగిన పని యేమి? చల్లార్చుటయేకదా? అందుకై నీటియింజను కావలసియుండెను. ఆక్షణమున - ఏమదరాసుకో వెళ్లి దానిని తెప్పించుటకై యత్నింపనగునా? లేక యెప్పటికైన నిట్టి బాధకల్గునని గ్రహించి యిండ్లుకాలుటకు పూర్వమే దానిని సిద్ధపరచుకొనవలెనా?

(2) ఒకదేశముపై శత్రురాజులు దండెత్తివచ్చిరి. దానింజూచి యాదేశపురాజు సైనికులను - యుద్ధసామగ్రిని క్రొత్తగ తయారుచేయుటకు యత్నించునా? లేక యెప్పటికైనను యుద్ధము తటస్థించునని తెలిసి ముందుగనే వానిని సమకూర్చుకొనునా?

(3) ఒకని కాకలియైనది. దానిని తీర్చుటకు-అన్నమవసరము. వెంటనే యన్నముకై యత్నించిన ప్రయోజనమేమి? ఒకపుడుతనకు హితమైన యన్నములభింపవచ్చును. వేరొకపుడు దొరకకపోవచ్చును. అందుకై యాకలియగుటకు పూర్వమే తనకుదగిన యాహారపదార్థముల సేకరించి వానినే వండునట్లు నియమింపవలెను.

అటుగాక ఆకలియైనపుడు తానుకోరిన పదార్థమును పెట్టుమని యడుగుట యవివేకముకాదా?

(4) ఇరువది ముప్పదియేండ్లు వచ్చువరకు విద్యనార్జింపక విద్యావంతుల తెలివిని-గౌరవమును-జూచి విద్యావశ్యకమును గమనించి ఆ యీడులో ఓనమాలు ప్రారంభించు

వారుందురా? లేక విద్యవలన లాభమెట్టిదో యెఱుగని బాల్యమందే కష్టములకోర్చి విద్యాభ్యాసమొనర్తురా?

(5) ఆకలితీర్చునది అన్నమనిగాని - పాలనిగాని-పసి పిల్లలకు తెలియదు. అందువలన వారికేనాడు-భుజింపవలెనని తోచునో అపుడే వారికన్నము పెట్టవలెనా? లేక యేమియు తెలియని దశనుండియే ఆహారమొసంగు చుండవలెనా?

ఈ పైప్రశ్నలకు నీవేమి ప్రత్యుత్తరమొసంగగలవు. అవసరము కల్గిననాడే-ఆయాపనులు చక్కబెట్టుకొనుటకై సాధనముల సేకరింపవలెనని తలతువా? అట్లయినచో లోక జ్ఞాన శూన్యుడవయ్యెదవు?

ఏవస్తువుతో నీకెపుడవసరము కల్గునో ఆసమయమున దాని నార్జించుటకు బదులు-రాబోవుకాలమున ననుభవింప దగిన సామగ్రిని ముందుగసమకూర్చుకొనుట వివేకమో కాదో తెలిసికొనుము. పశువులకును మానవులకును భేదమిచటనే కలదు.

పశుస్వభావమునువినుము. ఏక్షణమున ఆకలియగునో అపుడే-గడ్డికై వెదకును. ఆకలియగుటకు పూర్వము గడ్డిని సంపాదించుకొని తనవశమున నుంచుకొనజాలదు. ఏనాడు కామోత్పత్తి కల్గునో అపుడుతనకు తగినపురుషపశువుకై యత్నించి దానితోకలసి సంతతినిబడయును. ఈపశుధర్మ మును మానవులలో వ్యాపింపజేయుట యోగ్యముగలేదు. కావున పసిపిల్లలకు భర్తతో-నవసరము కలుగకున్నను వారి కేనాడైన - నాదశవచ్చుననితలచి తల్లిదండ్రులు ముందుగ పతిని నిర్ణయించుట మేలు.

అనార్యుడు:—

అయ్యా! ఇల్లు కాలుచున్నట్టి యుపమానమును స్త్రీలకు సంబంధింపజేయుట యోగ్యముగలేదు. ఎందుకన? నిప్పంటుకొనగా ఇల్లు వెంటనేదగ్ధమగును. మఱునాడు గృహ స్వరూపమే గోచరింపదు. కావున ఇల్లు తగులబడుటకు పూర్వమే దానిరక్షణముకై యింజను సిద్ధముగ నుంచుకొన వలెను. స్త్రీవిషయమో అటులకాదు. సమర్తాడినపిమ్మట స్త్రీలహృదయమున కామాగ్నిరగుల్కొన్నను-వారు మరణింపరు. కావున ముందుగనే పతిని నిర్ణయించుకొన నవసరములేదు. కామాగ్ని పుట్టినపిమ్మట తగినవానికై వెదకుచు తుదకెప్పుడో యొకని వరింపవచ్చును. ఇక యువతులు పెండ్లాడిన నష్టమేమి?

ఆర్యుడు:—

ఓయీ! నీకు స్థూలదృష్టితప్ప-సూక్ష్మదృష్టిలేదు. మనుజుడు మనః ప్రధానుడని యెరుంగుము.

"In the world there is nothing great but man. In the man there is nothing great but mind."

అనగా లోకమున సర్వజీవులలో మానవుడధికుడు. అతనిలో మనస్సు శ్రేష్ఠమైనది.

అని పాశ్చాత్య పండితుడొకడు నుడివియున్నాడు. కావున మనోబలము మానవుని గొప్పతనమునకు మూలము. పశువులకు శరీరబలము ముఖ్యము. నరుడు మనోబలముచే పశువును వశమొనర్చుకొని ప్రభువగుచున్నాడు. మనస్సు

ఎంత శుద్ధముగనుండిన నంతబలముచేకూరును. మనస్సునకు చలనమేర్పడినకొలది బలహీనమగుచుండును. మనోబలము నశించినపిమ్మట మనుజుడు బ్రతికినను చచ్చినను ఒక్కటే.

బుద్ధిబలమును క్షీణింపజేయునుద్యమము శ్రేయస్కరముకాదు. మనస్సుచెడుటకు హేతువు లనేకములుకలవు. అన్నిటిలో స్త్రీలపై పురుషులకు-పురుషులపై స్త్రీలకుగల కామేచ్ఛబలమైనది. దానిని అగ్నితోపోల్చుటకు సయితము వివేకులు వెనదీయరు. కావుననే దానిని కామాగ్నియందురు. అది మానసికదేహమును తగలబెట్టును. ఈకామము జ్ఞానయుక్తమైనయెడల పాపరాశిని భస్మమొనర్చును. ఎటుజూచినను కామాగ్నిగాని జ్ఞానాగ్నికాని వరుసగా మంచిచెడ్డల నాశనమొనర్చుటలో నతీతప్రజ్ఞ కల్గియున్నవి.

(1) కామాగ్ని యుదయించెనేని సద్భావముసత్సాంగత్యము-సదాచారము - సత్ప్రవర్తనము-మున్నగు గుణము లన్నియు సున్నయగును.

(2) జ్ఞానాగ్ని విజృంభించెనేని దుస్సంకల్పములు దురాచారములు - దుస్సాంగత్యములు - దుష్ప్రసంగములు - దగ్ధమగును. సమర్తాడినపిమ్మట బయలుదేఱిన కామాగ్నివలన స్థూలదేహము దగ్ధమైనట్లు గోచరించదు. కాని మనోమయమగు సూక్ష్మదేహము బ్రుగ్గి మనశ్శుద్ధికి భంగమై-దుర్నీతికి మార్గమై-దుష్టసంతానమునకు గుఱియై నరకకూపమున బడజేయును. కావున సమర్తాడుటకుపూర్వమే పతిని నియమించవలెను. లేదేని తగినపురుషులు లభించువఱకు యువతులు కామలోలతచే నెందఱను కూడుదురో-ఎన్ని గర్భస్రావముల

జేసెదరో ఎంతయక్రమ సంతతినికందురో - యువతీవివాహ ములు వ్యాపించియున్న దేశములబరికించిన తెలియనగును. ఆకామాగ్ని యంతకంటె తీగులబెట్టవలసినది లేదు. "పశువులకు తింటేబలము-మనుష్యునకు ఉంటేబలము" అను సామెత కలదు. సమర్తాడినస్త్రీకి కామాగ్నికల్గినను అదివఱకే తన కొక భర్తనియమింపబడి యుండెనేని తానెంతదూరమందున్నను అతనిని తలచుకొనుచు "ఉంటే బలమనుసామెతను" సార్థకమొనర్చుకొని తృప్తి జెంది దుర్నీతికి పాల్పడదు.

బాల్యవివాహములవలన నిట్టిమహత్తర ప్రయోజనము గల్గుచున్నది. పెండ్లికాకపూర్వమే సమర్తాడినయెడల కామాగ్ని ప్రజ్వరిల్లి "హాడా-వీడా" యని పరితప్తయై పురుష సంబంధమును కోరుచుండును. పరిపరివిధముల రుచిచూచి తుదకెవనినో మోహించును. ఇది దుష్టమని వేఱుగజెప్పవలయునా? కావున బాల్యవివాహములే శ్రేయస్కరములు. దివ్యచారిత్రులగు భారతీయులు ఇందలిరహస్యమును గమనించియే పరమపవిత్రమగు బాల్యవివాహ సిద్ధాంతమును నెలకొల్పిరి.

అనార్యుడు:—

అయ్యా సమర్తాడుటకు పూర్వమొక బిడ్డ విధవయైనదనుకొనుడు. అంతసమర్తాడెను. వెంటనే కామాగ్ని యుదయించును. పైసామెత ననుసరించి అత్తవారింటిలో భర్త యుండెనని నమ్మకమున్నయెడల నెటులనో యింద్రియ నిగ్రహమునుబొంది తృప్తిజెందగలదు. పతిమరణించినందున కామ

తృప్తికి మార్గముండదు. మరల పెండ్లాడవలెనని తేలుచున్నది. దీనికి ప్రత్యుత్తర మేమిచెప్పెదరు ?

ఆర్యుడు:—

విధవరాలైనపిమ్మట సమర్తాడినను కామాగ్ని పుట్టు ననుటసత్యము. అందుకై పురుషసంబంధమవసరము. కాని ఆమెకు కామోత్పత్తి కలుగుటకు వీలులేదు. ఎందుకన ? వైధవ్యము సంభవించినది మొదలు ఉప్పు-కారము-పులుపు తినరాదు. మంచములు-పఱుపులు-మున్నగునవి యుపయోగింపక చాపపైపరుండవలెను. సుగంధపుష్పాదుల నలంకరించుకొనరాదు. విశేషముగ పురుషులున్నచోట తిరుగరాదు. ఏకాంతముగ వసించుచుండవలెను. ఇట్టి నియమము లెన్నియోకలవు.

వీనిననుసరించి వర్తించు వితంతువులు సమర్తాడిరేని వారికి కామముగల్గినను అదిమితిమించక నిమిత్తమాత్రముగ నుండును. అందువలన కామోద్రేకము బాధింపజాలదు. అట్టి బాధలేనపుడు ధర్మమునతిక్రమించి మఱియొకని పెండ్లాడవలెననిగాని వ్యభిచరింపవలెననిగాని బుద్ధిపుట్టదు. కావున విధవలకు పునర్వివాహములతో బనిలేదు.

అనార్యుడు:—

అయ్యా ! ఎంతయో పుణ్యమునగాని మానవజన్మ లభింపదు. పశుపక్ష్యాదుల శరీరములకంటె మానవదేహము విశేష సుఖమనుభవించుట కేర్పడెను. అట్టి సుఖమనుభంగ

---

☞ విధవలను ఆహారనియమములచే బాధించుటకంటె వారికి మరల పెండ్లిసేయరాదా ? యను ప్రశ్నపై రాబోవు గ్రంథములు చూడుడు.

మొనర్చు మతనియమములు మానవజాతికి మృత్యుస్వరూప ములుకావా ?

ఏనాడు మతశృంఖలములనుండి నరుడు విడివడునో యాదినమే సుదినము. స్త్రీలు బహిరంగముగ చరింపరాద నియు-వినయ విధేయతలుగల్గి వర్తింపవలెననియు - వితంతు వులు మరల పెండ్లాడకూడదనియు - ఎంత చలికాలమైనను వేకువనుమేల్కాంచి నదీతీరమునకేగి వడగండ్లవలెనున్న చన్నీళ్ల మునుగవలెననియు - భర్తవలన కామసుఖము తీర నపుడు పరపురుషుల బొందరాదనియు - అటులనే భార్య తనకు తగినటుల లేనపుడు పరస్త్రీల ముట్టరాదనియు - నీవిధ మగు మతధర్మములు మనుష్యసుఖముల కాటంకములు గావా ? సర్వసుఖాస్పదంబగు మానవశరీరమును మతరూప మగు జైలునందుంచి దుఃఖములకు గురిజేయు టెందుకు ?

ఆర్యుడు:—

మిత్రమా ! నీవుచెప్పినదానిలో కొంతనిజమున్నది కాని మానవదేహము కేవలము ప్రపంచసుఖముకై పుట్టెనని తలపకుము. ఇంద్రియములకు స్వాతంత్ర్యమిచ్చుచో ఆరో గ్యము చెడుటయేగాక ఆయుష్యముకూడ కుంగి నీవను కొనిన సుఖము లభింపదు.

మానవునకు పశువునకునుగల భేదమువినుము.

మనుజునకువలె పశువునకును జ్ఞానేంద్రియము లైదు గలవు. ఏజీవియైనను ఇంద్రియములచేతనే సుఖమనుభవిం చును. అయితే ఒకరకమైన పశువునకేదోయొక యింద్రి యము విశేషసుఖమొసంగుటకు సాధనముగనున్నది.

శ్రోత్రేంద్రియము (చెవి) చే లేడికి విశేషసుఖము బ్బును. త్వగింద్రియము (చర్మ) చే ఏనుగునకు సుఖముకల్గును. నేత్రేంద్రియము (కన్ను) చే మిడుత విశేష సుఖమనుభవించును. ఘ్రాణేంద్రియము (ముక్కు) చే తుమ్మెద సువాసనను బీల్చి యానందించును. జిహ్వేంద్రియము (నాలుక) తో చేప సౌఖ్యమును పొందును. ఇటుల నొక్కొక యింద్రియము సుఖసాధనమై తుదకాజంతువులను! కష్టముల పాలొనర్చుచున్నది. అది యెటులనో వినుము.

(1) సంగీతధ్వని వినుటలో లేళ్ల చెవులు నిక్కరపొడుచుకొనును. అందుకై మనుజులు పాటలబాడుచుందురు. అంత ధ్వనివశమున తన్మయములై యున్న జింకలను పట్టుకొందురు. అడవులలో స్వేచ్ఛగ విహరించు లేళ్లకుకల్గిన కష్టములకు కారణమేమి? శ్రోత్రేంద్రియ సుఖాపేక్షయే కదా?

(2) ఎటులనో - ఒక యేనుగును స్వాధీనమొనర్చుకొనిన మనుజుడు అనేకమత్తగజముల వశమొనర్చుకొనదలచి యొక యుపాయము పన్నును.

అది యెద్దియన! తనయేనుగునకు తాను జెప్పిన విషయముల నర్థము జేసికొనునట్టి యభ్యాసమొనర్చును. అంత గొన్ని విషయముల బోధించి యడవికిబంపును. అదియచ్చట నేనుగులకడ కేగినపుడు-అవి చర్మసుఖమపేక్షించి యాయేనుగును రుద్దుకొనును. ఒకయేనుగు మఱియొక యేనుగుతో

---

☞ విధవాస్త్రీలనియమము లెవ్వియో శాస్త్రప్రమాణముల జూపుచు రాబోవు గ్రంథములలో వివరింపబడును.

రుద్దుకొన్నపుడున్న సుఖముకంటె మహత్తరసుఖమాజాతిలో వేరొండులేదు. ఆసమయమున నీయేనుగు అడవియేనుగులను గొలుసులతో బంధించును. వెంటనే దానియజమాను డాయేనుగుల వశమొనర్చుకొనును. త్వగింద్రియ సుఖముచే నేనుగున కెట్టి గతిపట్టెనో యూహింపుము.

(3) మిడుతలకు నిప్పునుజూచినపుడు మహానందము కల్గుచుండును. ఆసుఖము జెప్పనలవికాదు.

కావున నిప్పుకనపడెనేని దానియొద్దకు జేరును. వెంటనే యావేడిమికి తాళజాలక మ్రగ్గును. ఈదుర్గతికి కారణము నేత్రేంద్రియ సుఖముకాదా?

(4) తుమ్మెదలకు సువాసనయందు విశేషప్రేమ గలదు. అందుకై యెచ్చట పుష్పములుండునో అచ్చటకేగి అందలి సుగంధమాఘ్రాణింప బూనును. ఒకపుడొక కమలముపైననో-లేక నాగమల్లెలోనో చేరి యందలి వాసనను బీల్చుచుండును. ఇంతలో రాత్రికాగా నాపుష్పములు ముడుచుకొనును. అంత నాతుమ్మెద లేచిపోవ యత్నించినను దారి దొరకదు. జైలునందువలె తెల్లవార్లు నానాబాధలనుభవించును. ఈకష్టములకు గారణము ఘ్రాణేంద్రియ సుఖముకాదా!

(5) చేపలకు జిహ్వాచాపల్య మధికము. అందుకై యెచట తిండిదొరకునోయని బహువేగమున తిరుగుచుండును. అట్టితరి ఒకడొక గాలమును వేయును. అందలి యెరనుజూచి యది తనయాకలిని దీర్చునట్టి యాహారపదార్థమని భ్రమించి దానిని మ్రింగును. వెంటనే యినుపములుకు గుచ్చుకొని

యటుయిటు కదలజాలదు. అంత చేపలవాడు దానిని పట్టుకొ
నగా తుదకు మరణమే శరణ్యమగును.

చూచితివా ? జిహ్వేంద్రియసుఖమువల్ల గల్గిననష్టము.
జీవుడు ప్రపంచమందలి సుఖముల ననుభవించుటకై పుట్టె
ననుటలో నెంతస్వారస్యమున్నదో పైకథలవల్ల తెలిసికొనుము.
ఇక మానవులకో-ఒకే యింద్రియముకాదు. ఐదింద్రియములు
ముఖ్యములే. ఒక యింద్రియముచే నెక్కువసుఖము- వేరొక
యిందియముచే తక్కువసుఖము - ఇట్లుండుట మానవ
జాతిలో లేదు.

క్రొత్తరకపు సినీమావచ్చినదనిన - నిద్రాభంగమై
యారోగ్యము చెడునను భీతిలేక - నేత్రేంద్రియము నొప్ప
గింతురు.

సంగీతధ్వని వినబడెనేని యెన్నియో పనులవిడచి
చెవులనర్పింతురు. వీధిలో మేళతాళములు వచ్చెనేని జప
మొనర్చువారుసైతము వెళ్లిచూచెదరు.

క్రొత్తరకపు భోజనపదార్థములు లభించెనేని రుచిగా
నున్నవనియెంచి విడువజాలక మితిమీరితిందురు.

ఒకనాడు రుచి తెలిసెనేని-దానినే తినవలెనని యావేశ
మొందుదురు. తినితిని తుదకు రోగములపాలగుదురు.

ఇంతియేకాదు. వీనినన్నిటినిమించిన కామేంద్రియ
మొకటికలదు. అదిరాజాధిరాజువలెనున్నది. పశ్వాదిజీవులకీ
కామసుఖమున్నను - అవి ఋతుపరికారము - ఏడాదికొక
సారియో - రెండుసారులో-అనుభవించును. మానవుడన్ననో
కామదాసుడయ్యెను. నీతి నియమములులేక - ఋతుకాల

మును గమనింపక - పగలు-రాత్రియనక - ప్రతిదినము భోజనమునువలె కామసుఖ మనుభవింపుచున్నాడు. పశువులు ఒక్కొక యింద్రియముచేతనే వివిధకష్టముల ననుభవింపుచుండ నరులు పంచేంద్రియ సుఖప్రధానులై పొందు దుర్గతికి మేరకలదా ? ఇంతటితోచాలదు. కామేంద్రియసుఖము వీరి పుట్టిల్లు. అందుచే రోగములేగాక మనోదౌర్బల్యము మొదలగు దుర్గుణములలవడును. నూరువత్సరములు బ్రిదుకవలసిన పురుషులు 50 యేండ్లకే మరణింతురు. సుఖహేతువులగు నింద్రియములకు స్వేచ్ఛయొసంగితిమేని భోగస్త్రీవలె క్షణికసుఖమునుజూపి క్రిమముగ మానవజాతిని నామమాత్రావశిష్టముగజేయును.

లోకానుభవమును బట్టిచూడ కోర్కెలతగ్గించుకొను వారికే సుఖము కల్గుచున్నటుల స్పష్టమగుచున్నది. సుఖము పెంచినకొలది దుఃఖమే ప్రాప్తించును. ఎంతసుఖ మతిశయించిన నంత దుఃఖమునకు మూలము. ఒకమారు జగచ్చరిత్రి గమనింపుము. ఇంగ్లాండు-ఫ్రాంసు-మున్నగు పాశ్చాత్య దేశములు సుఖముకొరకే జన్మించితిమని తలచినవి. అందుకై మతధర్మముల మంటగల్పి స్వేచ్ఛగవిహరించినవి. ఆభోగముల జూచి భారతీయులునయితము స్వీయధర్మములమఱచి భ్రష్టులగుటకు మొదలిడిరి.

మనుజుడు విషయభోగముల ననుభవించుటకే జన్మించుట సత్యమేని-పాశ్చాత్యుల భోగదశ బహుకాలము నిల్చియుండెడిది. ఒకశతాబ్దమైనను గడచినదో లేదో ఆదేశములు

స్మశాన భూములగుచున్నవి. దీనింబట్టి విషయభోగములు వినాశ హేతువులని తెలియుటలేదా ?

నేడు భూనభోంతరాళముల దద్దరిల్లజేయు ప్రపంచ యుద్ధము బయలుదేఱుటకు మితిమీఱిన యింద్రియ సుఖ వాంఛయేకదా హేతువు.

సారాంశమును వినుము. సుఖాతిశయము నభివృద్ధి జేయు నింద్రియములు మానవునియం దుండుటచేతనే యతి డధోగతిని జెందుచున్నాడు. ఇందుకు విరుగుడులేనిచో జాతి శాశ్వతముగ జీవింపజాలదు. కావుననే దయామయుండగు నీశ్వరుడు దుఃఖసాగరమునుండి తేల్చుటకై యొక గొప్ప సాధనమును బ్రసాదించెను. అదియే జ్ఞానమనబడును. "జ్ఞానేనహీనః పశుభిస్సమానః" యన్నట్లు జ్ఞానసాధనమును గైకొనక కేవలమింద్రియ సుఖభోక్తలమై సంచరింతుమేని పశుతుల్యులము కాగలము. జ్ఞానరత్నమునకు ముఖ్యస్థానము మతమని యెరుంగుము. మతముపోయెనేని జ్ఞానమునశించినట్లే. జ్ఞానమంతరించినచో నిక మానవత్వమెక్కడ ?

మతము స్వేచ్ఛకు భంగమొనర్చుచున్నదని కొంద అనుచున్నారు. అది మతిలేనిమాట. మతిలేనపుడు మతముం డదు. మతములేకున్న గతిలేదు. గతిలేనివానిదుర్గతికి చింతించి యతని నుద్ధరించుటకై బుద్ధిమంతు లాలోచింపుచుండవలెను. స్వాతంత్ర్యమును భంగమొనర్చునది మతమెక్కడేగాదు. మతహీనులకుసైతము స్వేచ్ఛావిహారము గన్పట్టదు.

(1) ఏలనన ! మతము నెగరగొట్టితి మనుకొనుము. ఇక మనుజునకు కావలసినదేమి ! సుఖముకదా ! అది లభిం

చుకొట్లు ? స్వరాజ్యమువల్ల గల్గునని కొందఱందురు. ఆయా దేశస్థులు తమజాతికి తగినటుల శాసనములగావించి పరిపాలించు నెడల సుఖము కలుగవచ్చును. అట్టి స్వరాజ్యముండు గాక. వారు సర్వసౌఖ్య మనుభవించుచుండిరా ? ఎన్నటికిని లేదు.

ఎందుకన-ఒక దేశమున స్వరాజ్యముండినను అందు గొన్ని శాసనములుండక తప్పదు. అవియెందుకు ? దేశసౌఖ్యమున కేకదా. శాసనప్రకారము నడువనివారికి శిక్షలుండవా ? ఉండును. స్వరాజ్యముండినను స్వేచ్ఛావిహారమునకు భంగమో కాదో తెలిసికొనుము.

(2) రాజ్యవిషయ మటుండనిమ్ము. ఆరోగ్య మెల్లరకు ముఖ్యము. నూటికి తొంబదితొమ్మిదిమంది అనారోగ్యముగ నుండుటకు హేతువేమి ? ఏయేయింద్రియము లేయే విషయముల గోరుచున్నవో వాని నాయాయింద్రియములకు సమర్పించునట్టి యభ్యాస ముండుటచేతనే రోగములేర్పడుచున్నవి. రోగబాధలనుండి తప్పించుకొనుటకై మానవులు వైద్యశాస్త్రమును శరణుజొచ్చుచున్నారు. అందలి శాసనములు వినుము.

"ఓయీ ! నీయిష్టమువచ్చినట్లు తినకుము. ఎయ్యది విశేషరుచిని కల్గించునో దాని నధికముగవాడకుము. కాల నియమమును బాటించి ప్రతికార్యమును సకాలమందొనర్పుము. శరీరతత్త్వమనుసరించి యాహారపదార్థముల నిర్ణయించుకొనుము. స్త్రీసంగమాదులు సైతము హద్దుమీరి చేయకుము.

అని యెన్ని యోవిధముల మానవుల స్వేచ్ఛావిహార మును బంధించుచున్నవి. ఇక మానవునకు స్వతంత్రమెక్కడ ?

(3) మానవజాతికి విద్యయవసరమని యెల్లరంగీక రింతురు. విద్యాగంధము లేనివారికి సౌఖ్యముండ నేరదని వారి సిద్ధాంతము. అందుకై చిన్నతనమునుండి నిర్బంధముగ బాలు రను పాఠశాలలకు బంపుచుందురు. విద్య పూర్తియగువరకు విద్యార్థులకు స్వేచ్ఛకలదా ? ఎంతమాత్రము లేదు. కనుక స్వేచ్ఛాప్రవర్తనకు భంగముగల్గించునట్టి విద్యను బాలురందు వ్యాపింపజేయుట దోషముకాదా ?

(4) ఎచ్చటజూచినను నౌకర్లు తమయజమానుల శాస నములకులోబడి స్వేచ్ఛాహీనులై సంచరించుచున్నారు.

సుఖము-సుఖము - అని కలవరింతురేగాని - తాము కోరినవన్నియు ననుభవించువారు లేరు. దేహాభిమానరహి తుడై రాజకీయ సంబంధదూరుడై ఇల్లువాకిలిలేక సంచరించు యోగిపుంగవు డొకడుండిన నుండుగాక. తదితరులెవ్వరంసుఖుల నుండజాలరు.

ఎనుబదిలక్షల జాతిభేదములుగల పశుపక్ష్యాది జీవ రాసులు కొంతవఱకు స్వాతంత్ర్య మనుభవింపగలవు. ఎందు కన ! వానికి పైయధికారులుండరు. రాజకీయముగగాని వైద్యరూపమునగాని-మతనియమములచేగాని శిక్షించువారు లేరు. దాంపత్యసౌఖ్య మనుభవింపవలెనన్న నిర్బంధము లుండవు.

తల్లి - తనపుత్రునితో - తండ్రితనబిడ్డతో- సంచరించి సుఖించుట కభ్యన్తరము లేదు. ఇట్టి స్వాతంత్ర్యమును పశ్వా

దులందుమాత్రమే చూడగలము. అధికారుల శాసనములు వైద్యనియమములు-యజమానుని యాజ్ఞలు-ఉపాధ్యాయుల నిర్బంధములు-మున్నగు వానివలన మనుజులు స్వేచ్ఛారహితులై - సంపూర్ణ సుఖదూరులై - బానిసలవలె వర్తింపుచు మతదాస్యమునుండి మాత్రము - విముక్తులగుటకై యత్నింప బూనుట యెంత వెఱ్ఱి.

మతమనునది నిన్న మొన్న వచ్చినదా ? సృష్ట్యాది నుండి నేటివరకు ప్రతిదేశమును రక్షించునదెవరు ? మతము కాదా ? నేడు ప్రపంచమందన్ని ఖండములలో పాలించు చున్న క్రైస్తవరాజ్యమునకు బునాదియేది ? వివిధదేశములలో స్థాపింపబడిన తురకరాజ్యమునకు ప్రాణప్రదానమొనర్చినదెవరు. మతము—మతము—అ ని వి శ్వ సిం పు ము. రాజ్యస్థాపనమొనర్చి పరిపాలించుమతము ప్రకృతివిరుద్ధమే యైనచో * 195 కోట్ల వత్సరములనుండి జీవింపగలదా ? రాజ్యములు - సంఘములు - దేశములు - తారుమారగు చున్నను - మతముమాఱెనా ?

ఒకానొకసమయమున మతముయొక్క బాహ్యచిహ్నములు మాఱుచున్నను - అందలి మూలసూత్రములు సర్వవ్యాపకములై - ప్రాణవంతములై ప్రపంచమును ఆనందాబ్ధి యందోలలాడించు చుండలేదా ! చంద్రుడులేని నక్షత్రములు సూర్యుడులేని గ్రహరాశి - ప్రభువులేనిరాజ్యము - అధికారి

☞ * హిందుమతము 195 కోట్ల వత్సరములనుండి కలదని రాబోవు గ్రంథములలో జూడగలరు.

లేని ఆఫీసు-గురువులేని బడి-ప్రాణములేని దేహము ఎటుల నిరర్థకములో అటులనే మతములేని మానవసంఘము నిష్ప్రయోజనము.

కట్టుబాటులేని జీవయాత్ర తాత్కాలికముగ సుఖప్రదమని తోచినను అద్యాది పరిణామకాలమున వినాశహేతువని యెఱుంగుము. కావున మతముపై దాడి వెడలకుము.

ప్రతి యుద్యమమున కొన్ని కష్టములున్నవి. అటులనే మతమందును నిర్బంధములు కలవు. అందువలన స్వాతంత్ర్యము కొంత తగ్గుగాక. అయినను మతనియమమును పూర్తిగ పాటింతురేని యా మహనీయులు ప్రపంచమందెవ్వరును పొందజాలని శాశ్వతానందమును-సంపూర్ణ స్వాతంత్ర్యమును-చిరంజీవిత్వమును-సర్వజ్ఞత్వమును బడయుగలరు. మతమందుగల మహిమ ఇదియేసుమా? మతముయొక్క చివరమెట్టును జేరినవారెవరో వారు నేటికిని వేలకొలది వత్సరములు జీవించియున్నారు. ఏ ప్రభుశాసనమునకుగాని బానిసలై యుండలేదు. ఆహారాదులకై విచిత్ర కృత్రిమ ప్రయత్న ప్రవాహ నిమగ్నులగుటలేదు. హిమాలయాది పర్వత గుహలలో నట్టి మహనీయులను కనులార గాంచవచ్చును.

సంపూర్ణ స్వాతంత్ర్యము - చిరంజీవిత్వము - శాశ్వత సుఖానుభవము - నిరోగత్వము ఇవియే మానవుని ముఖ్యాశయములు. వానిని పూర్తిజేసికొనినగాని యతనికి తృప్తి కలుగదు. నిజముగ సుఖమనిన నదియేగదా?. వైద్యముచేతనో

రాజ్యముచేతనో - సాంఘిక నియమములవల్లనో పై సుఖములు లభింపగలవని సాహసించు ధీరు డొక్కడైనగలడా? ముమ్మాటికి లేడు. కోరినవి ఫలింపనిచో నిక జన్మమెందుకు? వానిని పూర్తి జేయగల యుద్యమ మెద్దియో తెలిసికొనుటకై పరితపింపవలదా? అదియే మతోద్యమము. నిజముగ వివేకులైనవారు సర్వసంశయముల విడనాడి మతధర్మముల దెలిసికొని యటుల నాచరించుచు మతప్రచార మొనర్చుటయే జన్మించినందుకు ఫలము.

అనార్యుడు:—

అయ్యా! శాస్త్రనియమముల ననుసరించి వితంతువులు చరించునెడల కామము మితిమించదనుట సత్యమే. కాని ఇక్కాలమున నటుల నడచుచుండిరా?

ఆర్యుడు:—

మిత్రమా! అటుల నడచువారు కొందఱైనను లేకపోలేదు. తదితరులు స్వేచ్ఛగ వర్తించుచున్న మాట నిజము. అంతమాత్రమున లోకోపకార మొనర్చు శాస్త్రమును ధిక్కరించి నూతన పద్ధతుల నెలకొల్పుట దీర్ఘదర్శులకు తగదు. అనాచారము ప్రబలినదని తలచు సంఘసంస్కారులు శాసనమూలమున తమకు తోచిన దురాచారముల నెటుల మాపుమాప యత్నించుచుండిరో అటులనే శాస్త్రప్రకారము నడవనట్టి ప్రజల శిక్షించుటకై యేల శాసనముల జేయరాదు. వితంతువులు, స్వధర్మమును పాటింపనట్లు తెలిసినయెడల దేశోద్ధారకులగు మహాసీయు లద్దాని గ్రహించి వితంతు శరణాలయముల స్థాపించి వారిని దుష్ప్రవర్తనకు లోను గాకుండ

నటుల జేయవలెను. అటుగాక శాస్త్రవిధికౌ్ఛర మొనర్చి పునర్వివాహ శాసనముల గావింపదగునా? వెంటనే శాసనోల్లంఘనమునకు త్రోవ యేర్పడదా? ఇవియేనా? పెద్దలొనర్పదగిన పనులు వినుము. వినుము.

ఒకనికి వివాహమయ్యెను, గర్భాధానము కాకుండెను. ఎందుకన-నతని భార్య సమర్తాడలేదు. ఇట్లుండ నతనికి ప్రతిదినము స్వప్నమున వీర్యనష్టమగుచుండెను. అందువలన బుద్ధి మాంద్యమేర్పడెను. సోమరితన మధికమయ్యెను. ఏ కార్యమందైనను ఉత్సాహము లేకుండెను. వైద్యుల నడుగగా సరియైన మందు లేదనియు భార్య సంసారమునకు వచ్చినయెడల రోగమంతయు నశించుననియు తెల్పిరి. అంతవరకు గతియేమని మరల ప్రశ్నించెను. భార్య వచ్చువఱకు ఎవరినో యొక స్త్రీని చూచుకొనుమని ప్రత్యుత్తర మిచ్చిరి. అతడట్లొనర్చి రోగమును పోగొట్టుకొనెను. వైద్యులిచ్చిన సలహావల్ల నతని కష్టము తొలగెననుట సత్యము. కావున పరోపకార మొనర్చెనని తలచి యా వైద్యుల శ్లాఘింతుమా! అటుల నెన్నటికి నంగీకరింపము.

ఎందుకన! ఒక కష్టమును తొలగించుటే మానవ ధర్మముకాదు. ఆ పద్ధతి న్యాయముగను-నీతివంతముగను-ధర్మబద్ధముగ నుండవలెను. ఒకని కుపకారముజరిగినను అది పరుల కపకారముగ నున్నయెడల దాని నాచరించుటకు వివేకులంగీకరింపరు. సర్వశ్రేయస్కరమై యొప్పునదే నిజమైన ధర్మము. వీర్యనష్టముగల పురుషుడు పరస్త్రీని జెఱచినగాని యతడారోగ్యమును పొందడయ్యె. అతనికా పద్ధతి క్షేమకర

మైనను వ్యభిచార మొనర్చుట గొప్ప నేరమగుచున్నది. కావున నౌకరికి మేలొనగూర్చు పను లైనను శాస్త్ర దూషితములగు నేని వానిని బుద్ధిమంతులు మెచ్చరు. విధవా స్త్రీలకు పునర్వివాహము కూడదని శాస్త్రనిషేధ మున్నందున వారికి మేలుసేయుటకై తిరిగి పెండ్లి సేయుడని బోధించుపద్ధతి వైద్యునిసలహావలె నీతిలేనిదగుచున్నది. ఆవైద్యుడు వైద్యశాస్త్రమున పూర్ణప్రజ్ఞ లేనివాడగుటచే వ్యభిచరింపుమని బోధించెను. సంఘసంస్కారులకు సైతము లోకజ్ఞానము సంపూర్ణముగ లేనందున విధవావివాహము లొనర్పవలెనని బోధింపుచున్నారు. స్వప్నమునందు వీర్యనష్టమును పొందుపురుషులను వ్యభిచరింపుడని చెప్పుటకంటె వేరొండుమార్గము లేదా? సంపూర్ణ వైద్యశాస్త్రవేత్త లిట్లు చెప్పుదురా?

సాధ్యమగునంతవఱకు దివ్యౌషధముల నొసంగుచు దానికితోడుగ దంపుడుబియ్యముచే నన్నమును వండించుకొనుమనియు — అదియును కుండతోడనే వండవలెననియు, స్నానపానాదులకు ప్రవాహోదకమే ఉపయోగింపవలెననియు స్వల్పముగ ఉప్పు — కారము — పులుపు మున్నగు వానిని వాడుచు పూర్తిగ నూనె — ఆవ — వర్జింపవలెననియు నిరంతరము సత్సాంగత్యమే చేయుమనియు బోధింతురు.

అదేరోగమునకు యోగిపుంగవుడెట్టుల సలహానొసంగునో వినుము.

ముప్పదిరెండుమూళ్ల గుడ్డపేలికను క్రమముగ మ్రింగి కడుపునకదల్చి తిరిగి దానిని పైకిలాగివేయుము ఇట్లు నిత్య

మభ్యసించినయెడల సర్వదోషములు హరించి మనశ్చాంచల్యమునశించి స్ఖలనజాడ్యమునుండి విముక్తుడవగుదువు” అని బోధించును.

ఇట్టి న్యాయమైనపద్ధతులెన్నియో యులరాచుచుండ వానిని లెక్కింపక వ్యభిచరింపుమని బోధించుటెట్టి యవివేకమో అటులనే వితంతువులను సక్రమమార్గమందుంచజాలక వారికి మరలపెండ్లిసేయుమనుట ధర్మదూరము.

అనార్యుడు:—

సమర్థాడినపిమ్మట స్త్రీలకు కామాగ్ని పొడసూపుననియు – ఆలోపల పెండ్లాడనియెడల కామనివారణముకై వ్యభిచరించుననియు–అందువలన దుస్సంతతి గల్గుటయు దేహములు రోగములపాలగుటయు సంభవించునని సెలవిచ్చితిరి. అందుగొంత సత్యముండవచ్చును. కాని బాల్యమునుండి స్త్రీలకు గురుకులములనిర్మించి వారిని విద్యావతులుగ నొనర్చినయెడల పైదుష్కార్యములొనర్పరు. ఇక దోషమేమి ?

ఆర్యుడు:—

ఓయీ కామాంధత అనుమాట నీవువినియుందువు. “Love is blind” కామము గ్రుడ్డిది. అని యాంగ్లభాషలో సైతమొక సామెతగలదు. దీనిభావమేమి ? కామము గల్గినపుడు స్త్రీగాని – పురుషుడుగాని – జ్ఞాననేత్రమును పోగొట్టుగొని అజ్ఞానాంధకారమునమునుగుచున్నాడని యర్థము. సాధారణముగ నెటిజ్ఞానమైనను కామమునకు లొంగవలసినదే ! ఎట్లన ఆకలములదినుచు అరణ్యములో తపమొనర్చు విశ్వామిత్రాది మహామునులుసైతము కామదాసులైరి.

ఇట్లుండ చిన్నతనమునుండి నెయ్యి-పాలు-పెఱుగు మున్నగు వాని నిష్టమువచ్చినటుల మెక్కుచుండు యువతులు కామాగ్నిజ్వాలలకు తాళగలరా ? విద్యవచ్చిన మాత్రమున కామమును జయింపగలరనుట స్వభావవిరుద్ధము. తెలియనివారికి తెలుపవచ్చునుగాని తెలిసితెలియని తెలివిగలవారికి తెలియ జెప్పుట తెలివిగలవారికి తెలియకున్నది.

రావణుడు - దుర్యోధనుడు - హిరణ్యాకశిపుడు - శిశుపాలుడు-కంసుడు - కీచకుడు - మున్నగు ప్రముఖులు, విద్యావిహీనులుకారు. అయినను వారివిద్య కామాగ్నిణపగల్గెనా? పాండిత్యము కామమును జయింపగలదని యొకవేళ వాదమున కంగీకరించినను అదెంతవఱకు సాధ్యమో గమనింతము. గురుకులముల నిర్మించి ముందుగ స్త్రీల కెల్లరకు విద్యాభ్యాస మొనర్పవలెను. భారతదేశము పురుషులకే విద్య జెప్పింపలేని దురవస్థలోనున్నపుడు స్త్రీలెల్లరిని విద్యావతులుగ నొనర్పగలదా ? అటుల జేసిననాడుకదా-సమర్తాడినపిమ్మట పెండ్లిచేయవలెనని పట్టుబట్టుట.

అనార్యుడు:—

మహాత్మా! స్త్రీలెల్లరకు విద్య నేర్పలేకున్నను విద్యావతులకైనను సమర్తాడినపిమ్మట పెండ్లిసేయుట కభ్యంతరమేమి ?

ఆర్యుడు:—

మిత్రమా ! విద్యావతులకు సమర్తాడినపిమ్మట పెండ్లి చేయుదురుగాక. అటుల సేయువారిని వలదని బంధించు రాజశాసనములు లేవే ? అట్లుండ విద్యరాని బాలికలకుసైతము సమర్తాడినపిమ్మట పెండ్లిచేయవలెనని శాసనములొనర్చుట

న్యాయమా ? అటుల బలవంతపెట్టి "శారదాబిల్లును ప్రవేశ పెట్టలేదా ? ఇదియెంతయజ్ఞాన విలసితమో చూడుము.

అనార్యుడు:—

అయ్యా ! శారదాబిల్లులో - లోపము లున్నమాట సత్యము. స్త్రీలెల్లరు విద్యావతులైనచో నీవువచ్చిన స్త్రీలకు వివాహము లొనర్పవచ్చును. ఏనాటికైనను స్వరాజ్యము సిద్ధింపకపోదు. అపుడు స్త్రీలెల్లరకు నిర్బంధవిద్య ప్రారంభమగును. అంతటవారు విద్యావతులయ్యెదరు. అప్పటికైనను యువతీవివాహములు ప్రఖ్యాతిగాంచగలవు. అంత బాల్య వివాహము లంతరించును. అప్పుడైనను సమర్తాడినపిమ్మట పెండ్లిచేయక తప్పునా ?

ఆర్యుడు:—

మిత్రమా ! నాభావమును నీవు గ్రహింపకుంటివి. అడవులలో కందమూలముల దిని జీవించు మహర్షులుసైతము ఏకాంతమందున్న స్త్రీలనుజూచి కామపీడితులైరని తెల్పి యుంటిని. దానిని మఱచితివి. ఒకింతకాలము వాదముకై యంగీకరించిన విషయమును ప్రమాణమనుకొని విద్యావతులు దుష్ప్రవర్తన మొనర్పరని నిశ్చయించితివి. ఇది వెర్రితనము. ఇంత యేల విద్యయున్నను లేకున్నను ఘోషాపద్ధతి గల యంతఃపుర నివాసినులకుదప్ప తదితరస్త్రీలకు బాల్య వివాహములే ముఖ్యములని యెఱుంగుము.

అనార్యుడు:—

ఆర్యమహాశయా ! పురుషులకంటె స్త్రీలకు కామ మెక్కువగుటచే దానిని తగ్గించుటకై బాల్యవివాహము

లోనర్పవలెననియు భర్తయెడ భయభక్తులు కలుగ జేసినగాని కామోద్రేకము తగ్గదనియు సెలవిచ్చితిరి. బాల్యమునుండి యట్టియభ్యాస మొనర్చినపుడే వారిజీవితము పవిత్రమగునని సూచించితిరి.

ఇన్నిటికి మూలసూత్రమేమి ? స్త్రీ-తనపతిని దైవముగ భావింపవలెనని తేలుచున్నది. ఇది నిజమైనయెడల పురుషులు స్త్రీల నణగద్రొక్కుటకై ధర్మశాస్త్రములు కల్పించిరని స్పష్టమగుచున్నది. జగత్కర్తయగు భగవానుడనేక బ్రహ్మాండముల సృజించి సర్వశక్తుడైయుండ నట్టిమహాత్మునితో నొకపురుషునిపోల్చి వానిని దైవముగ భావింపుమనుట ద్రోహముకాదా ? ఇంతకన్న పాపముండునా ?

ఆర్యుడు:—

నాయనా ! నీప్రశ్న జ్ఞానశూన్యముగనున్నది. స్త్రీల నణగద్రొక్కుట సత్యమేని దేవాలయములందుగాని - దేవతార్చనమందుగాని పురుషులేమిచేయుచుండిరో తెలియునా? దేవుని ప్రార్థింపుచుండిరని యెఱుంగుము. తానే దేవుడైన యెడల తన్నురక్షింపుమని యింకొకని ధ్యానించు టెందుకు ? దీనింబట్టి పురుషుడు దేవుడని భావింపకుము. వానికిని దేవుడు కలడు. అతడు సర్వవ్యాపకుడైయుండెను. ఈసంగతి పురుషుడెఱుంగును. అటుల తెలిసియు రాతిబొమ్మలను పూజింపుచున్నాడు. అటుగాక గుడిలోనిరాయి నిజమైనదేవుడని తలంచినయెడల నారాతికితాను దాసుడైనట్లేకదా ? అపుడు పురుషులెల్లరు రాళ్లచే నణగద్రొక్కబడిరని స్పష్టమగును. ఇట్టి దురవస్థను తెచ్చిపెట్టుకొనినదెవరు ? పురుషులేకదా?

స్త్రీలనొక్కరినే యణగఁద్రొక్కుటకు యత్నించినచో నందు కొంత సత్యముండవచ్చును. తాముకూడా రాళ్లచే నణగఁద్రొక్కించుకొనిరి. విమర్శింపగా నిందెద్దియో యొక రహస్యముండును. అంతియేకాని నీవనుకొన్నట్లు స్త్రీలపై కఠినచర్యలను వహించిరని తలపరాదు. దేవుడు సర్వాంతర్యామియని పురుషులెఱింగియు అట్టివానిని ధ్యానించుటకు **మార్గము** వేరొండులేక జగత్స్వరూపమునుజూచి యామహాత్ముని జ్ఞప్తికిందెచ్చుకొని భజించుచున్నారు.

భయంకరారణ్యములు - మహత్తరమగు పర్వతాగ్రభాగములు - తరంగములచే నల్లకల్లోలమగుచుండు సముద్రములు - సూర్యచంద్ర నక్షత్రాది జ్యోతిర్గణములు - మున్నగు వానిని దర్శించినపుడే భగవానుడు జ్ఞప్తికివచ్చుననుట సత్యము. నిరాకారుడగు పరమేశ్వరుని స్మరింపవలెననిన నేత్రగోచరంబైయొప్పు సాకారపదార్థములకంటె వేరొక త్రోవలేదు.

ఆసముద్రములు - పర్వతములు - అరణ్యములు - ప్రతిచోట లభింపగలవా? కావుననే యేదోయొక జగద్వస్తువును గుర్తుగబెట్టుకొని దైవధ్యానమొనర్చునట్టిపద్ధతి మనపూర్వులు నిర్ణయించిరి. ఆవిధానమే విగ్రహారాధన మనబడును.

ఇంకనొక దృష్టాంతము వినుము. నీవు బాల్యమున నొకగురువుకడ జదివియుందువు. అతనిని జూచినపుడు నమస్కరించియుంటివి. కొంతకాలమునకతడు మరణించెను. గురుదర్శనమునకై వెళ్లితివనుకొనుము. ఆశవము నొకకుర్చీపై కూర్చుండబెట్టి యలంకరించి ఫోటోతీయుచుండగా చూచి

తివి. స్థూలునందు నమస్కరించినటుల నాశవమునకు నమ స్కరింతువా ? అటుల జేయవు. కారణమేమి ? అతనిలోనున్న యాత్మ లేచిపోయెను. అంఙుతే నీవు పూజింపదగినదెద్ది ? ఆత్మయా ? లేక శరీరమా ? ఆత్మయేకదా ? అతడు జీవించి యున్నపుడు నీవొనర్చు నమస్కారము సైతమాత్మ కేకదా ? వాస్తవమున నతనియాత్మను గౌరవింపవలసియుండ దానిని పూజింపక శరీరమునకునమస్కరించు టెందుకు? శరీరమునకుగాక ఆత్మ కేయని చెప్పెదవుకాబోలు. అయితే దేహమునుజూచి నపుడు నమస్కరించు టెందుకని ప్రశ్నింతును. అపుడు నీవే మనెదవు ? ఆత్మ యేపదార్థము (దేహము) న వ్యాపించెనో ఆరూపమునుజూచి యందున్న నిరాకారమును పూజించితినని ప్రత్యుత్తర మొసంగెదవు. నీమాటపై నీవు నిలతువేని పురు షులకు విగ్రహారాధనము - స్త్రీలకు పతిసేవయు నెందుకో తెలియును. అవివేకులీరహస్యమును గుర్తింపజాలరు. ఎట్లన ! శిష్యుడు గురువుయొక్క యాత్మకు నమస్కరింపుచున్నను బాహ్యమునకు గోచరించునది దేహపూజయగుటచే నాశి ష్యుని యవివేకిగదలచి చర్మపూజాధురంధరుడని హేళన మొనర్తురు. శిష్యునియొక్క-యాత్మ గురువుగారియాత్మతో సంబంధించియున్నను దానిని లోకము తెలిసికొనలేదు. గురువు యొక్క విగ్రహమును ధ్యానించుచున్నాడను నొకభ్రమ బయలెడలును. ఇట్టియజ్ఞానమంకురించుట జగత్స్వభావము. ఏమన ! జగత్తుసయితము భ్రమమూలకము. భ్రమనశించిన గాని ముక్తికలుగనేరదు. అది తొలగుట బహుదుర్లభము. జన్మజన్మాంతర పుణ్యమునగాని యీయజ్ఞాన మంతరించదు.

అనాటిభ్రమయే నేడు నీబోటివారిని చేపట్టి విగ్రహారాధనము దూష్యమని పల్కించుచున్నది.

ఈ విగ్రహారాధన సిద్ధాంతమును మనసునందిడుకొని హైందవస్త్రీల నుద్ధరించుటకు పురుషులను విగ్రహముగ నేర్ప అచిరి. పురుషుల బాగుచేయుటకై శిలావిగ్రహములు సిద్ధ పఱచిరి. గృహమందలి పురుషవిగ్రహములుగాని - గుడిలోని శిలావిగ్రహములుగాని - వాస్తవమున దైవస్వరూపములు గావు. అయితే యిక పూజించుటెందుకని సందియముగలు గును. గురువుయొక్క శరీరము - ఆత్మకాకున్నను ఆతని శరీర పూజ యెటుల ఆత్మపూజగా పరిణమించుచున్నదో-అటులనే స్త్రీలవిషయమున పురుషపూజయు పురుషులవిషయమున శిలాపూజయు - ఆత్మపూజయై యలరారుచున్నది. అనగా నిరాకార ధ్యానమునకు సాకారపూజయే ముఖ్యసాధనమని స్పష్టమగుచున్నది. సాకారమునువిడచి నిరాకారమును ధ్యానింపవచ్చునని నిశ్చయించినయెడల మనమిత్రుడగు శిష్యుడు గురువుగారియాత్మకు నమస్కరింప దలచినపుడు తానెచ్చట తిరుగుచున్నను ఆతనిదేహమును జూడకయే నమ స్కరింపవచ్చును. గురువును దర్శించినపుడు విగ్రహారాధన భీతిచే నమస్కరింపక విడువవచ్చును. గురువదిగాంచి పెద్ద లను జూచినపుడు నమస్కరింపవలెనని బోధింప

"ఆర్యా ! నమస్కరింపవలసినది నిరాకారస్వరూప మగు ఆత్మకేగనుక నేనపుడపుడు తమయాత్మను పూజింపు చుంటిని. ఇపుడీదేహమునకు నమస్కరించుటకు మనసురాదు."

అని ప్రత్యుత్తరమొసంగి శిక్షింపబడుటతప్ప ఫలితము వేరొండుకలుగదు. అట్లే విగ్రహారాధన మొనర్పక కేవల నిరాకారపూజ గావించువారెల్లరు పరలోకసౌఖ్యమొందక యనేకకష్టముల ననుభవింపవలసి యుందురు.

కావుననే స్త్రీలు – నిరాకారబ్రహ్మమును నమస్కరింపదలచి తనభర్తయొక్క శరీరమును సాధనముగ నేర్పఱచుకొని యతనిమూలమున నిరాకారతత్త్వమును పూజించుచున్నారు. అట్లే పురుషులు సర్వాంతర్యామియగు పరమేశ్వరుని భజింపదలచి రాళ్లను సాధనములుగ గైకొని అందుండు భగవత్తత్త్వమును భజింపుచున్నారు.

ప్రపంచమునకంతకు దేవుడొక్కడేసుమా? హైందవ విజ్ఞానమును గ్రహింపజాలని యవివేకులు "స్త్రీలననగ ద్రొక్కటకై పురుషులు దేవతాస్వరూపులైరని" ప్రగల్భములు గొట్టుచుందురు.

అనార్యుడు:—

స్త్రీలుగాని – పురుషులుగాని – సర్వాంతర్యామియగు పరమాత్మను మనస్సుతో ధ్యానింపవలెననియు – కంటితో నొక విగ్రహమును జూచుచుండవలెననియు జెప్పియుంటిరి అది బాగుగనేయున్నది. పురుషుడెటుల శిలావిగ్రహమును సాధనముగ గైకొని దైవధ్యానమొనర్చుచుండెనో అటులనే స్త్రీలుగూడ రాతివిగ్రహముల పూజింపకూడదా?

---

☞ దేవాలయములు-అందలివిగ్రహములు నైవేద్యములు వానిపైబూతుబొమ్మలు మున్నగు విషయములగుఱించి రాబోవు గ్రంథములలో రాగలవు.

ఆర్యుడు:—

మిత్రమా! అపుడపుడు స్త్రీలు విగ్రహములను పూజిం పుచునే యున్నారు. కాని ప్రధానపూజ పతిసేవయైయున్నది. ఏమన ! పురుషులకంటె స్త్రీలయందు మనోబలము తక్కువగనుండును. పురుషులమనస్సు కఠినమైనది. స్త్రీలమనస్సు మృదువైనది. ఒకపనియొనర్చి తత్ఫలమపేక్షించుటలో పురుషులకంటె స్త్రీలు అత్యాతురత జూపుచుందురు. ఫలము లభింపదేని విశేషముగ దుఃఖింతురు. ఎంతదుఃఖమైనను పురుషుడు నిమిషమాత్రమున పోగొట్టుకొనును. ఆశయు పురుషులకన్న-స్త్రీలకు మెండు. దానిని దీర్చువారు ప్రత్యక్షముగ లేకుందురేని తహతహలాడుచు క్రుంగిపోవుదురు. విగ్రహముల యెదుట కూర్చొని దైవమును ధ్యానింపుచు "ఓపరాత్పరా! ధనమును - అన్నమును-వస్త్రములను-ఆభరణములను-గృహములను ప్రసాదింపుము" అని ప్రార్థించి వెంటనేయవి లభించెనా లేదాయని వెదకుచుందురు. ఆవిగ్రహము పిడికెడన్న మైనను తెచ్చిపెట్టదు. ఫలము లభింపనందున క్రమముగ దైవమందు నమ్మకమువిడుతురు. ఈకష్టమును తప్పించుటకై స్త్రీలకు పతిరూపమున దైవధ్యానము నిర్ణయింపబడెను. "ఓదైవమా! నాకు ధనమొసంగుము" అని ప్రార్థించినయెడల పతిమూలమున కొంతధనము లభించును. ఇట్టే వస్త్రాభరణాదులు సైతము పతిమూలమున చేరును. మనోబలము సన్నగిలినపుడు దైవమువలె తోడ్పడి యుత్సాహవాక్యముల బోధించి యామె నోదార్చును. ఇన్ని పనులను రాళ్లు చేయజాలవు. శిలావిగ్రహములకంటె పురుషవిగ్రహములు మేలోస

గూర్చుచుండ వారిని విడచి ప్రాణములేని రాతిబొమ్మలను సేవింప నధికారములేదని విలపించుచుందుకో తెలియకున్నది.

అనార్యుడు:-

మహాశయా! భర్తయొక్క రూపమును సాధనముగ గైకొని దానిని జూచి దైవమును జ్ఞప్తికి దెచ్చుకొనినగాని స్త్రీ కడతేరదని తెల్పియుంటిరి. ఆ విధానము స్త్రీలపాలిటికి క్షేమమగుగాక. ఆ భర్త మరణించెనేని యిక దైవధ్యాన మొనర్చుటకు సాధనమేది? వేరొకని వరించి యతని మూలమున దేవుని భజింపవలెనన్న స్త్రీలకు పునర్వివాహములు లేవంటిరి. ఇక వారి గతియేమి?

ఆర్యుడు:-

నాయనా! మనకు గోచరించు సంశయములన్నిటిని హిందు మతము నివారింపగలదు. వేదసిద్ధాంతములపై ప్రశ్న వేసి జయింపగల ధీరుడీ ప్రపంచమునలేడు. ఏమన! హిందూ మతము ప్రభు మతమైయున్నది. దాని నాశ్రయించినవారికి సాధ్యముగానిపని యుండదు. రెండవ దేవునివలె జగత్సృష్టిని సైతము జేయుటకు శక్తిగల్గును. విశ్వామిత్రుడు నూతన స్వర్గమును నిర్మింపలేదా? వసిష్ఠమహర్షి నిరాయుధుడై శత్రువులతో యుద్ధమొనర్పలేదా? సావిత్రి మరణించిన భర్తను బ్రతికించుకొనలేదా? సీతామహాదేవి యగ్నిప్రవేశమొనర్చి జీవింపలేదా? మార్కండేయులు అల్పాయుష్మంతుడయ్యు చిరంజీవియై యుండలేదా? అనసూయ త్రిమూర్తులను సైతము బాలురుగ నొనర్పలేదా? ఇంతయేల-జగద్విషయమున సయితము విమానాది యంత్రనిర్మాణ మొనర్చినది

హిందువులు కారా? చంచల చిత్తులై యున్నంతవరకు హిందూధర్మములు బోధపడవు. మతములన్నిటిలో హిందూ మతము సర్వోత్కృష్టమైనదని తలంతువేని దానికి బునాది వివాహధర్మమని యెఱుంగుము. బునాది గట్టిగ నుండనిచో గృహమెట్లుకూలునో-అటులే వివాహ పద్ధతులు ధర్మబద్ధములై యుండనిచో హిందూజాతియే నశించును. వివాహమునకు పాత్రలు స్త్రీపురుషులిరువురేసుమా! వారిలో "గృహిణీ గృహముచ్యతే" అను న్యాయప్రకారము స్త్రీ-ప్రధానపాత్రమై యున్నది. ఆమెను తపస్సంపన్నుడగు మునిపుంగవునితో సమానముగ నొనర్చుటకై హిందూ మతము ప్రయత్నించుచున్నది. అందుకు సాధనము పాతివ్రత్యధర్మమే. * పతివ్రతలైన హిందూ స్త్రీలయొక్క మహిమలు ఒకానొక సమయమున దేవుని సైతము మఱపింపగలవు. ఈ విధమగు దృష్టితో స్త్రీ ధర్మముల జూచినపుడే అయ్యవి యెటుల నిర్మింపబడినవో బోధపడగలవు. అంతవఱకు స్త్రీ ధర్మముల విమర్శించుటకెవ్వరికిని హక్కులేదు. స్త్రీ తన జీవితాంతమువఱకు భర్తను జీవింపజేయుటకై వ్రతముపూనుచున్నది. అతడు జీవించియుండగనే తాను మరణింపనెంచుచున్నది. మంగళసూత్రమును గట్టిగనుంచుకొని సుమంగళియని ప్రఖ్యాతిగాంచుచున్నది. భర్త బహుకాలము జీవించియున్నపుడే యామె సుమంగళియగును. సౌమాంగల్యమును రక్షించుకొనుటకంటె హైందవ స్త్రీలకు వేఱొండుధర్మము లేదు. అందుకై విశ్వప్రయత్నము లొనర్తురు.

* పతివ్రతా మహిమ రాబోవు గ్రంథములలో విమర్శింపబడును.

☞ ఏయేకారణములచే ఈ ధర్మములేర్పడెనో రాబోవు గ్రంథములలో తెలుపబడును.

శ్రీరామచంద్రుని రాజ్యమున నొక్క వితంతువైనను లేదని రామాయణమున గలదు. పూర్వకాలపు హిందువు లీవిధముగ ధర్మరాజ్యమును స్థాపించిరి. కోటికొక స్త్రీ దౌర్భాగ్యవశమున వైధవ్యము పొందినను దానికి కారణము పూర్వజన్మకృత మహాపాపమని నిశ్చయించుకొనెను. మఱియు పాపపరిహారముకై బ్రహ్మచర్యమును బూని జీవితాంతము వరకు భగవద్ధ్యాన నిమగ్నయై కాలము గడుపుచుండును.

ఇట్టి దురవస్థ కల్గుటకు హేతువు పురుషుడు చిర కాలము జీవింపకుండుటయే సుమా! ఇక్కాలమున పురుషు లెక్కువగ మరణించుటయు వితంతువుల సంఖ్య పెరుగుటయు కడుంగడు శోచనీయమైయున్నది. ఇందుకు కారణము స్త్రీ పురుషు లిరువురు మత ధర్మముల మంటగల్పుటయేయని యెఱుంగవలెను. రోగమెచ్చటనో యెఱుంగక వేఱొకచోట చికిత్సచేయు వైద్యులవలె నేడు సంఘసంస్కారులు బయలుదేరిరి. మన తాతముత్తాతలు నూరేండ్లుజీవించియుండ మన మల్పకాలము జీవించి స్త్రీలకు వైధవ్యము నంటగట్టుచుంటిమో తెలిసికొనుము. ఈ నేరమొనర్చినదిగాక దీనికి తోడుగవారిని మరల పెండ్లాడుడని బోధించు టెంత యవివేకమో గ్రహింపుము.

భగవంతుని రూపము గోచరింపకున్నను జగత్కుటుంబమం దొక పదార్థమునుజూచి దైవధ్యాన మొనర్చుట లేదా? అటులనే భర్తృరూపము కానరాకున్నను అతని వంశమును దర్శించుచు తన్మూలమున దైవధ్యానమొనర్చి తరింపవచ్చును. అంతియేగాని స్త్రీలు పునర్వివాహము లొనర్చుకొనరాదు.

సంపూర్ణము.

# హిందూ మత గ్రంథమాలా

## విరాళముల వివరములు

మహారాజాధిరాజపోషకులు రూ. 116-0-0 మొదలుకొని మనసోత్సాహముకొలది.

| | | |
|---|---|---|
| మహారాజపోషకులు | సం॥ ౧కి రు | 25-0-0 |
| రాజపోషకులు | " | 10-0-0 |
| పోషకులు | " | 5-0-0 |
| సహాయకులు | " | 3-0-0 |
| అభిమానులు | " | 2-0-0 |

## చందా వివరము

సంవత్సరం చందా

| | | | |
|---|---|---|---|
| పోస్టుతో సహా | " | 1-5-0 | (బ్రిటిష్) |
| " | " | 1-4-0 | (నైజాం) |

☞ బ్రిటిషులో బుక్కుపోస్టు చార్జి రు. 0-0-3 లు హెచ్చినందున 12 నెలలకుగాను రు. 0-3-0 లు పెంచవలసినది.

ఈ పుస్తకములు వలయువారు

మేనేజరు:—

హిందూ మత గ్రంథమాల

సికింద్రాబాదు (దక్కన్)

అని వ్రాయవలెను.

☞ గ్రంథమాలా సభ్యులుగ నుండదలచినవారు తమ పేరు, పోస్టు, తాలూకా, జిల్లాను విడివిడి అక్షరములతో వ్రాయవలెను.

# రాబోవు గ్రంథములు

——:——

షట్చక్రముల కధిపతివి కాదలంచితివా

గృహరాజ్యమును వశపరచుకొని

తక్కిన అయిదు రాజ్యముల నార్జింపుము.

అవి యెవ్వి?

## ౧ దేహ రాజ్యము ౨ దేవ రాజ్యము

## ౩ దేశ రాజ్యము

## ౪ ధర్మ రాజ్యము ౫ మోక్ష రాజ్యము

ఈ రాజ్యము లన్నిటిని పరిపాలించు విధానమును

తేటతెల్లముగ దెలియజేయు

## హిందూ మత గ్రన్థమాలా

కుసుమముల సేకరింపుము.

హిందూ మత గ్రంథమాల

ఉపన్యాస చక్రవర్తి
ఉమామహేశ్వర పండిట్‌గారి ఉపన్యాససారము.

# Home Rule

# గృహరాజ్యము

6 వ భాగము.

విక్రమ సం॥ ఫాల్గుణ మాసము.

6 వ పుష్పము

వెల
0-1-6



— నమస్తే —

ఈ గ్రంథమాలలో
వెలువడు గ్రంథములపై సర్వాధికారములు
బ్రహ్మశ్రీ
ప్రభాకర ఉమామహేశ్వర పండితులవారివి.

హిందూమత ప్రచారక, ఉపన్యాస చక్రవర్తి

బ్రహ్మశ్రీ ప్రభాకర ఉమామహేశ్వర పండితులవారి

ఉపన్యాససారము

# ప్ర హా రా జ్య ము.

## ( 6 వ భాగము )

మొదటి కూర్పు

N
Bc
Bo
1.
2.
3.




D కొండా శంకరయ్యాగారి ప్రీమియర్ ముద్రాక్షరశాల,

సికిందంబాద్.

 వెల 0-1-6

గ్రంథములు వలయువారు

మేనేజరు:—

# హిందూమత గ్రంథమాల

సికిందరాబాద్-దక్కన్

అని వ్రాయవలెను.

# గృహరాజ్యము.

## 6 వ భాగము.

(50 వ ప్రశ్న)

అనార్యుడు:—

మహాశయా! పురుషులు మృతిజెందనియెడల స్త్రీలకు వైధవ్యముండదనియు-అందువలన స్త్రీపురుషు లుభయులు గలసి పురుషుని దీర్ఘాయుష్మంతునిగ జేయు సాధనము లభ్యసింపవలెననియు నుడివితిరి.

ఆయువును బ్రహ్మదేవు డొక్కసారియే లిఖించును. దానిని తప్పించుకొనుట కెవరితరము? తగ్గించుటయు పెంచుటయు మన చేతిలో నున్నదా?

ఆర్యుడు:—

ఓయీ! ఏ శాస్త్రము ప్రమాణమో దానిని పూర్ణముగ జూచినచో సంశయములుండవు. మార్కండేయునకు బ్రహ్మలిఖితము 16 వత్సరములని యున్నను అదే శాస్త్రమతనిని చిరంజీవునిగ నొనర్చెను. సావిత్రియొక్క భర్తకు ఆయువు స్వల్పమైనను వృద్ధిజెందెను.

ఏవిద్యయందును సంపూర్ణజ్ఞానమును బొందక సర్వజ్ఞులమని భ్రమించి ప్రశ్నించుట భావ్యమా? సంశయ నివారణమునకై యడుగకూడదని కాదు. శాస్త్రీయముగ ప్రత్యుత్తరము లభించినపుడు మరల మొండితనముగ ప్రశ్నింపరాదు.

లక్షలకొలది ప్రశ్నలైనను న్యాయసమ్మతముగ నుండెనేని ప్రత్యుత్తరము చెప్పుటకు హిందు మతము సిద్ధముగనున్నది. ఇక బ్రహ్మలిఖితమును తప్పించునట్టి సూత్రమును వినుము. బ్రహ్మదేవు డొకని కిరువదేండ్లాయువును ప్రసాదించెను. అత డెనుబది వత్సరములు జీవించుటకు వీలు గలదు. అయినను బ్రహ్మ లిఖితమునకు బాధ లేదు.

సూర్యోదయము మొదలు మరల సూర్యోదయవఱ కొకదినమగునని ప్రపంచ వ్యవహారమున కలదు. అట్టి దినములు 360 అయినయెడల నొక వత్సరమగును. ఇటుల నెనుబది యేండ్లు జీవింపవలెనని యతడు తలచెను. అయితే బ్రహ్మదేవుని యుద్దేశము ననుసరించిన దినప్రమాణమునకును-మానవ వ్యవహారమందున్న దినమునకును-వ్యత్యాస ముండుటచే నాయుష్యము పెరుగును. ముక్కునుండి లోపలికి నడుచుచుండిన గాలియొక్క రాకపోకలు ఇరువదియొక్క వెయ్యి ఆరువంద లయ్యేనేని యది యొక దినమగునని బ్రహ్మగారి భావము. అట్టి దినములు 360 అగుచో నదియొక వత్సరమగును. అట్టి వత్సరము లిరువదియైనయెడల నొకనికి నాయువు పూర్తియగునని బ్రహ్మ నిర్ణయించెను. అట్టి వయః పరిమితిగల యొక పురుషుడు ప్రపంచ వ్యవహారప్రకారము 80 యేండ్లు కాదు వందలకొలది వత్సరములు జీవింపగలడు. ఎట్లన! ఇరువదినాలుగుగంటలు గల వ్యావహారిక దినమున ఇరువదియొక్క వెయ్యి ఆరునూర్లు శ్వాసలను సరిగా నడిపించినయెడల ప్రపంచదినముతో దైవనిర్ణీత దినము సరిపోవును. అపుడా పురుషు డిరువదివత్సరములే జీవించును.

ఆయుర్వృద్ధి జేసికొనదలచెనేని యతడు దినమున కిరువది యొక్క-వెయ్యి ఆరునూర్ల శ్వాసలను నడపక ప్రాణాయామము చేతను-వేద వేదాంతాది కాలక్షేపములచేతను - పెద్దలనుండి సద్విషయముల వినుటవల్లను శ్వాసల బంధించుకొనుచు నిటుల ప్రతిదినము షుమారు పదివేల శ్వాసలను నడిపించు చుండెనేని రెండుదినములకు 21 వెయ్యి ఆరునూర్లు శ్వాసలు పూర్తియగును. ప్రపంచమున రెండుదినములు జరుగగా 21 వెయ్యి 6 నూర్లు శ్వాసల నతడు నడుపుకొనగలైనని యెఱుంగుము. అప్పటి కీశ్వరనిర్ణయప్రకార మొకేదినము లెక్కకువచ్చెను. ఎందుకన 21600 శ్వాసలు కలదికదా యొకదినము. ఈవిధముగ లెక్కింప దైవనిర్మితవత్సర మొకటి కాగా లోకమున రెండేండ్లగును. బ్రహ్మలిఖిత ప్రకార మేర్పడిన నిరువదేండ్లకు ప్రపంచవత్సరముల ప్రకారము నలు బదేండ్లగును. దినమునకు 5 వేల శ్వాసలను మాత్రము నడి పించుకొనగల్గునెడల నిరువది వత్సరములు జీవింపవలసిన నరుడు ఎనుబదేండ్లు బ్రతుకగలడు. ఇటుల వేలకొలది వత్సర ములు సజీవుడైయుండవచ్చును.

కావున శాస్త్రములలో కొన్ని పను లాయుఃప్రదము లనియు-కొన్ని ఆయుఃక్షీణములనియు జెప్పబడినవి. రాత్రి కాలమున పెరుగు తిన్నయెడల నాయువు క్షీణించుననియు-పాలుత్రాగినయెడల నాయుర్వృద్ధియనియు శాస్త్రములలో కలదు. పరుల బాధింప బూనినపుడు-కుతంత్రముల నొనర్చు నపుడు-దొంగిలించునపుడు-వ్యభిచార మొనర్చునపుడు-ఒకరిని చంపదలచినపుడు-భయము గల్గినపుడు మున్నగు పనులలో

గుండె కొట్టుకొనుట మనము చూచుచున్నాము. అందువలన శరీరమునకు వేడిపుట్టి దేహమందలి గాలి పలుచబడి శ్వాస లధికమగును. అందుచే దినమునకు ఇరువైయొక్క వెయ్యి ఆరునూర్లు శ్వాసలకంటె మించి నడచును.

శ్వాసలను విశేషముగ ఖర్చుపెట్టుకొనిన దోషముచే నిరువది వత్సరములు జీవింపవలసిన పురుషుడు పదునైదు వత్సరములకే మరణించును. ఇటుల చేతులార ప్రాణములు గోల్పోయి తమ స్త్రీలకు వైధవ్యము నంటగట్టి దుఃఖముల పాలుజేయుచున్నారు. జాతి నియమమెందుకు ? వేదప్రమాణ మేల ? తోచినటులెల్ల సేయరాదా ? అని ప్రశ్నించువారు బయలుదేరిరి. తత్ఫలితముగ నల్పాయువులగుచున్నారు. ఇది నిజమో కాదో తెలియుటకై యొకమారు వారి తాత ముత్తాతల వయస్సును-రూపలావణ్యాది విశేషములను-సిం హావలోకన మొనర్పుము. వారెల్లరు వృద్ధులై మరణించిరి. నాగరికత ముదిరి వేదవిశ్వాస మంతరించి దైవభక్తి యడుగంటి స్వాతంత్ర్యవాంఛ పెఱిగినకొలది మన యాయువు క్రుంగుచున్నది.

కావున ఆయుర్వృద్ధికరమగు పద్ధతులు వేదశాస్త్రములలో గలవని నమ్మి బాల్యవివాహము లొనర్పవలెను. అట్టి బాలికలు గౌరీవ్రతము మున్నగు నోములచే మానము వహించుచుందురు. మఱియు దైవవిశ్వాసము గల్గి సత్కాల క్షేపము లొనర్చుచుచు మనశ్శుద్ధిని పొందుదురు. వారి సంకల్పప్రభావమున పతులకు సద్బుద్ధు లుదయించి శాస్త్ర విశ్వాస మధికమగును. తత్కారణమున మతనియమముల

పాటించి ప్రాణాయామాదు లొనర్చి దీర్ఘాయుష్యమును బడ యుదురు.

ఇంతియేగాక పురుషులను సైతము బాల్యమునుండి గురుకులములకు బంపి మతశిక్షణ మొనర్చుచు నట్టివారలకు కన్యల నొసంగుచో వితంతువుల సంఖ్య పెరుగదు.

అనార్యుడు:—

అయ్యా! బాల్యవివాహములవలన నెంతయో మేలు గల్గునని తెలిపియుంటిరి. అది సత్యమే. కాని భారతీయులలో పెక్కుమంది చిన్నతనముననే వివాహములు గావించియు వెంటనే తమ బిడ్డల నత్తవారింటికి బంపరు. గర్భాధానమైన పిమ్మట బంపుదురు. ఆలోపల నాలుగైదు వత్సరములు పుట్టింట నుండుట తటస్థించును. ఇక భర్తయందు భయభక్తులు వినయవిధేయతలు మొదలగు సుగుణము లలవడుటెట్లు?.

ఆర్యుడు:—

మిత్రమా! గర్భాధాన మగువరకు తమ బిడ్డను పతి గృహమునకు పంపవలదని శాస్త్రముకలదా? అసలు 5 రోజులు జరుగవలసిన వివాహము సైతము పుట్టింట జేయుమని బోధించెనా? అల్లుని పాదములు కడిగి దానము చేయువఱకే తనయింట పెండ్లి జరుపవలెను. మరియు నగ్నిప్రతిష్ఠాపనము-మంగళసూత్రధారణము-తలంబ్రాలు పూర్తి గావించి వెంటనే ఆ యగ్నితోకూడ వధూవరు లిరువురను అల్లునింటికి బంపవలెను. అది మొదలు కన్య పతిగృహమున నుండవలెను. పురుషులు 8,10,12 సం॥ గల యీడులో గురుకులమునకు వెళ్లి యచట గురుశుశ్రూష చేయుచుండునో

అటులనే స్త్రీలు 8 సం॥ మొదలు రజస్వలలగు లోపల నొకని పెండ్లాడి యతని గృహమున కేగి యచట జీవికను నడుపవలెను. పురుషులకు ఉపనయనమెట్లో స్త్రీలకును వివాహమట్లేయని యెఱుంగుము. కావున పురుషులయొక్క ఉపనయనకాలమే స్త్రీలకు వివాహకాలమగుచున్నది. ఉపనయనము బాల్యమందే జరుగవలెనుగాని యౌవనమున కూడదు. ఈ నియమము స్త్రీపురుషు లిరువురికిని సమానమే. పురుషులకు ఉపనయన వివాహములు రెండును ప్రత్యేకముగ జేయబడుచున్నవి. కావున బాల్యమున ఉపనయనము-యౌవనమున వివాహము జరుగుచుండును. పురుషుడు పూర్ణ స్వరూపుడనియు స్త్రీ-వానిలో నర్ధభాగమనియు మతములు జెప్పుచున్నవి. స్త్రీ-పురుషునిలో నర్ధభాగమగుటచే వానికి జరుపబడు ఉపనయన వివాహములనెడు రెండు కర్మలలో నొకదానికే యామె హక్కుగల్గియున్నది. రెంటిలో సగము ఒక్కటేగదా! అందువలన నుపనయన వివాహములు రెండును గలసి యొకే కర్మగా చేయబడుచున్నవి.

"స్త్రీణాముపనయనస్థానే వివాహోహ్యామనురబ్రవీత్"

స్త్రీలకు ఉపనయనమును వివాహరూపమున జేయు (ఉపనయన వివాహముల రెంటిని ఉపనయన కాలముననే చేయు)డని మనువు వచించెను.

పురుషులకు ఉపనయనకాలము బాల్యముననే గనుక స్త్రీలకు సైతము వివాహరూపమున ఉపనయనమొనర్చి బాలురను గురుకులములకు బంపినటుల వారిని పతిగృహమునకు పంపుచుండవలెనని సారాంశము. ఈవిధముగ స్త్రీలు

బాల్యమునుండి పతి కులమున వసించుచున్నను తేని పతిభక్తి-దైవ భక్తి మున్నగు సద్బుద్ధు లలవడును.

అనార్యుడు:—

మహాశయా! ఈవిధానమంతయు కల్పితముగనున్నది. స్త్రీలకు బాల్యమున ఉపనయనమొనర్చి గురుకులమునకు బంపుడని శాస్త్రాభిప్రాయమైయుండును. అచట విద్య నభ్య సించి యౌవనానంతరము తనకు తగిన పురుషుని వరింపవలెను. ఇంతకంటె శాస్త్రములు వేరుగనుండవు. ఈ విషయమున మీ యుద్దేశ్యమేమి ?

ఆర్యుడు:—

ఓయీ ! నీ బుద్ధి కౌశల్యము మెచ్చదగినది. కాని నీవాక్యములు భ్రమమూలకములు, మఱియు ప్రమాణ దూర ములు ఎందుకన,

"పతిసేవా గురౌ వాసో గృహార్థోఽగ్ని పరిక్రియా"

(మనుస్మృతి)

పతిని సేవించుటయే గురుకులవాసమనియు-గృహకార్య నిర్వ హణమే అగ్నిపూజయనియు శాస్త్రములు చెప్పుచున్నవి. పతిసేవయే గురుసేవయని ప్రమాణము కనబడుచుండ బాల్య మున గురుకులవాసమనియు యౌవనమున పతి కులవాస మనియు విడదీయుటకు నీవెవరవు? అందులో మనుజుడు మనుస్మృతిని ధిక్కరించుటయా!.

అనార్యుడు:—

అయ్యా! వివాహము ౫ దినములు జరుగవలెననియు అందు మొదటిదినము పుట్టింటను-మిగిలిన నాల్గు దినములు

పతిగృహమునను జరుపవలెనని తెలిపితిరి. అది శాస్త్రసమ్మతమా ?

ఆర్యుడు:—

మిత్రమా! ప్రమాణబద్ధుడవగుట సంతోషము. వివాహమంత్రములు వేదములలో కలవు. కాని, యే మంత్రమే సమయమున జెప్పవలెనో-ఎట్టి తంత్రము నడుపవలెనో-అందు గోచరింపదు. మంత్రముల గనిపెట్టిన మహర్షులు వానినెటుల నుపయోగింపుచుండిరో ఆ సూత్రముల నాపస్తంబాది మహర్షులు వెల్లడించిరి.

ఆశ్వలాయనము- బోధాయనము-ఆపస్తంబము అని యిటుల పెక్కు సూత్రములు గలవు. అందు మనదేశమున ఆపస్తంబసూత్రము విశేషవ్యాపకమైయున్నది. దానిని గమనించినయెడల వివాహ కార్యక్రమ మంతయు తుదివఱకు తెలియగలదు. అపుడు పితృగృహమున జరుగు కలాపమెద్దియో-పతిగృహమున నాచరించువిధానము లెవ్వియో తేటపడును. వివాహ ప్రారంభమున వధూవరుల మధ్య తెర వేయుదురు. ఆసమయమున కన్యాదానము చేయబడును. అంతవఱకు వధూవరు లొకరినొకరు చూచుకొనరాదు. ఒకానొక మంత్రముచే తెరతీయబడును. వెంటనే వరుడు వధువును దర్శించును. దీనినే సుముహూర్తమందురు. సూత్రముల జూడుము.

"తతస్సుముహూర్తే స్వయందృష్ట్వా తృతీయాంజపేత్"

అను సూత్రముచే ముహూర్తకాలమున తెరను తీసి యొక

మంత్రము నుచ్చరించుచు వధువును దర్శింపవలెను. పిమ్మట కొంత కార్యక్రమము నడచును.

"తస్మిన్నుత్తరయా దక్షిణం యుగచ్ఛిద్రం ప్రతిష్ఠాప్య"

ఈ సూత్రము ననుసరించి యొక మంత్రముచే కన్య యొక్క శిరస్సుపై కాడి యుంచవలెను.

"మంగళసూత్రంబద్ధ్వా, తతః అక్షతారోపణంకుర్యాత్"

* అంత మంగళసూత్రము కట్టి, తలంబ్రాలు పోయవలెను.

"అథైనాముత్తరయా దక్షిణేహస్తే గృహీత్వాఽగ్ని మభ్యానీయ"

కన్యను చేయిపట్టుకొని అగ్నియొద్దకు వెళ్లి యచట ప్రధాన హోమము చేయవలెను.

"అంతే హస్తగ్రహణమ్"

"గృభ్ణామి తే" అను మంత్రమును జెప్పుచు చివరకు కన్యయొక్క హస్తమును పట్టుకొనవలెను. ఇటుల చేయి పట్టుకొనుటకే పాణిగ్రహణమని పేరు. కావున పాణిగ్రహణ మహోత్సవములో ప్రధానతంత్ర మిదియేయని యెఱుంగుము.

"అథైనాం సప్తమేపదే జపతి"

పిమ్మట కన్యను ఏడడుగులు నడిపింపవలెను.

"ఉత్తరాభ్యాం యోక్త్రం విముచ్య" కొన్ని హోమములుజేసిన పిదప కన్యయొక్క నడుముకుగట్టిన త్రాటిని విప్పివేయవలెను. మొదటిదినమున తండ్రియింట చేయదగిన

* వివాహమున జరుగు తలంబ్రాలు మొదలగు తంత్రములగల రహస్యములు రాబోవు గ్రంథములలో తెలుపబడును.

కర్మకాండ యింతటితో ముగిసెను. వెంటనే కన్యను అత్త వారింటికి పంపవలెను. అపుడు భర్త - భార్యను బండిపై నెక్కించుట కేమిచేయవలెనో యీ క్రింది సూత్రములు జూడుము.

"ఉత్తరా రథస్యోత్తంభినీ"

బండికి యెద్దులను కట్టవలెను.

"ఆరోహాత ముత్తరాభి రభిమంత్రియతే"

బండి నెక్కుచున్న సమయమున కొన్ని మంత్రములచే నా కన్యను అభిమంత్రింపవలెను. అంత పయనమై

"తీర్థస్థాణు చతుష్పథ వ్యతిక్రమేచోత్తరాంజపేత్"

నదులు-గట్టులు-నాలుగుదార్లు కలసినచోట్లు దాటునపు డొక మంత్రమును జపింపవలెను.

"నావముత్తరయానుమంత్రయతే"

ప్రయాణమధ్యమున నదులు-కాలువలు-అడ్డమువచ్చినయెడల పడవ నెక్కునపు డొకమంత్రమును జదువవలెను.

"గృహాన్ప్రపాదయ న్నుత్తరాం వాచయతి"

ఇటుల క్రమముగ నా కన్య అత్తవారి యూరు చేరగా తన గృహమును జూపుచు నామెచే నొక మంత్రమును జెప్పింప వలెను.

"అనయా సహోఢయా వధ్వాసహ గృహప్రవేశ హోమం కరిష్యే"

అంత కన్యను తనయింటిలో ప్రవేశపెట్టి యామెతో గలసి గృహప్రవేశ హోమమును జేయవలెను.

చూచితివా ! మొదటి దినమున తలంబ్రాలు మున్నగునవి పూర్తియైన వెంటనే అగ్నిని గైకొని వధూవరులు రథముపై నెక్కి ప్రయాణమొనర్చి మార్గమధ్యమున నదులు–కొండలు దాటి క్రమముగ స్వగృహమునకు జేరి యచ్చట గృహప్రవేశ హోమములు చేయుచున్నట్లు గ్రహించితివి. పిమ్మట

"అథైనామాగ్నేయేన స్థాలీపాకేన యాజయతి"

పుట్టింటినుండి తెచ్చిన అగ్నిహోత్రమున స్థాలీపాకమను నొక కర్మ నొనర్పనగును.

" ఔపాసనమారభ్య " "యావజ్జీవం హోష్యామీత్యుభయోస్సంకల్పః" అప్పటినుండి"ఔపాసనము" అను కర్మను (అనగా నగ్నిపూజను) జీవితాంతమువఱకు జేసెదమని వధూవరు లిరువురు సంకల్పింపవలెను.

అంత–ప్రతినిత్యము అగ్నిపూజగావింపుచు మూడవ దినమున సదస్యము–నాల్గవదినమున శేషహోమము జరిపి అయిదవదినము * మానసికదేహములను గర్భాధానసంస్కారముచే పరిశుద్ధిగావింపవలెను. అదిమొదలు క్రమముగ "పతిసేవాగురౌవాసో గృహార్థోఽగ్ని పరిక్రియా" యన్నట్లు అత్తవారింటవసించి పతిసేవయే గురుసేవగభావించి అగ్నిహోత్ర సంరక్షణార్థమై యేర్పడిన పనులగావించుచు స్త్రీలకుందగిన విద్యనభ్యసింపవలెనని స్పష్టమగుచున్నది.

---

* అయిదవనాడు జరుగు గర్భాధానసంస్కారము స్థూలదేహములకు కాదని రాబోవుగ్రంథములలో చూడగలరు.

అనార్యుడు:—

అయ్యా! తాము సెలవిచ్చినది సత్యమేని యిపుడు జరుగుచున్న వివాహములు శాస్త్రసమ్మతములుగ లేవు

ఎందుకన! 5 దినముల కలాపము కన్యాదాతయొక్క గృహమందే జరుగుచున్నది. ఇది శాస్త్రదూషితము కాదా?

ఆర్యుడు:—

నాయనా? నీవడిగినది బాగుగనున్నది. ఇక శాస్త్ర మర్యాదవినుము. శాస్త్రము రెండువిధములుగ నుండును. అందుకొంతభాగము మానవసౌకర్య రూపముగను - మఱి కొంతభాగము నిర్బంధరూపముగను కలదు. నిర్బంధవిధిప్రకారము నడువనియెడల రౌరవాదినరకములు సంభవించునని తెల్పుచుండును. సౌకర్యవిధిలో నట్లుండదు. అట్టిసమయములలో మనపూర్వులు తమసౌకర్యముల ననుసరించి యెటులనో కర్మనుమాత్రము వదలక నెరవేర్చుచుండిరి. నిర్బంధవిధులను మార్పజాలక శాస్త్రప్రకారము చేయుచుండిరి.

ఒక దృష్టాంతమును జూడుము.

ఇంటియందున్నకన్య పెండ్లికాకమునుపు రజస్వలయైనయెడల

"త్రయస్తే నరకంయాంతి దృష్ట్వాకన్యాం రజస్వలాం"

(పరాశరః)

కన్యయొక్క అన్నగారు తల్లిదండ్రులు—ఈముగ్గురు నరకమును పొందెదరని కలదు.

ఈవిధి రజస్వలయగుటకు పూర్వమే కన్యకు పెండ్లి సేయవలెనని నిర్బంధింపుచున్నది. అటుల చేయనియెడల నరక భయమునుచూపెను. కావున దీని నతిక్రమింప మానవున కెంత

మాత్ర మధికారము లేదు. వివాహసూత్రములలో ప్రథమదివసమున జేయదగిన కృత్యములు కన్యయొక్క పుట్టింటను తదితరకృత్యములు పతిగృహమునను జరుగవలెనని సామాన్యముగ తెలుపబడెను. అటుగాక వ్యత్యాసము జరిగినయెడల ఘోరనరకమని వచింపలేదు. అందువలన కొన్ని యిబ్బందులు గల్గినపుడు సౌకర్యార్థము మిగిలిన నాల్గుదినములకృత్యము కన్యయొక్క పితృగృహమున జరిగినను దోషములేదని మన పూర్వులు నిశ్చయించిరి.

అనార్యుడు:—

తాముచెప్పినది న్యాయమే. కాని వివాహమైన యాడపిల్లలు బాల్యమునుండి అత్తవారింట నుండనియెడల పతిసేవ లభించుటెట్లు?

ఆర్యుడు:—

నాయనా! పురుషులకును స్త్రీలకును కావలసినంత భేదముగలదు. పురుషుడు దేశమునురక్షింపవలెను. స్త్రీ-గృహమును కాపాడవలెను. దేశము విశాలమైనది. గృహము స్వల్పమైనది. బహుజనులతో కలసిమెలసి వర్తించి లోకజ్ఞానమును బడసినగాని పురుషధర్మము నెఱవేరదు. అందువలన విశేషముగ విద్యనార్జించుటకై వివిధదేశములు తిరుగవలెను. స్త్రీలకట్లకాదు. సత్సంతానము కనుటకును - వారిని పోషించుటకును - తనకుటుంబమున కారోగ్యము గల్గించునాహారాదుల గల్పించుటకును - అతిథిసత్కారాదులొనర్చుటకును - తగిన విద్యయున్న చాలును. ఆస్వల్పవిద్య-తల్లిదండ్రుల గృహమున సయితము సాధింపసగును. అయితే పతిసేవయొనర్చు

టకు కొంతయాటంకము గల్గుననుటనిజమే. అయినను-కొంత వఱకు పతిసేవావిధానమందు కూడ పరిచయము పొంద వచ్చును. ఎట్లన ! అత్తవారింటి యాచారములను గ్రహించిన తల్లిదండ్రులు బిడ్డలకాపద్ధతుల గఱపుదురు. అంతియేగాక ప్రతివత్సరమున పండుగలనియు - ఉత్సవములనియు - కార్య ములనియు-ఏదేనియొక పేరుపెట్టి కన్యయొక్క తల్లిదండ్రులు అల్లుని తమయింటికితీసికొని వచ్చుచుందురు. ఈవిధముగ నాబాలిక భర్తృభావముల గ్రహింపగల్గును. అత్తవారు నై తము నైవిధముగ కోడలిని తమయింటికి తీసికొనివెళ్లుదురు. అపుడు అత్తమామలు "నీభర్తగుణము లివిసుమా" యని హెచ్చరింతురు. ఈ రాకపోకలవలన భర్తయొక్క ఆహార వ్యవహారములన్నియు బాల్యమునుండియే గ్రహింప వీలగును.

అనార్యుడు:—

వివాహమైనదిమొదలు స్త్రీలు పతియింట వసింపుచు నతనిని సేవించుట యోగ్యమని తాము సెలవిచ్చితిరి. పతిసేవ పూర్తిగ నెరవేరవలెనన్న బాల్యవివాహముకంటె యువతీ వివాహములు యోగ్యములని తెలియుచున్నది. ఎందుకన ! బాల్యమున పెండ్లిజేసి వెంటనే తమపిల్లను పతిగృహమునకు పంపి తల్లిదండ్రులుండలేరు. ఆబిడ్డయు వారినివిడిచి వెళ్లజా లదు. ఒకవేళ పుట్టింటనే యుంచుకొన్నయెడల రాకపోక లెన్నియున్నను నాబిడ్డ పతివిషయమై తగినంతసేవజేయుటకు వీలుపడదు. సమర్తాడినపిమ్మట వివాహమైనయెడల శక్తి వంచనలేక నతనిసేవింపవచ్చును. ఇందువలన యువతీవివాహ ములు శ్రేష్ఠములుగావా ?

ఆర్యుడు:—

మిత్రమా! నీవుచెప్పినది యుక్తముగనున్నట్లు తోచును. కాని ప్రకృతివిరుద్ధము. అది యెటులనో వినుము. హిందూమతమున పతివ్రతాధర్మమెంతయో ముఖ్యమైయున్నది. పతివ్రతలనగా పతిని సేవించువారని మాత్రమే భావింపరాదు. పతియొక్క భావములను—ఆచారమును—ఆహారమును—వ్యవహారమును—సయితమనుసరింపవలెను. ఇట్టి పాతివ్రత్యధర్మము నభ్యసించుటకు 16–18 సంవత్సరముల యీడుగల స్త్రీలకు సాధ్యమా? బాల్యమందలవడిన యాహారవ్యవహారములు జీవితాంతమువరకు మారవని లోకానుభవము తెలుపుచున్నదే? పండితులుసయితము బాల్యమందభ్యసించిన నశ్యము—పట్టి (పొగాకు) చుట్ట—కాఫీ—క్రాపింగ్ మొదలగు దురాచారముల విడువకున్నారు. అవిచెడ్డవని తెలియవా? నశ్యము మానరాదాయని యడిగితిమేని బాల్యమున నభ్యాసమయ్యెనని వచింతురు.

"Habit is the second nature."

ప్రకృతికంటె నభ్యాసము బలవత్తరమైనదని యాంగ్లేయ సామెతకలదు. జనించినది మొదలు—ఎనిమిదవ వత్సరమున మనస్తత్వమునకు వికాసముగల్గును. కనుకనే స్త్రీలకు బాల్యమున పెండ్లిచేసితిమేని ఆసమయమున నెయ్యది నేర్పిన నయ్యది ప్రకృతిగ నేర్పడి జీవితాంతమువరకామెను విడువదు. "హెర్బర్టుస్పెన్సర్" అను పాశ్చాత్య పండితుడు రచించిన "రేషనేల్ ఆఫ్ ఎర్లి మ్యారేజి" అను గ్రంథమున

Life is said to be divisible into seven year period. Huxley points out that the whole material of the body is renewed in this period. Generally conciousness begins to build the individual world in the beginning of the second period.

పుట్టినది మొదలు ౭ వత్సరములు దాటగనే మనస్సునకు నూతన వికాసము కల్గునని నుడివేను. కావున నాయీడులో బాలికకు పెండ్లి జేయుట యుక్తము. అటుగాక యౌవనానంతరము పెండ్లియైనచో నటుల వర్తించుట కల్ల.

ఎందుకన! అదివరకే బాల్యమున కొన్ని పద్ధతులలవడియుండును. పిమ్మట వాటెని మార్పజాలరు. అప్పుడు పతియొక్క నడకలకును-సతియొక్క పద్ధతులకును-జోడు కుదురదు. అందువలన పతివ్రతలుగ నుండదలతురేని సమర్తాడిన పిమ్మట పెండ్లాడదలచిన స్త్రీలు స్వల్పమైనను పతిసేవ యొనర్చుటకు వీలులేదు.

అనార్యుడు:—

అయ్యా! వధూవరుల జాతకములజూచి పెండ్లిజేసిన యెడల వారిరువురి ప్రకృతులొక్కటిగ నుండుననియు అందువలన పరస్పరానుకూల్య మేర్పడుననియు, నిదివరకు సెలవిచ్చితిరి. ఆవిధముగ స్త్రీపురుషుల జాతకములను పరీక్షించి పెండ్లిచేయు నెడల పాతివ్రత్య ధర్మమనుష్ఠించుట కభ్యంతరముండదు. వారి గ్రహమైత్రి యనుకూలముగ నుండనేని బాల్యమునుండి భర్త ననుసరించి వర్తింపవలసిన పనియేమి?

ఆర్యుడు:—

మిత్రమా! స్త్రీపురుషులజాతకములు— ఒకే స్వభావమును గల్గియున్నయెడల నాదంపతుల హృదయములు కలియుట కవకాశముండునని తెలియజేయుటకు మాత్రమే అవియుపయోగించును. అంతియేగాని తగిన సాధన సామగ్రి లేకున్నను వారితత్త్వములు కలసితీరవలెనను నియమము లేదు. ఇందుకొక దృష్టాంతము వినుము.

చైత్ర వైశాఖమాసములలో నెండ లతిశయించునని ప్రకృతిమాత బోధింపుచున్నది. ఇట్లుండ నొక పురుషుడు వచ్చి రాబోవువేసంగిలో నెండబాధ యధికమగుననియు నాతాపమును భరించుట దుర్లభమనియు పసిపిల్లలు మరణింతురనియు తెలిపెను. దీనిభావమేమి? ఎండకాలమున మానవులు సూర్యతాపమును భరింపజాలక మాడవలసినదని యర్థమా? కాదు. ఎండచే బాధపడుటయో- మరణించుటయో జరుగుట కవకాశమున్నది. అంతమాత్రమున దానిని తప్పించుకొన వీలులేదని తలపరాదు.

ముందుగ జాగ్రతపడి విశేష ధనమార్జించి కదలక కూర్చుండునట్టి వసతు లేర్పరచుకొని యొక తోటలో వసించుచు నారెండునెలలు వట్టివేళ్ళ తడకలు- తాటియాకుల పందిరులు- మగ్బుత్తులు- మొదలగు పరికరములతో కాలము గడుపునెడల నాయెండ లేమిచేయును?

అయితే ఎండలు వచ్చుననియు— అందుచే తాపము హెచ్చుననియు చెప్పినది సత్యము కాదా! నిజమైనను దాని

యర్థమది కాదు. అట్టి కష్టములు కల్గుట కవకాశముండెనని యే యభిప్రాయము.

అటులనే జాతకములలో నొక యనుభవము జెప్పబడి నపుడు-అట్టి పరిస్థితికి తగిన సూచనలున్నవని యర్థము జేసి కొనవలెను. ఆ యనుభవము రావలెనని తలంచిన యెడల-అందు కనుకూలమైన కృషి సల్పుచో నది యథావిధిగ రాగలదు. దానిని కొంతవరకు తగ్గించుకొనుటకు యత్నించు నెడల రాదగినంత ఫలమురాక కొంత తగ్గివచ్చును. ప్రకృతి యందలి సూచింపబడు గుర్తులను తగ్గించుటకుగాని హెచ్చించుటకుగాని మానవుడు స్వతంత్రుడై యున్నాడు. పూర్ణముగ తిరస్కరించుటకు మాత్రము సామాన్యులకు శక్తిలేదు. శీత కాలమున నెంతచలిని ప్రకృతిమాత బంపెనో దానినంతయు ననుభవింపవలసినవిధి మనుజునకు లేదు. ఇంటి సౌకర్యముల చేతను-తగిన వస్త్రధారణముచేతను-ఆహార వ్యవహారాది నియమములచేతను-చలిబాధను తగ్గించుకొనవచ్చును. అవివేకులా చలిచే బాధింపబడుదురు. ఇట్లే జాతకములందలి సూచనలకు మన యత్నములు తోడ్పడి తత్ఫలములను హెచ్చుతగ్గులుగ జేయగలవు.

మరియొక యుదాహరణము వినుము.

ఒకచెట్టు-ఇంకొకవృక్షము నాశ్రయించినగాని వృద్ధి జెందదని ప్రకృతియందెట్టి నియమములేదు. అయితే తీగె రూపముననున్న చెట్టు మరియొకవృక్షము ననుసరించి దాని కొమ్మల కెగబ్రాకి వృద్ధిపొందగలదని ప్రకృతినియమము గలదు. లతకును-వృక్షమునకును-కలసిమెలసియుండు మైత్రి

కలదనుట సత్యము. ఈ నియమమందలి రహస్య మెరుంగని యెడల నెంతిలోపము గల్గునో తెలియునా? వినుము. ఒక తీగెను చెట్టున కంటించిన యెడల దానికొమ్మల ననుసరించి నడచుట సహజమని యొకడొక పుస్తకమున జదివెను. అంత ముదిరిన తీగెను తెచ్చి చెట్టున కంటగట్టెను. కాని-అది పెన వేసికొని పెరుగక విడిపోయెను. అందువలన ప్రకృతి సూత్రి మసత్యమగునా? అయితే విడిపోవుటకు హేతువేమి? కలసి మెలసి యుండుటకు తగిన వసతులులేవు. ఆ వసతులెవ్వి? లేతగనున్న తీగెను చెట్లకు కలుపవలెను. ముదిరిన లతలను వృక్షములతో జేర్చిన ప్రయోజనములేదు. మొదటి విష యము తెలిసి రెండవ సంగతి తెలియనందున నెంత చిక్కు గల్గెనో గ్రహింపుము?

ఇదేవిధముగ స్త్రీపురుష జాతకములలో సహజమైన యానుకూల్యమున్నదని యెఱిగినను లేతయీడులోనున్న బాలిక నంటగట్టినపుడే యది పూర్ణముగ సిద్ధించునని తెలియ నగును.

ఒకవేళ గ్రహమైత్రి కలిసియున్నపుడు యువతీ యువ కులకు పెండ్లియైనను కొన్ని సందర్భములలో వారిరువురికి నైక్యము కలుగవచ్చును. కాని యావిధాన మన్ని వేళల నందరికి వర్తింపదు. నూటికొక్కరికి సరిపోవును. అంత మాత్రమున దానిని సర్వసామాన్య నియమముగ నంగీకరింప రాదు.

దీనిచే యువతీయువకులను జతపరచుటకంటె కన్య లను యువకులతో జేర్చుట-సర్వోత్తమమని స్పష్టమైనది.

అనార్యుడు:—

మహాశయా ! లేతయీడులోనున్న ఆడపిల్లలకే పెండ్లి చేయవలెనని నేనుకూడ జెప్పుచున్నాను. అయితే నాకును మీకును-భేదమొకచోటగలదు. చిన్నతనమనగా రజస్వల యగుటకు పూర్వమని మీభావము. 20 వత్సరములవఱకు బాల్యమని నాయూహ. కావున యువతీ వివాహములన్నను బాల్యవివాహములన్నను భేదమెంతమాత్రము లేదు. ఈడు ముదిరినవారిని పెండ్లాడవలెనని యువకులెవ్వరును యత్నింపరు. 16–18 వత్సరముల వయస్సుగల బాలికలనే పెండ్లాడ నెంతురు. ఆయీడు బాల్యముకాదా ? ఇందునుగుఱించి మీయభిప్రాయమేమి ?

ఆర్యుడు:—

ఓయీ ! బాలికావివాహములైనను - యువతీవివాహములైనను - లేత యీడులో జేయబడినవేయని తెలుపుట చిత్రముగనున్నది. నిన్ను తృప్తిపఱచుటకై స్వల్పకాలము దానినంగీకరించెదను. అయితే నీమాటమీద నీవునిలువుము. బాలికయనినను - యువతియనినను.ఒక్కటేయగుచో- బాలికావివాహము లొనర్చువారిని దూషింపనేల ? కన్యావివాహములన్నియు-యువతీ వివాహములేకదా ! యువతులకే పెండ్లిచేయవలయుననియు - బాలికలకు కూడదనియు నిదివఱకు జెప్పితివే ? అపుడు బాలికకును - యువతికిని భేదముండె ననికదా నీభావము. అదిమఱచి నేడు రెండునొక్కటేయనుచుంటివా ? లేతయీడనగ బాల్యమనియు-ముదిరినవయస్సు అనగా యౌవనమనియు నెఱుంగుము.

అనార్యుడు:—

మహాత్మా! నేను పొరబడినమాటనిజము. సమర్తాడుటకు పూర్వము కన్యయనియు పిమ్మట యువతియనియు నుండవచ్చును. పేర్లు వేరుగనుండుగాక - కన్యయనినను - యువతియనినను - లేతయీడుగలదే-యని నాయభిప్రాయము. ఏలనన! పన్నెండేండ్లకో పదునాలుగేండ్లకో స్త్రీలు రజస్వలలగుదురు. ఆయీడునకు లేతదనముపోవునా? అవుననుట యుక్తముగలేదు. ఏమన-వారికి బాల్యదశనశించి ముదురుతనము వచ్చెననియెవరునువిశ్వసింపరు. ఇందుకుమీయభిప్రాయమేమి?

ఆర్యుడు:—

మిత్రమా! నీవుచెప్పినటుల లోకానుభవము ననుసరింతము. పుష్పించిన పిమ్మట లతలను వృక్షముల కంటగట్టరు. అటుల జేసిననేమగును? లతలును - వృక్షములును కలసిమెలసి యుండజాలవు. ఇందుకు హేతువేమి? తీగెలయొక్క-కాడ ముదిరియుండుటయేకదా? పుష్పించుటకు పూర్వము లేలగానుండుటనుబట్టి చెట్లతో పెనవేసికొనగలవు. కాడకు ముదురునట్టి సమయమెప్పుడో తెలిసినదా? పుష్పించిన పిమ్మట లతలన్నియు ముదురుచున్నవని స్పష్టమగుచున్నది. తీగెలందెటుల కాడప్రధానమో లతాంగుల(స్త్రీల)యందును యెముక ముఖ్యమైనది. అచట కాడముదురుటయు నిచట యెముకముదురుటయు సమానములు. ముదురుటకు కారణము పుష్పించుటయని తెలిసినపుడు స్త్రీలయందలియెముక ముదురుటకు హేతువు వారుపుష్పించుటకాదా? కాదందువేని సమర్తాడిన వెంటనే తమబిడ్డ పెద్దపిల్లయైనదని చెప్పుచుందురే?

దానియర్థమేమి ? జ్ఞానముగల్గినదనియా ? కాదు. ఏమన ! ఆబిడ్డకు శాస్త్రజ్ఞానముగాని లోకజ్ఞానముకాని లేదు. అయితే ఆమాట కర్థమేమి ? చిన్నతనము పోయెననియేకదా ? అనగా బాల్యదశ తొలగెనని భావము. సమర్తాడిన వెంటనే బాల్యదశ నశించెనేని లేతదనముపోయి ముదురుతనమువచ్చెనని విశద మగుచున్నది.

కావున సమర్తాడిన స్త్రీలకు పెద్దఱికమువచ్చునేగాని బాల్య దశయుండదు. పుష్పించినది మొదలు బిడ్డతల్లులగుచుండ నిం కనువారు పసిపిల్లలా ? తల్లిని-పిల్లగాతలచుట లోకానుభవ మని వచింపకుము.

అనార్యుడు:—

మహాశయా ! ఒకటి రెండు లోకానుభవములజూపి బాల్యవివాహములను ఋజువుచేయుటచాలదు. మఱియొక దృష్టాంతమును చెప్పగలరా ?

ఆర్యుడు:—

ఓయీ ! ఒకటికాదు. వందలకొలది చెప్పవచ్చును. స్థాలీపులాకన్యాయముగ నొక యుదాహరణమును వినుము.

ఒక గ్రామమున పెండ్లిలో వధూవరులు ఊరేగుచుం డిరి. పల్లకిపైనుండు బొంగునుజూచి యొకడాశ్చర్యమొంది తన స్నేహితునిబిలచి "మిత్రమా యీబొంగు (వెదురు) మన కుపయోగించునటుల నిన్నివంకరలుగ తిరిగెనే ! దానికి జ్ఞాన ముకలదా ?" అని ప్రశ్నించెను

"ఓయీ! నీవు వెఱ్ఱివాడవుగ నున్నావు. మనుజులు తమకిష్టమైనటుల దానిని వంచిరి. ఇతర వృక్షముల నటుల

వంచినను ప్రయోజనములేదు. ఏమన ! ఎటులవంచిన నటుల వంగునట్టి స్వభావమాబొంగునకేగలదు. ఇది ప్రకృతిసిద్ధము. కావున పల్లకికి తగినటుల దానిని వంచుచుండిరని యతఁడు ప్రత్యుత్తరమిచ్చెను. ఈ రహస్యమును గ్రహించి యావెట్టివాఁడడవికేగి బొంగులున్నచోట నిలువబడి యెటులనో కష్టించి యొకబొంగును వంచెను. కాని తలచినటుల వంగకుండెను. మఱియొకదానిని వంచుటకు యత్నించెను. అటుల నెన్నియో వెదురుగడలను క్రిందికి లాగియు నిష్ఫలుఁడయ్యెను. అంత తనమిత్రుని సమీపించి వెదురునందు స్వభావసిద్ధముగ వంగునట్టి గుణముండుట నిజమేని యెన్నిబొంగులను వంచినను పల్లకియొక్క బొంగువలె రాకుండుటకు హేతువెద్దియని యడిగెను. అంత నాయమాయకునిఁజూచి "ఓయీ! ప్రకృతియందొక స్వభావమున్నను అది ప్రకాశించుటకు మరికొన్ని ప్రకృతిధర్మములు సాయపడవలెనను నియమముగలదు. అది వినుము.

సూర్యతాపము ఎండకాలమున భరింపరానిదని గుంటూరు మండలవాసి-మైసూరు దేశస్థునితో ననెను. అందు కాతఁ డంగీకరింపఁడయ్యె. ఏమన! ఎండకాలములో వారిదేశమున వేడిమిలేదు. అయితే సూర్యుఁడులేఁడా? ఉండెను. అతని స్వభావసిద్ధమగు గుణము గుంటూరునందొక విధము గను-మైసూరునందు వేరుగనుండునా? ఉండదు.

ఇక నారెండు దేశములలో నెండల తారతమ్యముండుటకు హేతువేమి? గుంటూరు దేశమందలి ప్రకృతిధర్మము మైసూరునందలి ప్రకృతిధర్మము-భిన్నముగ నుండెను. ఎట్లన-

గుంటూరుకంటె మైసూరు మెత్తగనున్నది. ఎత్తైన ప్రదేశ ములందు సూర్యరశ్మి తనవేడిమిని చూపజాలదు. కావున నొకవస్తువుయొక్క-గుణము ప్రకాశించుటకు సైతము-ఇతర సంపత్తియు తోడ్పడవలెనని తెలియుచున్నది.

రాత్రి చీకటియుండునని యొకడనెను- దానినివిని యొక యమాయకుడు పౌర్ణమినాడు చూడతలచెను. కాని చీకటి లేదు. వెన్నెలయుండెను. రాత్రియందు చీకటియుండుట స్వభావమైనను చంద్రుడులేనపుడే గోచరించునని యతడెఱు గడు. మిట్టభూములు లేనపుడు సూర్యప్రకాశము తీక్ష్ణముగ నుండుననియు - చంద్రుడు లేనపుడు రాత్రియందలి చీకటి విశేషముగ రాణించుననియు - ముదురుతనము లేనపుడు బొంగులకు వంగునట్టి స్వభావముండుననియు బుద్ధిమంతులకు తెలియును.

కావున లేతగనున్న బొంగులనే వంచుటకు యత్నిం చునట్లు జాతకములు కలిసియున్నను లేతయీడులో - అనగా సమర్తాడకమునుపే స్త్రీలకు వివాహము లొనర్చినయెడల పతుల ననుసరింపగలరని తెలియుచున్నది.

అనార్యుడు:—

మహాశయా ! స్త్రీలు పురుషులకులోబడి యుండవలె ననితలచి బాల్యవివాహముల సమర్థించితిరి. అందుకై చిన్న తనమునుండి పతియొక్క-యాహార వ్యవహారములననుసరించి నడువవలెనని విధులు నిర్ణయింపబడెను.

ఒక పురుషుడు ఉద్యోగమపేక్షించె ననుకొనుడు. ఎటు లనో నొక యధికారినాశ్రయించి యతనికడ నౌకరికి

కుదిరెను. అదిమొదలు యజమానుని భావముల ననుసరించి వర్తించుచుండ లేదా? అటులెందరో తమ జీవితాంతమువరకు లోబడి నడుచుచున్నారు. "బాల్యమునుండి యొకనిభావము ననుసరించి వర్తించుటకు నేర్చుకొన్ననేగాని యువకుడై నపుడు వాని ననుసరింపజాలడు. ఈ సిద్ధాంతము అనుభవ విరుద్ధమగుచున్నది. ఎట్లన నిరువదేండ్లు దాటిన యువకులెందరో యీడుముదిరియు, నొక యధికారి ననుసరించి కాలయాపన మొనర్చుచున్నారు. అటులనే యువతులు సైతము తమకుతగిన పురుషుల వరించి జీవయాత్ర గడుపగలరు. కావున యువతీ వివాహములలో నష్టమేమి?

ఆర్యుడు:—

మిత్రమా! నీబుద్ధి మెచ్చదగినది. కాని యింకను సూక్ష్మముగ నాలోచించితివేని సత్యము తెలియగలదు.

ఒకడొకనియొద్ద నౌకరిగ కుదిరి యతనికి లోబడి వర్తించుటకు మొదలిడినను ఆబంధము సర్వసమర్పణరూపముగ నుండదు. ఏమన! అధికారియొక్క కార్యము లెవ్వియో వానిని నెరవేర్చుట యసాధ్యమైన పనికాదు. దానిని కొన్ని గంటలలో ముగించి యితర సమయమున నాబాధల నుండి తప్పించుకొని స్వేచ్ఛాచారుడై యుండగలడు. అతనితో మనసు కలియదేని నౌకరి మానుకొనును. భారతదేశమందలి స్త్రీ వివాహములను అట్టి నౌకరీలవలె భావింపరాదు. సేవకుడు తన యజమానికి నష్టము కలిగించిన యెడల నతని వెడలించి మాన్పింపవచ్చును. స్త్రీలన్ననో-పతిసమీపమున నుండవల

చియు సమయమువచ్చెనేని వారిని ధిక్కరించి మాట్లాడుదురు.

వారికి భర్తలపై సర్వస్వాతంత్ర్యము కలదు. ఒకపుడు పతిని-ప్రభువుగను-వేరొకసమయమున మిత్రునిగను-మరియొక కాలమున దేవునిగను-పూజించుటయేగాక ఇంకొకవేళ కీలుబొమ్మవలె నాడింతురు. భృత్యుడు తనకిష్టములేనియెడల యజమానుని విడిచినట్లు, స్త్రీలు తమపతుల విడువజాలరు. ఇంతియేకాదు. పునర్జన్మమునసైత మతని సేవరింతురు. విడిపోని యీబంధమును దృఢముగ నిలువబెట్టవలెనన్న నెంత కష్టపడవలెనో యోచింపుము. అధికారి తినునట్టి వస్తువులనే సేవకుడు తినవలెనని నియమములేదు. మరియు సతిని సాంప్రదాయముల ననుసరింపపనిలేదు. స్త్రీలన్ననో అట్టుల కాదు. భర్త కెయ్యది యిష్టమో * దానినే భుజింపవలెను. అతని యాచారములనే పాటింపవలెను. ఈపద్ధతి బాల్యవివాహమునగాని లభింపదు. ఒకని కుటుంబమునజేరి యతనికై తనజీవితమును ధారవోయదలచు స్త్రీగాని-పురుషుడుగాని బాల్యముననే యాకుటుంబమునకు దత్తము కావలెను. అనగా దానము చేయబడవలెను. ఒక కుటుంబమునకొక కన్యను దానముచేయుట చూచుచున్నాము. కాని పురుషుడు వేరొక కుటుంబమునకు దత్తమగుట కలదాయని సంశయము గలుగవచ్చును.

---

* స్త్రీ పురుషుల పుట్టినట్లును-వారి [illegible] యుండ-పురుషుని కిష్టమైనదానిని స్త్రీ భుజించుటెట్లు ? దీనికి [illegible] గ్రంథములలో జవాబుకలదు.

ఒకవంశమున బిడ్డలు లేనియెడల నొకడు దత్తుడగును. అనగా పెంచుకొనబడును. ఆదత్తుడు జీవితాంతమువరకు ధారవోయబడెను. మధ్యకాలమున నాకుటుంబమున తన కెన్ని బాధలు గల్గినను వారిని విడువకూడదు. ఈ పెంపుడు బాల్యముననే జరుగును. ఎందుకన! ఎముకముదిరినచో వాని భావములు మరియొక కుటుంబముతో పూర్తిగ కలియజాలవు.

మరియొక సూక్ష్మవిషయముగలదు. పెంపుడుబిడ్డలు పూర్తిగ తమ యధీనమగుటకై యేమిచేయుదురో తెలియునా? ఏడెనిమిది వత్సరముల వయస్సుగలవారిని పెంచుకొనుటకంటె నొకటి రెండేండ్లవయస్సులోనే తమయింటికి తెచ్చుకొందురు. ఈ హేతువువలన మనస్సు కలియుటకు బాల్యమే యుక్తమైనదని తెలియుచున్నది. కావున పురుషదానమువలె కన్యాదానము సైతము చిన్నతనమున జరుగుటయే ప్రశస్తము.

అనార్యుడు:—అయ్యా! బాల్యవివాహములు శ్రేష్ఠములుగనున్నను అందొక నష్టముకలదు. ఏమన—గర్భాధానమునకు పూర్వముగాని—అటుపై నొకటిరెండు వత్సరములలోగాని భర్త మరణించినయెడల వైధవ్యము గల్గును. ఇక వారి యౌవనమెటుల గడచును. అందువలన యువతీ వివాహములు మేలుకావా?

ఆర్యుడు:—మిత్రమా! యువతియైన పిమ్మట పెండ్లాడినను వెంటనే భర్త మరణింపవచ్చును. అప్పుడు యౌవనమునకు గతియున్నదా? అదియే బాలవితంతువునకు మార్గము. కా[illegible]యము శ్లాఘ్యమని నీప్రశ్నవలన తెలియుచున్నది.

దానిని కాదనువారుండరు. యువతీ వివాహ సాంప్రదాయము దేశమున వ్యాపించిన యెడల కలుగునష్టమును బరికింతము. స్త్రీలు తమకుతగిన పురుషుడు లభింపలేదనితలచి వివాహమునకై త్వరపడక ముప్పది నలుబదేండ్లుగడచినను పెండ్లాడకుందురు. అంతవరకు వారి కామమునకు గతియేమో తెలిసికొనుము. కామమును జయించి శుద్ధముగ నుందురని వచింతువేని బాలవితంతువులు సైతము తమ యౌవనమును నీతిమార్గమున నడుపగలరు.

వివాహములులేని యువతీమణులు-ఉప్పు-పులుపు-కారము తినుచు వేషధారిణులై నలుగురిలో తిరుగుచుండుటచే నీతిగనుండజాలరు. ఇరువది ముప్పదేండ్లువచ్చినను బాలవితంతువులు (విధవలు) బాల్యమునుండి ధర్మమును విశ్వసింతురేని ఉప్పు-పులుపు-కారములనువిడచి బ్రహ్మచర్యమున వర్తించి కామమును జయించి నడియీడుగల వితంతువులవలె-నక్రమ పద్ధతులకు దిగరు.

అనార్యుడు:—

మహాశయా! ఇక్కాలపు వితంతువులు తాము చెప్పినటుల నాహార నియమమునలేరు. కావున వారు శుద్ధముగనుండరు. ఈ దోషమునుండి తప్పించుటెట్లు?

ఆర్యుడు:—

మిత్రమా! ఏసంఘమైనను ధర్మము నతిక్రమించి నడచినయెడల సంఘస్థులెల్లరుగలసి సభలొనర్చి తగిన కట్టుదిట్టములు జేయవలెను. ఇంతవరకావని మనదేశమున జరిగి

యుండలేదు. ఇది మహాపాతక మనవచ్చును. భారతీయుల బుద్ధి క్షీణించినదనిన దోషముకాదు. ఇట్టి యధమాధములు మన మతమందుండుటచేతనే దేశమునకీగతి పట్టినది. చూచిన వారెల్లరు సంస్కరణ మొనర్పని యీకుటుంభరులను హేళన మొనర్చుచున్నారు. ధర్మబద్ధమగు సంస్కరణ మొనర్పనిజాతి బ్రతికియు చచ్చియు నొక్కటే. ధీరులగు పురుషులుందురేని వితంతువులను ధర్మమార్గమున నడిపించక విడుతురా ?

ఏనాడు సంస్కరణమునకై భారతీయులు ముందంజవేయుదురో ఆదినమే సుదినము. సంఘసంస్కారులమని పేరు పెట్టుకొని ప్రపంచరంగమున విహరించు నాయకులు వితంతువులకై సాత్వికాహార పద్ధతులతో నడిపించు నాశ్రమముల స్థాపించి జీవితాంతమువరకు బ్రహ్మచర్యము ననుష్ఠింప జేయుటకు యత్నింతురుగాక.

అనార్యుడు:—

మహాత్మా! యువతీ వివాహములు వాడుకయందుండెనేని ముప్పదేండ్లవరకు స్త్రీలు పెండ్లాడరని వచించితిరి. ఇది ప్రకృతి విరుద్ధమైయున్నది. ఎందుకన! సమర్తాడినది మొదలు నాటికి పురుషవాంఛ కలుగును. ఎప్పుడు కామ మతిశయించునో అప్పుడు తగినవానిని వరించును.

మన దేశమున నెందరో యువతులీవిధముగ పెండ్లాడిరి. కావున ముప్పదేండ్లవరకు పెండ్లాడరని చెప్పుట యోగ్యమా?

ఆర్యుడు:—

ఓయీ! నీవు పల్కినది యనుభవములేనిమాట. మన

దేశమున యువతులు పెండ్లాడినను వారు పై దుర్దశకు రాని కారణము వినుము. హిందూమతమున బాల్యవివాహములు శ్రేష్ఠములని యెల్ల రెఱుంగుదురు. కన్యావివాహముల కున్న గౌరవము యువతీ వివాహములకు లేదు. అపుడపుడు స్వేచ్ఛాచారులు బయల్వెడలి అచ్చటచ్చట యువతీవివాహముల లేవనెత్తిరి. సూర్య ప్రకాశమున దీపమెటుల కాంతిహీనమైయుండునో-అటులనే బాల్యవివాహ ప్రభావమున యువతీ వివాహములు స్వేచ్ఛగ తలఎత్తి విహరింపకున్నవి.

మఱియు బాల్యవివాహ సాంప్రదాయముల తృణీకరింపజాలక లోబడి వర్తించుచున్నవి. ఆ పెండ్లిండ్లవలన నేత -దురవస్థ రావలెనో అది వచ్చుటకు వీలులేక నివురుగప్పిన నిప్పువలె నణగియున్నది. "శారదాబిల్లు" మొదలగు శాసనములు విజృంభించి యాచరణమునకు వచ్చెనేని యపుడు ముప్పదియేండ్లకైనను స్త్రీలు పెండ్లాడరు. నిదర్శనముకై పెద్దపిల్లల పెండ్లిండ్లు నిర్భయముగ వ్యాపించియున్న దేశముల లోని యనుభవముల జూడుము.

In 1908 there were in France 1,350000 unmarried men over 30 years of age and a some what larger number of unmarried women. There were 1804710 families without children.

SPEECH BY N. KLOTZ FRENCH
Minister of Finance.
("Hindu" 20-12-1912)

ఫ్రెంచి దేశములో 1908 వ సంవత్సరమున పురుషులకు 30 ఏండ్లు వచ్చువరకు పెండ్లిండ్లు లేవు. అట్టివారు 13 లక్షల 50 వేలమంది కలరు. ఆయీడుగల స్త్రీలు సైతము పురుషుల

కంటె నెక్కువగ నున్నారు. పెండ్లాడినవారున్నను బిడ్డలను కనునెడల యౌవనముతగ్గుననియు కామసుఖమునకు భంగము గల్గుననియు తలచి పురుషులను బొందుచు సంతతి కలుగకుండుటకై యనేక పద్ధతుల నవలంబించుచున్నారు. అట్టి గృహములు 18 లక్షల 4 వేల 710 యుండెను.

క్లాట్సు-దొర
ఫ్రెంచి ఆర్థికమంత్రి
("హిందూ" 20-12-1912)

దీనింబట్టి యువతీ వివాహములవలన స్త్రీలకు స్వేచ్ఛ ఏర్పడి దేశాభివృద్ధికి మూలమగు గృహస్థధర్మము నశించునని తెలియుచున్నది. మరియు కేవల కామసుఖ ప్రధానులై జీవహింసా పాతకమునైనను లెక్కింపక గర్భస్రావము లొనర్చుచు వివాహములతో నిమిత్తములేక యే వ్యభిచార వృత్తినో మరగి దేశనాశనమునకు మార్గదర్శులు కాగలరు.

అనార్యుడు:—

మహాశయా! స్త్రీలు ముప్పదేండ్లు దాటువరకు పెండ్లాడరని విదేశానుభవము జూపితిరి. ఆలోపల వారు వ్యభిచరించిరని మీవాక్యములలో లేదు.

ఆటుల వ్యభిచరించిరని ప్రమాణములు జూపగలరా?

ఆర్యుడు:—

మిత్రమా! ఎన్నియో చూపవచ్చును. అమెరికాదేశమున జ్యువెనైల్ కోర్టులో జడ్జిగనుండి "రివోల్ట్ ఆఫ యూత్" అను గ్రంథమును రచించిన లిండ్సే దొరగారి వాక్యములు వినుము.

There are at least 50000 girls in New York living with men who are not their husbands, girls who should have become mothers but don't care to have children.

"JUDGE LIDSEY"
"Revolt of youth"

న్యూయార్కు పట్టణమున 50 వేలమంది పెండ్లికాని స్త్రీలు పరపురుషులతో సంచరించుచుండిరి. మరియు సంతతి కలుగకుండుటకై కొన్ని యుపాయముల కనిపెట్టిరి.

అని వ్రాసియున్నాడు. ఒకొక్క పట్టణముననే వేల కొలది స్త్రీలు విద్యావతులయ్యు నిట్టి యక్రమచర్యలను చేయుచుండ మొత్తముమీద విదేశములందెంత యవినీతి వ్యాపించినదో వేరుగ తెలుపవలెనా? ఇందుకు కారణము యువతీ వివాహము లేకదా! బుద్ధిమంతుల కింతకంటె చెప్ప వలసినది లేదు. మానవజాతియొక్క గొప్పతనమునకు మూల కారణము బాల్యవివాహము లేయని యెఱుంగుము.

సంపూర్ణము.

☞ దీనిపిమ్మట వెలువడు పుస్తకమును ప్రతివారు హొందవుడు తప్పక చూడవలెను. యువతీవివాహములు వ్యాపించియున్న దేశములలోని సుంష గములన్నియు నింగ్లీషువారిచే రచింపబడిన గ్రంథములనుండి యెత్తి చూపబడును. దానిని చదివినపిమ్మట స్త్రీపురుషులెల్లరు యువతీ వివాహములు పనికిరావని నిశ్చయించుకొనగలరు. మఱియు కన్యా వివాహములే చేయవలెనని వేదములనుండిగూడా చూపబడును.

---

# హిందూమత గ్రంథమాలా

## విరాళముల వివరములు

మహారాజాధిరాజపోషకులు రూ. 116-0-0 మొదలుకొని మనసోత్సాహముకొలది.

| | | |
|---|---|---|
| మహారాజపోషకులు | సం॥ ౧కి రు | 25-0-0 |
| రాజపోషకులు | ,, | 10-0-0 |
| పోషకులు | ,, | 5-0-0 |
| సహాయకులు | ,, | 3-0-0 |
| అభిమానులు | ,, | 2-0-0 |

## చందా వివరము

సంవత్సరం చందా

| | | | |
|---|---|---|---|
| పోస్టుతో సహా | ,, | 1-5-0 | (బ్రిటిష్) |
| ,, | ,, | 1-4-0 | (నైజాం) |

☞ బ్రిటిషిండియాలో బుక్కుపోస్టు చార్జి రు. 0-0-3 లు హెచ్చినందున 12 నెలలకుగాను రు. 0-3-0 లు పెంచవలసి [illegible]

ఈ పుస్తకములు వలయువారు

మేనేజరు:—

### హిందూమత గ్రంథమాల

శికందరాబాదు (దక్కను)

అని వ్రాయవలెను.

☞ గ్రంథమాలా సభ్యులుగ చేరదలచినవారు తమ పేరు, పోస్టు, [illegible] స్పష్టాక్షరములతో వ్రాయవలెను.

# రాబోవు గ్రంథములు

—:—

షట్చక్రముల కధిపతివి కాదలంచితివా ?

గృహరాజ్యమును వశపరచుకొని

తక్కిన అయిదు రాజ్యముల నార్జింపుము.

అవి యెవ్వి ?

౧ దేహ రాజ్యము        ౨ దేవ రాజ్యము

౩ దేశ రాజ్యము

౪ ధర్మ రాజ్యము        ౫ మోక్ష రాజ్యము

ఈ రాజ్యము లన్నిటిని పరిపాలించు విధానమును

తేటతెల్లముగ దెలియజేయు

## హిందూ మత గ్రన్థమాలా

కుసుమముల సేకరింపుము.

హిందూ మత గ్రంథమాల

ఉపన్యాస చక్రవర్తి
ప్రభాకర పండిట్ గారి ఉపన్యాసములు.

# Home Rule

# గృహరాజ్యము




7 వ భాగము

7 వ పుష్పము.

వెల
0-1 0



—♦ నమస్తే ♦—

హిందూమత గ్రంథమాల. ౭ వ పుష్పము.

హిందూమత ప్రచారక, ఉపన్యాస చక్రవర్తి

బ్రహ్మశ్రీ ప్రభాకర ఉమామహేశ్వర పండితులవారి

ఉపన్యాసములు

# గృహారాజ్యము.

( 7 వ భాగము.)




విశ్వేశ్వరశాస్త్రి

కొండా శంకరయ్యగారి ప్రీమియర్ ముద్రాక్షరశాల,

సికింద్రాబాద్.

# హిందూ మత గ్రంథమాలా

## విరాళముల వివరములు

మహారాజాధిరాజపోషకులు రూ. 116-0-0 మొదలుకొని మనసోత్సాహముకొలది.

| | | |
|---|---|---|
| మహారాజపోషకులు | సం॥ నకి రు | 25-0-0 |
| రాజపోషకులు | ,, | 10-0-0 |
| పోషకులు | ,, | 5-0-0 |
| సహాయకులు | ,, | 3-0-0 |
| అభిమానులు | ,, | 2-0-0 |

## చందా వివరము

సంవత్సరం చందా

| | | | |
|---|---|---|---|
| పోస్టుతో సహా | ,, | 1-5-0 | (బ్రిటిషు) |
| ,, | ,, | 1-4-0 | (నైజాం) |

☞ బ్రిటిషులో బుక్కుపోస్టు చార్జి రు. 0-0-3 లు హెచ్చినందున 12 నెలలకుగాను రు. 0-3-0 లు పెంచడమైనది.

ఈ పుస్తకములు వలయువారు

మేనేజరు:—

## హిందూ మత గ్రంథమాల

శికిందాబాదు (దక్కన్)

అని వ్రాయవలెను.

---

☞ గ్రంథమాలా సభ్యులుగ నుండదలచినవారు తమ పేరు, పోస్టు, తాలూకా, జిల్లాను విడివిడి అక్షరములతో వ్రాయవలెను.

# గృహరాజ్యము.

—:O:—

## ( 7 వ భాగము )

---

### ( 66 వ ప్రశ్న )

అనార్యుడు:-

మహాత్మా! ఇతరదేశములలో బాల్యవివాహములు లేనందున స్త్రీలు సమర్తాడినపిమ్మట పెండ్లాడుదురనుట సత్యము. అందువలన వారిలో పెండ్లికాకముందే వ్యభిచారము ప్రారంభమగుగాక. అయితే ఆదేశమునకును-మనదేశమునకును-ఎంతయో తారతమ్యముకలదు. కావున నచ్చటి స్త్రీలవలె నీదేశపుయువతులు వ్యభిచరింపరు. ఇక యువతీవివాహములవలన నష్టమేమి?

ఆర్యుడు:-

మిత్రమా! ఇంగ్లీషుభాషలో నాటితేటి "ఋగ్వేదిక్ కల్చర్" అను నొక గ్రంథమును రచించిన ఎ. సి. దాసు. అను నొకభారతీయ పండితుని వాక్యములువినుము.

As her marriage was contingent on her selection it was not unlikely that failing to make a selection, remained unmarried. But a spinster was not a desirable member of the family not only on economic but also on moral grounds for she stood the risk of going astray. Propably it was from

considerations like these that parents and brothers gradually become anxious to see a girl married before she could exercise her own judgement, which probably ultimately led to the custom of infant marriage."

Rig. Vedic Culture
by A. C. DAS.
250 Page.

పూర్వకాలమున భారతదేశములో స్త్రీలు తమంతట తామే పతుల వరించుచుండిరి. అందువలన కొందఱుయువతులు పుట్టింటియందలిప్రేమచే వారిని విడువలేక పరగ్రామమందలి యొకపురుషుని వరించుట కిష్టపడకుండిరి. అట్టిసమయమున పుత్రులతోబాటు కుమార్తెలనుగూడ పోషించుట తల్లిదండ్రులకు కష్టమయ్యెను. మఱియు,

ఈడువచ్చినపిల్లల-నింటియం దుంచుకొనుటచే వారు అక్రమమార్గమున ప్రవర్తించుచుండిరి. అందువలన తలిదండ్రులకు పుత్రికలందు అసహ్యము కల్గుచుండెను.

ఈ యనుభవముచే విసిగిన భారతీయులు బాల్యవివాహము లొనర్చుట మేలని తలంచి యదిమొదలు చిన్నతనముననే పెండ్లిండ్లుచేయుటకు మొదలిడిరి. ఇది నాయభిప్రాయము. అని దాసుగారు నుడివిరి.

వీరు సంఘసంస్కార పరాయణులు. కావున పూర్వకాలమున యువతీవివాహములు కలవని యభిప్రాయపడిరి.

వారికి వేదశాస్త్ర పరిచయము లేదు. అందువలన నటులనుడువుటలో దోషముండదు. కాని వారిలోకానుభవ విషయమును గుఱించి తిరస్కరింపజాలము.

ఎందుకన! వారిదేశమున నెచ్చట యువతీవివాహము లున్నవో అచ్చట పెండ్లికిపూర్వము స్త్రీలు వ్యభిచరించుటను జూచి యున్నారు. దానింబట్టి పూర్వకాలమున సైతము యువతీ వివాహములుండెననియు అందు వ్యభిచారమేర్పడె ననియు గ్రహించి యటుల జెప్పిరి. కావున నేదేశమందైనను యువతీ వివాహములవలన వ్యభిచారములు ప్రబలుననుట స్పష్టము.

అనార్యుడు:-

అయ్యా! ఇతరదేశములలో పెండ్లియగుటకు పూర్వమే వ్యభిచరించిన స్త్రీలు విద్యాగంధమెఱుంగని మోటువారై యుందురు. స్కూల్లలో చదువుచున్న యెడల విద్యాసక్తికల వారై దుర్నీతికి పాల్పడరని నాయూహ. అందుకు మీరే మందురు.

ఆర్యుడు:-

ఓయీ! ఇదివరకే యీప్రశ్నకు ప్రత్యుత్తర మొసంగితిని. అయినను ఇతరదేశములలోని స్త్రీలు విద్యావతులయ్యు వ్యభిచరింతురా లేదా యనుసంశయము తీర్చెదను. అందుకై ఆదేశచరిత్రలనే సాక్ష్యమిత్తును.

Out of 439 girls of High school age who admitted to me that they had sex experiences with

boys only 25 became pregnant. This is about 5% a ratio of 1 in 20. The others avoided pregnancy some by luck others+++by contraceptive methods+++.

During 1920 to 1921 the Juvenile courts of Deniver dealt with 769 delenquient girls of High school age+++At least 2000 cases were directly involved in the case of these 769 girls "++Even the minimum figures are shocking."

'Revolt of Youth"
Judge LINDSEY.

పురుషులతోఁబాటు స్త్రీలకు గూడ విద్య కల్గినయెడల దేశోపకారమగునని తలచి యెన్నియో హైస్కూళ్లు పెట్టబడినవి. అమెరికా దేశమున నొకహైస్కూలులో 439 మంది ఆడపిల్లలు చదువుచుండిరి. నేనొకపుడు వారినడవడికను గూర్చి తెలిసికొనుటకై యాస్కూలునకు వెళ్లితిని. వారి ప్రవర్తనను గూర్చి సత్యముగఁజెప్పుమని ప్రశ్నింపగా వారెల్లరు తమకు స్కూలుబాలురతోఁ కామసంబంధసుఖము కల్గెనని వచించిరి. మఱియు 25 గురు గర్భములు ధరించితిమని చెప్పిరి. మిగిలినవారిలోఁ కొందఱు గర్భములురాకుండ చేసికొనిరి. తదితరులు గర్భముల దింపుకొనిరి. దీనిని నేనుకల్పించినదికాదు.

1920–1921 సంవత్సరములందు హైస్కూలులో చదువుచున్న 769 మంది యువతీరత్నములమీఁద చెడునడతలు గలవని కేసులువచ్చినవి. 760 మందిమీఁద 2 వేల కేసులను

తెచ్చిరి. దీనిని చూచినయెడల హృదయము బ్రద్దలుకాక మానదు.” అని లిండ్సెగారు (జడ్జి) “రివోల్టుఆఫ్‌యూత్” అను గ్రంథమున వ్రాసిరి.

చూచితివా! యువతీ వివాహజనిత నష్టములు. స్త్రీలు రజస్వలలైనది మొదలు, ఏ 25 యేండ్లలోపలనో పెండ్లాడుటకు నిశ్చయించిరనుకొందము. 20 యేండ్లపడుచు పెండ్లాడదలచెనేని యెంతవయస్సుగల పురుషుడు తగియుండునో యోచింపుము. పదునారేండ్ల స్త్రీని 25 యేండ్ల పురుషుడు * గర్భాధాన మొనర్పవలెనని వైద్యశాస్త్రమునగలదు. అట్టి స్థితిలో 20 యేండ్ల యీడుగలస్త్రీ–సుమారు ముప్పదేండ్ల పురుషుని పెండ్లాడవలసి యుండును. స్త్రీపురుషులమధ్య కనీసము 7–8 వత్సరముల తారతమ్యముండవలెనని వైద్యశాస్త్రము మొదలగునవి తెలుపుచున్నవి.

కావున 20 యేండ్లస్త్రీ–28 యేండ్ల వానిని చేపట్టవలసి యుండును. యువతీవివాహములకు సంపూర్ణప్రచారము కల్గెనేని ప్రతిపురుషునకు 25 యేండ్లు దాటినగాని వివాహములు కావు. పరజాతివిద్యల నభ్యసించి–స్వదేశాచారములను మంటగల్పి–దైవభక్తిని మన్నుజేసి–నీతి నియమములులేక మరబియ్యపు తిండితినుచు–ఋతుకాల ప్రకారము ఫలించినవానిని భుజింపనేరక – నకాలన్నిదనుమాని సినీమా మున్నగు వినోదములలో విహరింపుచుండు పురుషులు ఈడుముదురువరకు బ్రహ్మచర్య నియమములు పాటింపగలరని తలపరాదు. అందు

* గర్భాధాన విషయమున రాబోవు గ్రంథములలో వైద్యశాస్త్ర ప్రమాణములు జూపబడును.

వలన పెండ్లికానిపడుచుల చెఱతురు. ఇటుల స్త్రీలెల్లరు రోగములపాలై వానిని పురుషులకంటగట్టుదురు. దేశమంతయు చిలిపి జాడ్యములలోమునుగును. ఈదురవస్థ విదేశములలో నెటుల వ్యాపించెనో చూడుము.

Prostitution and prevalence of venereal diseases are the inevitable consequences of the presence of a large number of adult unmarried men in a society and a large number of illegitimate children. In order to give you an idea of how appalling these evils, are in Europeon countries I would quote the statistics of illegitimacy in some countries in Europe in 1900 from the Encyclopedia Brittanica.

**Out of every 1000 births**

| | |
|---|---|
| 150 | are illegitimate in Bavaria |
| 140 | ,, Austria |
| 121 | ,, Portugal |
| 113 | ,, Sweden |
| 101 | ,, Denmark |
| 90 | ,, Germany |
| 88 | ,, France |
| 80 | ,, Belgium |
| 74 | ,, Norway |
| 68 | ,, Scotland. |
| 49 | ,, Italy |
| 41 | ,, England |
| 36 | ,, Ireland |
| 27 | ,, Russia. |

సమర్తాదులోపల పెండ్లికాని స్త్రీలు ఏసంఘమున నుందురో ఆసంఘమున వ్యభిచారము వృద్ధియగును. మరియు పెండ్లికిపూర్వమే సంతతికల్గుచుండును. నూటికి తొంబది తొమ్మిది మంది స్త్రీలు ఇట్లే బిడ్డలను కనుచుండుటవలన ఆపద్ధతిని దోషముగ నెంచనిదుస్థితి పట్టవచ్చును. అయినను తమబిడ్డలను అనాథశరణాలయములకు రహస్యముగ బంపుచుందురు. అచ్చట నాదుష్టసంతతి పెరిగి పెద్దదగుచుండును. ఇతరదేశములలో యువతీవివాహములు సర్వసాధారణములై యున్నవి. తత్ఫలితముగ 1900 సంవత్సరమున నచ్చట రహస్యముగ జనించిన తెల్లవాళ్ల సంఖ్యను ఎన్‌సైక్లిపీడియా బ్రిటానికా అను గ్రంథమునుండి వివరించుచున్నాను."

—* వెయ్యిమంది జనించినయెడల *—

అం దు లో

| | | | |
|---|---|---|---|
| 150 మంది పిల్లలు | పెండ్లికిపూర్వమె | బవేరియా | దేశమందు పుట్టిరి. |
| 141 | " | ఆస్ట్రియా | " |
| 121 | " | పోర్చుగల్ | " |
| 113 | " | స్వీడెన్ | " |
| 101 | " | డెన్మార్కు | " |
| 90 | " | జర్మనీ | " |
| 88 | " | ఫ్రాన్సు | " |
| 80 | " | బెల్జియం | " |
| 74 | " | నార్వే | " |

| | | | |
|---|---|---|---|
| 68 | ” | స్కాట్లెండు | ” |
| 49 | ” | ఇటలీ | ” |
| 41 | ” | ఇంగ్లండు | ” |
| 36 | ” | ఐర్లెండు | ” |
| 27 | ” | రషియా | ” |

In cities the percentage of illegitimate birth is considerably higher. In Berlin it is as high as 14 per cent. I find in the January, number of the Revieus for 1913 that it has gone up to 20 percent which means that out of every five children born in Berlin one is illegitimate and this in countries where the people know and use preventive precautions against conception.

సగటున దుష్టసంతతి వెయ్యికి ఎంతకలైనో ఇదివరకు తెల్పితిని. ఇపుడు పట్టణములలోని జననములనుగూర్చి ముచ్చటింతును. దేశమున వెయ్యిలో సుమారు నూర్గురు చెడ్డవారై జనింపగా నగరములలో 1000 కి 200 మంది దుష్ట సంతానము (అనగా పెండ్లాడకమునుపే కల్గినవారు) పుట్టు చుండిరి. సారాంశమేమన - 5 గురు పుట్టినయెడల అందులో ఒకడు పెండ్లికిపూర్వము కలైనని తెలియుచున్నది. విద్యనేర్చు కొని పురుషులతోబాటు సమానస్వాతంత్ర్య మనుభవించు చున్న స్త్రీలు-తమకు బిడ్డలుకల్గినయెడల యౌవనము పోవు నని భయపడి సంతతి కలుగకుండుటకై యనేక మాయో పాయము లొనర్చుచుండిరి. అయినను దైవవశమున వారి

యత్నము లోకపుడు భంగమగును. తుదకు పైవిధముగ పుట్టు దురు. ఇట్టి సమయముననే యక్రమము జరుగుచుండ – నిక బిడ్డలనుకనుట కడ్డుపడనిచో–ఆదేశపు జనులెల్లరు దుష్టులై జనింపవలసి యుందురు. ఈమాట సత్యము.”

అని బాబుచారుచంద్ర మిత్రగారు వ్రాసియున్నారు.

మిత్రమా ! తెలిసినదా ! విదేశమందలి వ్యభిచారము. ఇందుకు హేతువు యువతీవివాహములని యెఱుంగుము.

అనార్యుడు:–

అయ్యా ! స్త్రీలు కామమును పట్టజాలరనియు అందు వలన వ్యభిచరింతురనియు జెప్పియుంటిరి. ఇది స్త్రీజాతికొక గొప్పకళంకము కాదా ?

ఆర్యుడు:–

నాయనా ! పైకథలు నేను కల్పించినవి కావు. పరదేశీ యుల గ్రంథములనుండి సాక్ష్యమిచ్చితిని. అంతైనను స్త్రీలే వ్యభిచరింతురని లేదు. పురుషసంబంధము లేకుండ స్త్రీలు వ్యభి చరింతురేని యదివారికి కళంకమగును. వారివ్యభిచారమునకు పురుషుడు సాయపడినపుడే స్త్రీలు వ్యభిచరింతురు. ఎపుడు స్త్రీ–వ్యభిచరించెనో అపుడు పురుషుడును జారుడేయని యెఱుంగవలెను. ఈసుముదిరినపురుషులు వ్యభిచరింతురని పైకథలలో లేదా ? బాల్యవివాహము లొనర్చినయెడల నాక న్యలను ఏ 18 యేండ్ల పురుషుడో లేక 20 యేండ్లవాడో పెండ్లాడి తనకామమును భార్యయందే – విని యోగించును. అందువలన లోకమున వ్యభిచారవృత్తి చాలావఱకునశించును.

రజస్వలయైనవెంటనే కొలదికాలములో స్త్రీలకు గర్భాధాన మొనర్చునెడల వ్యభిచారవృత్తి తగ్గుననుటలో సందియము లేదు. సమర్తాడినపిమ్మట 2, 3, యేండ్లలోనే వ్యభిచరింతు రాయని ప్రశ్నింపకుము. వివాహము కామతృప్తికొఱకేయని తలచినయెడల పైవిధముగ సంభవించుట సహజము. ఎట్లన! యువతి కామపీడితయై తన్నివారణమొనర్చుకొనుటకు పెంగ్లాడును. ఆసమయమున మతనియమముల పాటింపదు. కామ ప్రధానవివాహమువలన జనించిన బాలబాలికలకు సైతము యౌవనమువచ్చుటకు పూర్వమే కామసంకల్పములు గల్గుచుండును. కావుననే-విదేశములందు బాలికలు సమర్తకు పూర్వము బాలురతోగలసి కామచేష్టలు జేయుచుండిరి. ఈవిషయమెచ్చటనో యొకచోట జరిగినదని భ్రమింపరాదు. పలుతావుల నిటుల జరుగుచుండెను. ఆదేశస్థులు తమ గ్రంథములలో గూడ దానిని వ్రాయవలసిన దుస్థితికల్గినది.

A little girl of seven years belonging to a most Refined family had intercourse with her older brother and with several of his friends. Another such case was that of a group of five children, two girls and three boys living near one another in an aristocratic neighbourhood who repeatedly had intercourse with one another and boasted of it to other Children. The oldest of these was a boy of 10 years.

Still another case was that of a girl of nine years living under apparently sheltered circumstances who took a curious pride in having "many lovers."

"Laws of sex"
328 Page.
by HOOKER
quoted from "Uncle Sham"
67 Page.

ఒక నాగరికతగల కుటుంబములో 7 యేండ్ల యీడు గలబిడ్డ తన యన్నతోడను-వాని స్నేహితులతోడను - వ్యభిచరించెను. మఱియొక గృహమున గొప్పధనవంతుల యింటిలో ముగ్గురు మగపిల్లలు-ఇద్దరు ఆడుపిల్లలు పదేండ్లయీడు రానపుడె స్వేచ్ఛగ వ్యభిచరింపుచుండిరి. పిమ్మట తామొనర్చినపనిని స్నేహితులకు చెప్పిరి. మఱియొకయింటిలో తొమ్మిదేండ్ల యీడుగల యొకబిడ్డ తాననేకులతో సంభోగించితినని తన గొప్పతనమును చెప్పుకొనుచుండెను.

"దాంపత్యధర్మము" అను గ్రంథములో హూకర్ దొరచే వ్రాయబడిన పైవిషయములు
"అంకుల్ శామ్" 67 పుటలో నెత్తిచూపబడెను.

It is not very unusual even among the most civilized and wealthy families for little ones of seven and eight to have lovers of about their own age with whom they have sexual intercourse sometimes in the presence of others.

"HOOKER"
328 Page.

ఎక్కువ నాగరికత చెందిన ధనవంతుల యిండ్లలో 7-8 యేండ్ల పిల్లలు ఈడుజోడగు బాలురతో పరులయెదుట వ్యభిచరించుచుండిరి. ఇది బహుప్రదేశములలో సాధారణమై యున్నది అని సూకర్ దొర వ్రాసెను.

ఇట్టి లోకానుభవముచే నీతిమంతులగు ప్రజలు బాల్య వివాహ ప్రచారమును సాగించుటే మానవధర్మమని యెఱుంగ వలెను.

అనార్యుడు:-

అయ్యా! యువతీ వివాహములవలన కలుగునష్టము లింక నెవ్వియైనను గలవా?

ఆర్యుడు:-

మిత్రమా-వినుము. ఇక్కాలపుమనుజులు పూర్వా చారముల నణగద్రొక్కవలెననియు-అటులొనర్చుట దేశ సౌభాగ్యహేతువనియు పల్కుచుందురు.

నాగరికతలో నగ్రగణ్యమైన దేశము ఫ్రాంసుకన్న వేరొండులేదు. అచ్చట స్త్రీలను కేవలము అప్సరసలన వచ్చును. వారియోగ్యతవినుము.

పురుషులను పెండ్లాడినయెడల పరులతో స్వేచ్ఛగ సంచరించుటకు వీలుండదనితలచి యాస్త్రీలు వివాహములు మానిరి. కామమతిశయించినపుడెవనినో కలియుచుండిరి. గృహస్థధర్మనిర్బంధములెవ్వియు వారిని బాధింపవయ్యెను. కొందఱు పెండ్లాడినను బిడ్డలను కనరాదనియత్నించి సంకల్ప సిద్ధులగుచుండిరి. క్రమముగ ప్రజలు విశేషముగ బుట్టుటకు

భంగకరమయ్యెను. జనబాహుళ్యము లేనందున పరరాజులు దాడివెడలుట కవకాశముగల్గెను. ఈస్థితిని గమనించియచ్చటి రాజకీయవేత్తలు కొన్నిశాసనముల నేర్పరచిరి. వానిని వినుము.

French politicians++are now devising all sorts of means to induce people to marry and beget more children.

(1) by exemption of taxes.

(2) by increase of pay to the fathers of children.

(3) by imposition of taxes on bachelors, by grant of bonus and leave on full pay to mothers during and for a short time after confinement.

I స్త్రీలు పెండ్లాడినయెడల వారిపై యదివఱకు విధింపబడిన పన్నులు తొలగించునట్లును,

II పెండ్లియైనపిమ్మట బిడ్డలను కనినయెడల ఆతండ్రులకు ఉద్యోగములలో జీతములు హెచ్చించునట్లును,

III పెండ్లాడని స్త్రీపురుషులపై యెక్కువగ పన్నులు విధించునట్లును,

IV స్త్రీలు గర్భముధరించినయెడల బిడ్డలనుగనుటకు ముందే విశేషధనము బహుమతిగ నొసగునట్లును శాసించిరి.

ఇంతియేగాక - యువతీవివాహము లున్నచోటులలో స్త్రీలు సర్వస్వతంత్రలై నీతిని లెక్కింపక - రహస్యముగ బిడ్డలనుకని పారవేయుటకుబదులు స్వయముగ బెంచుకొను

చుండిరి. తుద కెపుడో యెవనినో పెండ్లాడుచుండిరి. అపుడా బిడ్డలను దగ్గరనుంచుకొనియే అటుల వివాహములు గావించు కొనుచుండిరి.

In some countries the same writer continues, it is said to be almost a universal practice for the women to have sexual relationship before legal marriage, sometimes she marries the first man whom she tries sometimes she tries several before finding the man who suits her +++. Thus in some parts of Straffordshire it is the custom of women to have a child before marriage ++ In Sweeden Ellis states on the authority of Ellenkey the majority of the population begin married life in this way.

"Un-happy India"
214 Page
H. ELLIS.

గొప్పరాజకీయవేత్తయై భారతదేశమున ప్రఖ్యాతి గాంచిన లాలాలజపతిరాయ్‌గారు యువతీవివాహము లొనర్చు దేశములలోని దుర్నీతినెటుల వెల్లడించిరో చూడుము. తగినపురుషుడు లభించుటకై కొందరుస్త్రీలు-ఒక పురుషునిమచ్చుచూచి నచ్చినయెడల నతనినే పెండ్లాడుదురు. మఱికొందఱు-పురుషు లెందఱినో కలసి యనుభవించి రుచింప నందున తుదకెవనినో వరింతురు.

ఈవిధముగ స్ట్రాఫర్డుషైర్‌లో బిడ్డలను గన్నతల్లులకే వివాహములు జరుగుచుండెను.

స్వీడెన్ దేశములో విశేషముగ పిల్లతల్లులకే పెండ్లిండ్లు జరుగుచుండెనని "ఎల్లెంకీ" దార వ్రాసెను.

డెన్మార్కు దేశమందలి ప్రజలలో ననేకులు పెండ్లి కాని స్త్రీలకు జన్మించినవారై యుండిరి.

అన్ హ్యాపీ ఇండియా.
214 పేజీ.

ఈరీతిగ హెచ్-ఎల్లిస్ అను నొకదొర తమదేశములో వైవిధ ముగ నుండెనని వ్రాసెను. దానిని శ్రీ లాలాలజపతిరాయ్ గారు తమ గ్రంథమున పొందుపఱచిరి. యువతీవివాహములు వ్యాపించినందువలన స్వేచ్ఛ పెరిగి నీతినియమముల నెఱుంగక

"They change their husbands as they change their coats."

యువతులు-తాము ధరించిన వస్త్రములను-ప్రతినిమిషమునకు మార్చుకొన్నట్లే - తోచినపుడెల్ల భర్తలనుగూడ మార్చుకొనుచున్నారు."

అనియొక పాశ్చాత్యదేశస్థుడు నుడివెను. కావున విదేశములలోని యనుభవములబట్టి చూచినను యువతీవివాహములు మానవజాతులకు తగవని స్పష్టమగుచున్నవి.

ఇంకొకయుదాహరణ. ఒక విచిత్రమగు వార్తను తెల్పెదను వినుము.

In New Zealand during the period 1913-1921 there were 10841 illigitimate births and legitimate first births within one year after marriage.

"Safe marrige" by
Etti A ROUT
76 Page.

1913 సం॥ మొదలు 1921 సంవత్సరములోపల "న్యూజీలాండు" అను దేశమున పుట్టినజనసంఖ్యలో స్త్రీలకు

పెండ్లియైనపిమ్మట నొకసంవత్సరములోపల భర్తవల్లనో లేక ఇతరులవల్లనో - ఇటుల రెండువిధముల కల్గినసంతానము 10 వేల 8 వందల 41 మంది అయిరి. మొత్తముమీద ఈ సంతతి కేవలము న్యాయమైనదని చెప్పుటకు వీలులేనిదై సంశయించుటకు కారణముగనున్నది.

If to the legitimate births we add the total number of live births accuring within the first 6 months after marriage namely 12235 which may be safely considered to have been conceived before we get a total of 23,079 births in which conception took place extra maritally.

Etty A Rout

పైవిధముగ పుట్టిన సంతతిగాక మఱియొకరకమైన జనులు పుట్టుటయు నాదేశమున వ్యాప్తిలోనున్నది. ఆబిడ్డలు- పెండ్లియైన ఆరునెలలలోపల జనించిరి. అటులపుట్టినవారు 12 వేల 2 వందల ముప్పదియైదుగురు కలరు. పెండ్లికిపూర్వమే స్త్రీలు గర్భములధరించి యీవిషయము బయటపడునేమో యను భయముచే మూడు నాలుగు నెలలైనపిమ్మట పెండ్లాడగా వారుకల్గిరి.

దీనింబట్టి నూటికి 50 మంది తండ్రియెవడో యెఱుంగని జనులు యువతీవివాహములవలన జనింపగలరని స్పష్టమగుచున్నది.

The remedy for this state of things is obviously early marriage and birth control·

Etty of ROUT.
76 Page.

ఈ గొప్పవిపత్తునుండి దేశమును మరల్చుటకును - జాతిని నీతిమంతముగ నొనర్చుటకును తగినచికిత్స బాల్య వివాహముకంటె వేరొండులేదు.

అని ఎట్టి-ఏ-రొట్ అను పాశ్చాత్యపండితుడు "సురక్షిత వివాహము" అను గ్రంథములో 76 వ పేజీయందు వ్రాసెను.

తెలిసెనా ? ఇతరదేశములలోని యువతీవివాహ ఫలములు. అచ్చట జనించిన దుష్టసంతానము యొక్క జాబితాను యీక్రిందివిధముగ గమనింపుము.

| సంవత్సరము | దేశము | మొత్తముమీద పుట్టిన బిడ్డలు | పెండ్లికాక మునుపు జనించిన శిశువులు |
|---|---|---|---|
| 1922 | బెల్జియం | 1,53,611 | 9,218 |
| 1922 | డెన్మార్కు | 73,866 | 7,681 |
| 1926 | ఇంగ్లాండు | 6,94,563 | 29,591 |
| 1921 | ఫిన్ లాండ్ | 82,165 | 7,803 |
| 1922 | ఫ్రాంసు | 7,59,864 | 65,568 |
| 1921 | జర్మనీ | 16,11,420 | 1,73,169 |
| 1922 | ఇటలీ | 11,24,512 | 49,841 |
| 1921 | నెదర్లాండు | 1,81,186 | 3,652 |
| 1921 | నార్వే | 64,857 | 5,018 |
| 1926 | స్కాట్లాండు | 1,02,449 | 7,046 |
| 1919 | స్వీడెన్ | 1,15,193 | 15,063 |

whitakirs Almance 1929.
విటేకరు 1929 పంచాంగము.

ఇక ఇంగ్లండునందలి దుష్టసంతానము వినుము.

| సంవత్సరము | పెండ్లిండ్ల సంఖ్య | దుష్ట సంతానము |
|---|---|---|
| 1922 | 2,99,524 | 34,138 |
| 1923 | 2,92,408 | 31,522 |
| 1927 | 3,08,370 | 28,454 |
| 1928 | 3,02,870 | 29,071 |

మిత్రమా! ఎచ్చట వర్ణాశ్రమ ధర్మప్రచారము లేదో వేదమతవ్యాప్తి కలుగకుండెనో-ఆధ్యాత్మిక బుద్ధులు లేకుండెనో-అచ్చట యువతీవివాహములు ప్రబలి నీతిబాహ్యులైన జనులు జన్మింతురు. వారు పరదేశాక్రమణ బుద్ధులుకల్గి-నిరంతర యుద్ధసన్నద్ధు లగుచుందురు. తుదకు దేశమును శ్మశానభూమిగ జేయుదురు.

What is happening to the domestic life of the Anglo-Saxon race? It is the same tale wherever the English tongue is spoken-more hotels-fewer homes more divorces, fewer children.

Dr. MEYRICK BOOTH
in his "woman and
Society."

ఇంగ్లీషు జాతిలో జీవయాత్ర యొక్క దురవస్థల గమనింపుము. ఎక్కడ ఇంగ్లీషుభాష వ్యాపకమై యున్నదో అచ్చట మితిమీరిన పూటకూళ్లిండ్లును-స్వల్పముగ సంసారములొనర్చు గృహములును-విశేషముగ భగ్నలు

భార్యలను-భార్యలు-భర్తలను-విడిచి పెట్టుటయును, సంతానమును తక్కువగ కనుటయును నివి ప్రధానములై యున్నవి.

అని డాక్టర్-మెరిక్ బూత్ అనువాడు
"స్త్రీ-మఱియు-సంఘము" అను
గ్రంథమున వ్రాసెను.

ఈదోషమంతయు భాషయొక్క మహిమగనున్నట్లు తోచుచున్నది. కావుననే భారతదేశమున నెన్నడెరుంగని సంఘసంస్కారబుద్ధులు-ఆంగ్లమానస పుత్రులగు భారతీయులకు కల్గుచున్నవి. ప్రతిగ్రామమున నేడు కాఫీహొటల్లే కలవు. స్త్రీసంఘములు బయలువెడలి వివాహవిచ్ఛేదపు బిల్లు (అనగా యిష్టములేనియెడల భర్తను విడిచిపెట్టు శాసనము) కావలెనని తీర్మానములు గావించుచున్నవి.

ఈనడుమ బెంగాలులో పురుషుడు రెండవపెండ్లి చేసికొన్నయెడల విధవలనే పెండ్లాడవలెనని యొక శాసనము ప్రవేశపెట్టబడినది. మఱియు దేశమందెల్లెడల స్త్రీలకు పురుషులతో బాటు తండ్రిగారియొక్క యాస్తిని పంచుకొనుటలో సమానాధికార ముండవలెనని యాందోళనములు జరుగుచున్నవి. ఈదురాచార పిశాచావేశమునకు గారణము-ఆంగ్లభాషగాక మఱియేమి ? ఏనాడు సంస్కృతభాషా ప్రచారము తగ్గుటకు మొదలిడి విదేశభాషా వ్యాప్తి కల్గెనో-ఆనాడే ధార్మికసంకల్పములు నశించి పశుస్వభావము లంకురించుటకు మొదలిడెను.

మానవజాతిలో నీతి-ధర్మము-పారిశుద్ధ్యము - మున్నగునవి స్థాపింపబడవలెననిన-వివాహనియమములు బోధింపనిమతప్రచారము - నీతిపాఠములు-రాజ శా స న ము లు ని-స్వరాజ్య ప్ర భు త్వ ము - సాంఘికపద్ధతులు ఫలవంతములు కాజాలవు. ఇదేభావమును ఒక పాశ్చాత్య పండితుడు నుడివెను.

It (Marriage suecesful) remains a necessity if man does not wish to sink into decadence and thence gravitate towards the level of the brute. Macfadden in "Manhood and marriage 89 Page.

మానవజాతి క్రమముగ క్షీణింపకుండుటకును-పశుసమానుడు కాకుండుటకును - ముఖ్యసాధనము పవిత్రమగు వివాహబంధముతప్ప వేరొండులేదు."

అని మ్యాక్ ఫెడెక్ అను విదేశీయ పండితుడు "మానవత్వము మఱియు వివాహము." అను గ్రంథమున ౮౨ వ పేజీలో వ్రాసెను.

ఇతరదేశస్థులెటుల తమ వివాహపద్ధతులను నిందించుచున్నారో పైవాక్యములవల్ల స్పష్టమగుచున్నది. వారి దేశమున విశేషముగ స్త్రీలవలననే మహానర్థము సంభవించుచున్నదని యాదేశపు చరిత్రకారులెల్లరు వ్రాయుచున్నారు. అందుకు కారణము స్త్రీలకొసంగబడిన స్వాతంత్రమేయనుట నిక్కము.

The modern world is full of false ideas crystalized into axioms. It is these conglomeretions of errors which more than any thing else, frustrate every attempt to reach a satisfactory solution of the problem of the modern girl and her relation to society.

Dr. MEYRICK BOOTHE
in "women and Society"

ప్రస్తుతప్రపంచము పూర్తిగ అసత్యసిద్ధాంతములతో నిండియున్నది. ఘోరమైన నీనేరములు గడ్డకట్టి యీకాలపు బాలికలను సంఘోపకార మొనర్పకుండునటుల జేయుచున్నవి. అని "డాక్టర్-మేరిక్ బూత్." "స్త్రీ-మఱియు సంఘము" అను గ్రంథమున వ్రాసెను. దీనికంతకు కారణము స్త్రీలకు సంపూర్ణస్వాతంత్ర్య మొసంగుటచేతను-యువతీ వివాహములు వ్యాపించుటచేతనని యెఱుంగుము.

అనార్యుడు:-

అయ్యా! పెండ్లియగులోపల స్త్రీలు వ్యభిచరింతురనియు రహస్యసంతానమును కని పారవేయుదురనియు-నింకను స్వేచ్ఛగల్గినయెడల చంకబిడ్డలతో పెండ్లాడుదురనియు, తెల్పియుంటిరి. ఇవియేనా నష్టములు?

ఆర్యుడు:-

ఓయీ! ఆనష్టములంతటితో పూర్తికాలేదు. మంచి వరునికై పరీక్షించి తుదకెవనినో తగినవాడని నిశ్చయించి కొంతకాలమతనితో కాపుర మొనర్చి-క్రమముగ నతనిగుణములు తనకు నచ్చనందున వానిని విడచి వేరొకని చేపట్టు

టకు యత్నించునట్టి దుర్దశయు కలుగును. తన కెవ్వడు సరి పడునని యూహించునో యతడు వేరొకస్త్రీని పెండ్లాడి యుండినను అతని కెన్నియో యాశలుజూపి యాదాంపత్యమును భంగమొనర్చి వారిసంసారమునకు నిప్పుపెట్టి యనేక మాయోపాయములచేత నతనిని చేపట్టుటకు స్త్రీలు యత్నింతురు.

ఈవిధముగ లోకమున గృహస్థధర్మము మంటగలియును. మానవజాతియందు పారిశుద్ధ్యము పాడగును. ఈ దుర్దశ యువతీవివాహములుగల దేశములలో నెటుల వ్యాపించియున్నదో చూడుము.

The number of divorces granted in the U. S. A. increased from 25000 (Per annum) in 1886 to 72000 in 1906.

అమెరికా దేశమున యునైటెడ్ స్టేట్సులో 1886 వత్సరమున 25 వేలు మంది భార్యాభర్తలు తమలోతమకు సరిపడ లేదనియు, వివాహబంధమును తెంపుకొనవలెననియు-కోర్టులో దావాలుచేసిరి. వెంటనే జడ్జిగారు వారికోర్కెప్రకారము తీర్మానమొనర్చిరి. పిమ్మట 20 సంవత్సరములకు అనగా 1906 వ సంవత్సరమువరకు నిట్టి దావాలు (కేసులు) ఏవిధముగ వృద్ధిపొందెనో చూడుము. ప్రతిసంవత్సరము 72 వేల చొప్పున వృద్ధిగాంచెను. ఏటేట మూడురెట్లవంతున విడుదల పత్రిములు పెరుగుచున్నట్లు తేలినది. ఈ కేసులను తీర్పుచేయుటకై సివిల్-క్రిమినల్ కోర్టులు చాలక డైవర్సు కోర్టు అనగా వివాహములను త్రెంపుటకై యేర్పడిన న్యాయ

స్థానములు క్రొత్తగా పెట్టబడినవి. ఉన్నకోర్టులవల్లనే దేశము పాడగుచుండ యువతీవివాహములు ఇంకను క్రొత్తకోర్టులను పెట్టించి మానవ రక్తమును పీల్చునుకదా. ఐకమత్యమును గలుగజేయుటకు బదులు నింటింట దంపతీకలహముల బుట్టించుటకు రాజ్యాంగతంత్రము ముఖ్యసాధన మగుచున్నది.

ఎట్టివిత్తనమో అట్టిఫలము గలుగుచుండునను సూత్రము జ్ఞప్తికి దెచ్చుకొనుము. ప్రజలలో భేదములుకల్పించి పాలించునట్టి సూత్రములు హైందవపరిభుత్వమున నెన్నడును కనియుండలేదు. దేశక్షేమమునకు గృహమేబునాది. అట్టి గృహమున తగినకట్టుదిట్టములు చేయలేనిరాజ్యము - తనగొయ్యి తాను త్రవ్వుకొన్నటుల నుండెనని యెఱింగినబాగుండును. మానవుడు దూరదృష్టి కలవాడయ్యు నేడు పశుస్వభావమును పొంది తాత్కాలిక సుఖాపేక్షకు వశుడగుచున్నాడు.

విదేశములలో నొక్కొకపట్టణమును విమర్శించి జూచినయెడల వివాహవిచ్ఛేదసంఖ్య మితిమీఱి పెరుగుచు నెటుల గుండె బ్రద్దలుజేయుచున్నదో చూడుము.

If there were 39000 marriages in Chicago in the year of grace 1922 it is absurdly conservative that fully 26000 would have gotten divorces if they could in addition to the 13000 who did.

The Revolt of Youth" 212 Page.

అమెరికాదేశమున చికాగోయను నొకపట్టణము గలదు. అందు 1922 వ సంవత్సరమున 39 వేల పెండ్లిండ్లు జరిగెను. వానిలో 13 వేల దంపతులు తమలో నొకరికొకరికి జంట కుదురలేదని చెప్పి కోర్టులో దావాచేసిరి. మిగిలిన

26 వేలమంది బహిరంగముగా కోర్టునకెక్కుచున్నను రహస్యముగ వారి గృహస్థధర్మమును నడపుకొనక స్వేచ్ఛావిహారులై వర్తింపుచున్నారు. అని విదేశచరిత్రలు తెలుపుచున్నవి.

"రివోల్టుఆఫ్ యూత్" అనుగ్రంథ
మున 212 పుట.

ఈ పట్టణముననేగాక ఆదేశమందలి నగరములన్నియు నిట్లే యుండెనట.

The number of seperations including divorces is now annually equal to the number of marriage licences granted (in denver) and what is true of Denver is as I have already said just as true of other cities.

214 Page.

డెన్వార్ జిల్లాలోని పెండ్లిండ్లయొక్క ఫలితములు వివాహ విచ్ఛేదరూపమున పరిణమించి పైపర్సుకోర్టుల కెక్కుచున్నట్లు-అమెరికాలో సైతము ప్రతిపట్టణమున నటులనే వృద్ధిగాంచుచున్నవి. (214 పుట.)

* ఈ వివాహ విచ్ఛేదములు భార్యాభర్తల కొక్కసారి జరిగిన కొంతవరకు యోగ్యముగ నుండెడిది. రెండవభర్తలభించినను స్వాతంత్ర్యేచ్ఛగల స్త్రీలు తృప్తిజెందరు. 10,12 పర్యాయములు సైతము పూర్వభర్తలను విడచి నూతనవరులను గూడుచుందురు. ఇదియెంత నీచమో గమనింపుడు.

---

* వివాహ విచ్ఛేదమనగా భార్యాభర్తలు తమ వివాహబంధమును త్రెంపుకొనుట.